# అశోకరాజ్యము.

Asoka Rajyamu.





క వి రా జ

కాండూరు నరసింహాచార్యులు.

# అశోక రాజ్యము.

## (చారిత్రక ప్రబంధము.)



గ్రంథకర్త:
సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ,
కవిరాజ, వైద్య
కాండూరు నరసింహాచార్యులు,
ప్రధానాంధ్రపండితులు,
పి. ఆర్. బోర్డు హైస్కూల్, జమ్మలమడుగు.



తాడిపత్రి దేశబంధు ముద్రణాలయమున ముద్రితము.
1954.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

ప్రకాశకుడు: కే. రంగరామానుజాచార్యులు.

 వెల రూ. 2-0-0

# విషయసూచిక.



# FORWARD.



The choice of the hero by the poet is apt, timely and praiseworthy. Asoka was the greatest ruler, of India whose fame spread far and wide in the world. In these days of world wide unrest, hypocracy and jealousy, the memory of such an exceptionally peace-loving monarch is quite welcoming, and the author has greatly fulfilled his aim. The dry bones of historical personages had come to life in his artistic hand and they seem more real than the people whom we come across in our daily life. Such is the work of a great art and such is the worth of a great poet.

That historical day in the life of Asoka which had brought a turning point in his life is portrayed in a life like manner. The poet's mental vision had penetrated into the depths of Asoka's being and brought to the surface, the surging thoughts piognant feelings and remorse. That deadly battle which had brought havoc, horror, desolation, and destruction was picturesquly dercribed by this eminent poet.

Recently Sri K. Narasimha Charyulu, the poet of this book has been greatly honoured by our poet laureate Sripada Krishna Moorthy Sastry for his astounding peotic talents and scholarly spontaneous fluency of poetry. "Kaviraja" title was suitably confirmed on him. This author had also written many valuable books This monumental work on Asoka's life richly deserves a state wide appreciation, and honour. I am sure that this precious gem would radiate its lustre in all directions.

JAMMALAMADUGU.
28th July, 1954.

K. V. SUBBA RAO, M. A., B. T.,

శ్రీః

# — సమీక్ష —

కవి క్రాంతదర్శి, భావనా వనవిహారి. ప్రతిభా సంపన్నుఁడు. వ్యుత్పత్తి విలసితుఁడు. అతఁడు భావనావనములో స్వేచ్ఛా విహారము గావించుచు మధురమధురములైన కావ్యఫలములను లోకమున కందించును. తానే సృష్టికర్తయై కావ్యజగత్తును సృజించును. కావ్య జగము ప్రత్యక్ష జగమునకన్న విశాలమైనది.

ప్రతిభా వ్యుత్పత్తులు కవి కావశ్యకములు. అవి కలవాఁడే కవి. అట్టి కవి కావ్యరూపేణ లోకమునకు హితమును గూర్చును. సంఘమును సంస్కరించును. కావ్యరచన పద్యగద్య మిశ్రరూపమున వెలయుచున్నది.

ఆంధ్రభాషా కవులకు సాధారణముగ పద్యముపై నున్నంత మక్కువ వచనమునందుండదు. వచనమునందు మక్కువయున్నను కేవల వచనకావ్యమును సామాన్యముగ సంతరింపరు. దూరదృష్టితో చూచి నచో పద్యమునకుఁగల లగువు బిగువులన్నియు, వచనమునకు లేవని కాదు. కాని యాంధ్ర సరస్వతి పద్యవీచికలలో నుయ్యల లూగుచు, తన హావభావముల ప్రదర్శించునట్లు గద్యవీచికల విహరింపఁజాలదని పరం పరాగతమయిన కవి సంప్రదాయమైనట్లు తోచుచున్నది. కనుకనే మహా కవులందఱు పద్యకావ్యరచనకు పూనికొనిరి కాఁబోలు.

అశోకరాజ్యము పద్యకావ్యము. ముద్దుగా ముచ్చటగా నున్న మూఁడాశ్వాసముల మహాప్రబంధము. మూఁడు మాసముల కాల వ్యవ ధిలో కుంటులేక గునగున నడచి సర్వాంగ సుందరముగా తయారైన రచన. రచించినవారు సాహిత్య శిరోమణి ఉభయభాషా ప్రవీణ కవిరాజ కొండూరు నరసింహాచార్యులవారు. వీ రితః పూర్వమే మోహానవిజయ,

రామరాజ్యాది గ్రంథరచనచే లోకమునకు సుపరిచితులు. సంస్కృతాంధ్రములయందు నికరమైన పాండిత్యమును సంపాదించుకొన్న విద్యాతపస్వులు. కావ్య ప్రకాశికకు వివరణమును వ్రాసి పండిత లోకమున నమిత గౌరవమును సంపాదించుకొన్నారు.

ఈయన బహుగ్రంథకర్త.

కావ్యప్రకాశ వివరణము, హర్షుడు కలభాషిణీ చరిత్రము, భీష్ముడు, చంద్రాపీడుడు నీతిలత, రంగధామ శతకము, మోహన విజయము, వినోద బహిష్కరణములు, రామరాజ్యము పూలతోట—. ఇవి వీరి యితర రచనలు—.

ఇపుడు ఈకవిరాజుగారు "అశోక రాజ్యమును" సంతరించిరి. కథావస్తువు చరిత్రాత్మకమైనది. నాయకుడు కావ్యరచనకుఁ దగిన వాఁడు. కవి కొమ్ములు దిరిగినవాఁడయ్యును కథావస్తువు పేలవమైన దయినచో రచనరక్తి గట్టదు. ఇట కవికి తగిన కథావస్తువు లభించుటచే బంగరునకు పరిమళ మబ్బినట్లయినది. రచన- చారు తరంపు సొంపుల తోడను, సరసంపుఁబద ప్రసరంపు జాడలతోడను, ఒయ్యారము కుల్కు తళ్కులతోడను మృదుహాసము లొల్కెడు భావగౌరవంబుల తోడను, సాగినది.

వర్ణనలు సందర్భశుద్ధిని సము పార్జించుకొన్నవి. పాత్ర పోషణములో కవి చాతుర్యమును బ్రకటింపగల్గెను. శ్రమణకమాని పాత్ర, కంటికి కనుపించని నలుసువంటి పాత్ర- అయినను నా పాత్రను పోషించుటలో కవిచాతుర్య మమోఘము.

దేశము నేకచ్ఛత్రాధిపత్యముతోఁ బరిపాలించు నశోక సామ్రాట్టుతో శ్రమణకుఁడు సంభాషించును. "వచోవ్యాపార ధౌరేయసజ్జనతా సాంద్రమృదు ప్రబోధముల" భూజానిని పల్కరించినాఁడు. కుశల ప్రశ్నలను గావించినాఁడు. "సాధులవేట లాడు సరసాత్ములు రాజులు" అని

యొకించుక పొడుపు మాటలను వెదజిమ్మినాఁడు. బలపరాక్రమ సంపన్నుఁడవు ధీరుఁడవు. జింకలను వేటాడుట తగునా? అని మందలించి నాఁడు. తిన్నని పలుకులతో రాజు హృదయమును మార్చఁదలచెఁ కాబోలు.

“తలఁచెనె హింస నేరికి నెదందలపోసెనె కార్యఘాతముం దల కొనెనే దురాశలు మనంబునఁ గోరెనెయన్య విత్తముల్ పలువతనంబునం బ్రజకు వంచనఁగోరెనె? యేమిసేసె నీ విలఁబడనేయ సాధు విధి యేగతి నుండెనో చూడు పార్థివా!” అని వచించినాఁడు. ఇట “పార్థివా” అనుటలో దళప్రయోజన పాటవము కనుపించుచున్నది. పార్థివా! అని ప్రయోగించిన కారణమున పార్థివుని లక్షణములు కొన్ని చెప్పవలసి వచ్చినది.

“పెద్దలయందు గౌరవము పేదలయందు దయారసంబు దుర్బుద్ధుల యందుపేక్ష సమబుద్ధి ప్రజావళిఁగల్గు వాఁడునై యుద్ధురభావముల్ద్రొడిఁగి యుర్విని సజ్జనదుర్జనావళిం బుద్ధి నెఱుంగువాఁడెగద పూజ్యతముండగు రా జెఱుంగవే” అని నాఁడు. చివరకు మృదు ప్రియవాక్యములతో రాజు హృదయమును మార్చినాఁడు.

“అష్టాంగముల మార్గమరసిననేగాని
దుఃఖోపశాంతికిఁ ద్రోవఁ గనఁడు.”

“హింసయొనర్చువాఁడు తన హింసకె బాటలు వేయుచుండు” మొదలగు నీతివాక్యరత్నముల వెదఁజిమ్మినాఁడు. ఈఘట్టములో సంభాషణ బహు చమత్కృతి జనకముగా నున్నది. రాజును, మౌనియు పాఠకునకు ప్రత్యక్షమై సంభాషణ నెఱపినట్లుండును. చివరకు రాజచంద్రుని చిత్తము “మునిసుబోధము ఛాయమైయె ముందు నిలువ- సరసముగ దా నిగ్రహియించు జంత్రో” మైనది. “చాలు నిఁక వేట నగరికిఁ జనుఁడని” యశోకుఁడు మంత్రులను హెచ్చరించినాఁడు. వేట మమతను వీడెను

స్వల్పమైన శ్రీమణుని పాత్రయే యింపు సొంపులతోఁ బోషింపఁబడి యుండ హెచ్చుస్థితిలోనున్న పాత్రలను పోషించుటలో కవి చూపిన చాతుర్యమును వివరింప నవసరము లేదని భావింతును.

ఈకావ్యమునందు దయావీరము ప్రధానరసము. ఇతర రసము లంగములు. నాయకుఁడు ధీరోదాత్తుఁడు. ప్రథమాశ్వాసమునందే నాయకుని పరిచయము చేయుట ముదావహము.

నగర ఋతు, వన, యుద్ధ, మృగయాది వర్ణనములు చిత్రకారుఁడు చిత్రించిన చిత్రములవలె హృదయంగమముగనున్నవి. లాక్షణికులు చెప్పిన కావ్యలక్షణము లిందు బాగుగాఁ బొసఁగినవి.

ఈకవి సీసపద్యము లల్లుటలో కడు నేర్పరి. ప్రతి సీదపద్యమును మదపుటేనుగు గమనముతో నొప్పచుఁ జదువఁ జదువఁ జవులూరించుచుండును. మచ్చునకు

"నానామణి ప్రోతశోణా తటోద్భూత
రంభాతరువ్రాతరంజనముల
అంతరాంతర దీప్తి కాంత దీపపుఁగాంతి
చంద్రికాధవళాప్తి సాంద్రరుచుల
ఘనసారచందనాగరు గంధ సంబంధ
వాసితోన్నిద్ర నివాసతతుల
సంగీతసాహిత్య సరసాభినయ నృత్య
శృంగారితోత్సంగ రంగరుచుల
సౌధములతీరు స్వర్గంపు సౌరుఁగేరు
ముగ్ధకాముక యువకుల ముద్దుఁగోరుఁ
జొచ్చికనుఁగొన్నఁ బాటలి సొబగు వేయు
సందడింపంగఁ బట్టంపు సంబరములు."

"లలిత చిత్రకళా విలాసమ్ముల వెలయించి
పొంగిచెలంగిన పుణ్యభూమి
సంగీతసాహిత్య శాస్త్రమ్ములను పెంచు
పాఠశాలలు మించు ప్రౌఢభూమి
నాట్యంబు శిల్పంబునయమగు నాలేఖ్య
మడరి దిశల్ప్రాకు సతులభూమి
వేదాంతమతవిద్య విశ్రుత బౌద్ధంబు
పేరు మోసినయట్టి సారభూమి
రమణ శృంగారవనముల రంగభూమి
బహుకళాకోవిదుల కుదిరిపట్టు భూమి
దేశదేశాలఁ బ్రథితనౌ దివ్యభూమి"
లీలలనుమించె నపుడు కళింగభూమి"

వలయుచోట పదాడంబరమును ప్రకటించుటకు వెనుదీయరు.

"అటఁజనికాంచె నద్భుత మహానది తీరమునందు భాసిలం గటక చరత్కరేణు కరకంపితసాల మహేంద్రశైల సోద్భట నికటప్రదేశ బల వత్ప్రహరీవృత సౌధజాల సద్భట నటనానుకూల పటువైభవశోభితమైన తోసలిన్.

ఈపద్యము పెద్దన్న నడకనుపోలి తోసలినగర ప్రాశస్త్యమును చాటుచున్నది. ఈసందర్భమున చిన్నచిన్న పదములతో తేటగీతినో యాట వెలదినో వ్రాయక సమాసబంధురమైన వృత్తము నుపయోగించి, యాచార్యులవారు వృత్తౌచిత్యమును పాటించుటలో నేర్పరు లనిపించు కొనిరి. పద్యములలో యతిగణప్రాసలు వానికై యవి పరుగిడుచు వచ్చి వానివాని స్థానములలో చేరినవి.

"రాజయి పుట్టుకంటెఁ గవిరాజయి పుట్టట కొంతమేలు, రేరాజు, వసంతరాజు వలరాజును గొల్వఁగ నిశ్చలాత్ముఁడై రాజిలు కావ్యకాంత

వన రాజముల న్విహరించుచుండు రారాజయినం ధరిత్రి భోగరాజుఁ నరాజక ముండకుండునే"

""పారమునీటి పై కెగయువారిధి వీచికల ట్లపారమై ధారలు ధారలై పలువిధంబుల ధారల యశ్వధార లాధారము లేక లెక్కఁడఁగ దాడులఁదీయుచు శత్రుభీకరాకారతఁ గ్రాలుచుండెఁ గడఁకం, దుడుకు ల్విడఁకం దలంకఁగన్"

ఈక్రింది పద్యము మాధుర్యగుణముతో నొప్పుచు, ఆనందమును గుబాళించుచున్నది.

""తనలోఁబొంగెడు భావవీచికల చెంతండాఁగి గిల్గింత వెట్టిన యంతం జిగురించు భంగిఁ గడు దట్టింగొన్న హావంబు లొక్కనిమేషంబున హాస రూపమయి పొంగంబాఱె నాగావళీ వనజాతేక్షణకప్పు మాట చెవుల న్వాతాహతిన్ దూలగన్'' వేగమును వర్ణించుటలో చమత్కారము.

""ఒత్తుగ శత్రువుల త్తిమి యొత్తెడు వేగము తొందరింపఁగం జిత్తమునొత్తి యొత్తి పరిశీలనఁజేసెడు నాత్మవేగముం దత్తరపెట్టుచుండ, జవనాశ్వపు వేగము ముందుఁ దూఁకఁగన్.

సత్తుగనొక్క వేగమయిసాగెఁ బ్రయాణము గుర్రక్క లోపలన్''
తియ్య తియ్యని తేటగీత లెన్నెనిగలవు.

""పశువులకు మేఁత పేదకుఁ బయలుమూఁత
పసిమి మిసమిస నేత్రసాఫల్యనేత
ప్రకృతిమాతను కైసేయు పట్టుపూఁత
కాలిక్రిందిది కాదె యీగడ్డిపోఁచ.''
"మరుదినంబున నుదయాన మంత్రులరిగి
వేఁటతమకంబు పైకొను వేడ్కఁ దెలుపఁ
జాలునీశ వేఁట నగరికిఁ జనుఁడనంగ
నూరుఁజేరెను పరిజనవారమెల్ల."

కందపద్యములు కమ్మ కమ్మగ సాగినవి.

"కూడిరి గుంపుగ నొక్కట
నాడిరి కౌతుకమెసంగ నడవి చలింపఁ
బాడిరి పౌరుష మడరగ
వీడిరి తెగతెగలుగాఁగ వేటాడుటకున్.

ఇప్పటి గంజాంమండల
మప్పటి మాహేంద్రపర్వతా వృతమయి సొం
పొప్పఁ గళింగముఁ నాఁజను
చొప్పడఁ దనరూపు రేక సొగసుల కిరవై."

ఉన్నట్టుండి. అటు తరువాత, తోసలి కేసి చూచి, మొదలగు వాడుక పదములును, స్టేషను మొదలగు నన్యదేశీయ పదములును, వాడబడినవి. లోకోక్తులు, ఉపమానములు, అర్థాంతరన్యాసములు రమణీయముగఁ బొసఁగబడినవి. ఆర్కాయలు, యెర్గి, తిర్గి అప్పు మున్నగు ప్రయోగములు వ్యాకరణ సమ్మతములే యయినను, శ్రుతిరంజకత లేదనుకొందును. తృతీయాశ్వాసములో కథాప్రసక్తి లేకున్నను, రచన గంభీరముగా సాగినది.

మొత్తముమీఁద

కావ్యలక్షణముల నాకళించుకొన్న కావ్యమై హృద్యములైన పద్యములు గలిగి సందర్భమునకుఁ దగిన పదప్రయోగములు గలిగి యింపు సొంపుల సంపాదించుకొని వృత్తి రీతి గుణాలంకారముల నలంకరించుకొని చదువఁ జదువఁ జవులూరించు నీమహాకావ్యము ఆంధ్ర సరస్వతికి ప్రధాన భూషణము కాగలదు.

ఈయన విద్వత్కవి యగుటచేతను, కథావస్తువు సరసమయినదగుటచేతను, నీ కావ్యము లోకమునందు శాశ్వత గౌరవము నందఁగలదు.

జమ్మలమడుగు పౌరులీ కవిగారికి జరిపిన సన్మానసభలో కవి రాజబిరుద మొసఁగుచు శ్రీ శ్రీ మహామహోపాధ్యాయ ఆస్థానకవి శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు.

"కవులకు రాజు వటంచును
సవిమర్శముగాఁగ బుధులు జమ్మలమడకన్
కవిరాజబిరుద మొసఁగిరి
శివమగునది నీకు నారసింహాచార్యా!"

అని పంపిన సందేశమును.

శ్రీ శ్రీ మహాకవి కవిసింహ గడియారము వేంకటశేషశాస్త్రిగారు.

"నిపుణప్రజ్ఞను సంస్కృతాంధ్రముల పాండిత్యంబు సాధించి భావపదార్థౌచితి మీఱ హృద్యముగ కావ్యమ్ముల్ నిబంధించి సత్య పథంబున్ వెలయించు సత్కవి నృసింహాచార్యు లేతత్సభాభ్యుపపాద్యత్కవి రాజ సద్బిరుదమున్ భూషించి రాణించుతన్".అని చూపిన యాదరమును, వీరి ప్రతిభను చాటుటకు సమర్థములై యున్నవి.

స్వతంత్ర భారతదేశమున, నందును స్వతంత్రాంధ్రరాష్ట్రమున నిట్టి మహాకావ్యరచనల కెంతేని యవకాశము గలదు. ప్రభుత్వమును, పౌరులును, నభిమానించి యుత్తమ మహాకావ్యరత్నముల యుత్పత్తికిఁ దోడ్పడుదురుగాక.

జమ్మలమడుగు.
2-8-1954

విద్వాన్.
కొరటమద్ది సుబ్బనరసింహాశర్మ,
ఆంధ్రపండితుఁడు,
బోర్డు గర్ల్సు హైస్కూలు, జమ్మలమడుగు.

# విజ్ఞప్తి.

భగవద్విలాసము విచిత్రము. దాని యాంతర్య మూహాతీతము. కాల ప్రవాహమున లీనమై ప్రకృతినిఁ జిత్రవిచిత్రగతులఁ ద్రిప్పుట దీని యలవాటు. నేఁడు వాక్శూరులకే యెక్కువ విలువ. కార్యశూరులున్నను నిప్పటి బూటకపుఁ బ్రపంచమునకు వా రగోచరులు. ప్రతివాఁడును తనంతటివాఁడు లేఁడనుకొనుట పరిపాటి.

పరతంత్రమై యున్నంత కాలము దాస్యపటలావృతమై యున్న భారతీయ జాతీయతాజ్యోతి స్వాతంత్ర్యవాయువు సోఁకినంతన యొక్కసారిగ నెల్లర హృదయములఁ జక్కఁవొడిచి నలుగడల వెలుఁగులఁ జిమ్మ సాగినది. జాతీయ సంస్కృతి సంప్రదాయముల నాకాంక్షించినది. సర్వతోముఖముగ నభ్యుదయ పరంపరా వికాసముల నాశించినది. కాని కార్యపరతంత్రులు కానిది యాశించినంత మాత్రమున లాభమేమి?

రంగము లలంకరించి మన నాయకులు, మన సారస్వతము, మన సాహిత్యము, మన జాతీయత, మన సంస్కృతిఁ దినదినాభివృద్ధి చెందవలయునని చెవులు గింగురుమన గంటలు మ్రోఁగింపసాగిరి. కాని యొక ప్రక్కనుండి యేవిచిత్ర సంప్రదాయ సంపర్క వాసనా బలముచేతనో పూర్వ సంప్రదాయములు, సాహిత్యములు పనికి రావనియు పైపై మెఱుఁగు పూఁతల తళతళలు విఱఁజిమ్ము నవ్యరీతు లభ్యుదయ సాధకము లనుచు వంకరటింకర జిలిబిలి పలుకులు గజ్జెలు కట్టుకొని యాడఁదొడఁగినవి. కాలగతి వానికి తాళము వేసినది. ఏది యభ్యుదయ సాధకమో, యేది కాదో, యెవరు నిశ్చయించువారు. ఇది ప్రజాప్రభుత్వము. అందఱు స్వతంత్రులే. మంచిచెడుగులను నిర్ణయించవలసినది కాలమే.

ఆదరప్రోత్సాహములు లేని దేదియు నభివృద్ధిఁజెందఁజాలదు. అభిమానమున్నవారికి శక్తి లేదు. శక్తియున్నవారికి చేయిరాదు. వ్రాసి పెట్టెలలో దాచిపెట్టుకొన్నంత మాత్రమున సాహిత్యమభివృద్ధి చెందిన దనుకొనవచ్చునా? నేఁడు సాహిత్యాభివృద్ధి సారస్వత ప్రియులైన పలువురు ప్రజలపై నాధారపడియున్నది. కాని సాహిత్యమును ప్రోత్సహించుట యన్న ఎన్నికలలో పోటీచేయుటయా, లేక బలాత్కారముతోఁ గూడిన యధికారమా, అదియొక ధర్మకార్యము మాత్రమేగదా!

ప్రభుత్వమునకుఁ బ్రజలందఱు నొక్కటె. తానే ప్రజలు. ప్రజలే తాను. అది యెవ్వరి నాదరించఁగలదు? ఎవ్వరిని త్రోసిపుచ్చఁగలదు ఎవరికివారు స్వయంకృషిచే బాగుపడవలయుననుటయే ప్రభుత్వ విధానము. ప్రజల సహకారముతో చక్కని సాహిత్యమభివృద్ధి చెందవలయు ననియే దాని సంకల్పము. అంతకంటె నది యేమిసేయఁగలదు?

ఇఁక సాహిత్యాభివృద్ధిని కోరి, అభిమానించి, ప్రేమించి, ప్రోత్సహించు ప్రజలు మన వారెందఱుందురు? ఒక కావ్యమును వ్రాసి కవి తన యభిమానమును చంపుకొని ప్రజల నాశ్రయించెనా, “ఉన్న గ్రంథములు చాలవా, మఱియెందుకు వ్రాయవలయు” నను వారు కొందఱు, “ఈకష్టకాలములో కూటికి లేక బాధపడుచుండ కావ్యము లేల వ్రాయవలయు” ననువారు మఱికొందఱు, “కావ్యములు వ్రాసిన వారికి మాత్రము సాయముచేయము”ను వారొకరును, “ధర్మకార్యములకు సాయము చేయు నలవాటు మాకు లేద”ను వారు మరొకరును, “అమ్మో తట్టి వందలకొలఁదిగ సాయముచేయుదుమని వాగ్దానముచేసి, కొడుకు సమ్మతించలేద”ని తప్పించుకొను వారింకొకరును, ధర్మదాతలని పేరు పొందియు, పెద్దపెద్ద పదవులలో నుండియు, ఆశ్రయించినపుడు బదులైనను తెల్పక మూకీభావము వహించువారు పలువురును, సాహిత్యాభివృద్ధి నిరోధకులై నిరుత్సాహపఱుచుచుండ గతి యేమున్నది?

ఇ(క రచయితల సహృదయతను బరికింతము. పరస్పరోపకార ప్రోత్సాహముల నపేక్షించి, ప్రాంతీయాభిమానములకు గురియై స్వోత్కర్షఖ్యాపనమును గోరి, గోరంతలు కొండంతలుచేసి పొగడుకొనుచు, తన కంటె నితర మంతయు నిస్సారమను దురభిమానమును చాటుకొను నంత కాలము చక్కని సాహిత్య మభివృద్ధి చెంద నవకాశముండునా? పేరు ప్రతిష్ఠలు నిలుచునా? నే(డు సంప్రదాయశుద్ధమైన సాహిత్య తరువు వేరూని నిలువ(ద్రొక్కుకొని చిరస్థాయియై దేశమునకు సత్ఫలములనం దీయవలయునన్న, నీబూటకపు( బ్రపంచ పక్షపాత ప్రవాహమున(బడి యున్నిసుడిగుంతలను దప్పించుకొని, గాలికెదురీ(ది చక్కని తీరమును జేర వలసియున్నది.

సత్సంకల్పము లెన్న(టికి దాగియుండ(జాలవు. నిరుత్సాహములను లెక్క(గొనవు. పక్షపాతములను లక్ష్యముచేయవు. సమయమునకు వేచి యుండి యొక్కసారిగ( దమ వెలు(గును దేశము నలుమూలల( బఱపి, దేశాభ్యుదయమునకు దారి( జూపుచు, సదాశ్రయముచే స్థిరత్వము నొందక మానవు.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే."

అను పెద్దల నిర్వచనము వ్యర్థముకాదుగదా? లోకోత్తర చరిత్రు లగు నుత్తమ నాయకుల నాశ్రయించిన యుత్తమ కావ్యములు పైప్రయోజనముల ద్వారా దేశాభ్యుదయమును సాధించుటయకాక ప్రయోజనాంతరమునుగూడ సాధింప(గలవు. అదియ ప్రతివాని హృదయము నాకర్షించి మంచి దారిని నడుప(గలది. కావ్యముల కాశక్తి లేనిచో, కాళిదాసాదులనుగాని, నన్నయాదులనుగాని మనము వినియుండ(జాలము. ఎట్లు? "వెలయ జగమ్మునన్ విభవ వృద్ధికి మూలము ధర్మవృద్ధి, య
య్యలఘువిశుద్ధ ధర్మమున కాశ్రయ మెక్కుడు సజ్జనాళి, యిం
పొలయ(గ ధర్మకర్మముల కున్నతి పా(పు కవీంద్రు పల్కులు"

పెక్కుభాషలు నేర్వవచ్చు. అనేక శాస్త్రములు సాధింపవచ్చు. తన యిచ్చకుఁ దోఁచినట్లుపన్యసించవచ్చు. పలువుర పలువిధముల విమర్శింపవచ్చు. బయటపడలేక లోపలనే కుమిలి కుమిలి పైకి మాత్రము గాంభీర్యమును జూపవచ్చును. గాని సహృదయ హృదయాహ్లాదియగునట్లు చక్కని కావ్యమును వ్రాయుట చాలకష్టము. ఎవరో తన గుంపువారు తృప్తిపడిరన్న మాత్రమున చాలదు.

"పలుకుల పొందికల్తనరఁ బద్దెములల్లెడు నేర్పు, కామినీ
తిలకములుల్లసిల్ల సరిదిద్దెడు దిట్టతనంబు, మూర్ఖులం
దెలుపఁగఁజేయు పూనికి, విధిన్మరలించు తలంపు, ప్రజ్ఞచేఁ
గలిగిరొ! రాజ్యపాలనముఁ గాంచఁ, గడింది ధరాతలంబునన్.
చిత్తశుద్ధి పూజ్యశీలంబు విజ్ఞత
ముందు వెనుక లరయుబుద్ధిగరిమ
సరసవాక్యసరణి, సంస్కృతి, శాసన
చతురగతులు తెలియ శక్యమగునె?"

ఇటువంటి కవులెప్పుడును రాజాధిరాజుల కలవిగాని యానంద డోలికలపై నూయలలూఁగుచు "సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ్మ"ను సూక్తిని సార్థకపఱుచుకొనుచుందురు.

"రాజయి పుట్టుకంటెఁ గవిరాజయి పుట్టుట కొంత మేలు, రే
రాజు వసంతరాజు వలరాజును గొల్వఁగ నిశ్చలాత్ముఁడై
రాజిలు కావ్యకాంత వనరాజము లన్విహరించుచుండు, రా
రాజయినం ధరిత్రిఁ బోగరాఁజు నరాజకముండకుండునే."

ఇది యిట్లుండ నిప్పటి పండిత ప్రకాండులు కొందఱేవో కొన్ని ముక్కుమూతి లేని చిల్లరబల్లర బిలిబిలి పలుకుల కావ్య ఖండాభాసములం జదివి, కావ్యమార్గమున నాఁటితేఱిన వారివలెఁ బ్రాచీన కావ్యముల పై నత్యాదరమును, నిప్పటి వానిపై నత్యంతానాదరముం బ్రకటించుచు

"ముఖమస్తీతి వక్తవ్యస్మ"ను మాటను బాటించుచుందురు. అది కేవలము లోతు తెలియనితనమే యనక తప్పదు.

"రాజరాజుని యండ రాణించు నన్నయ్య
శబ్దశాసనుఁడన్న శపథమేల,
మనుమసిద్ధుని చెంత ఘనతకెక్కిన తిక్క
నార్యుండు కవిబ్రహ్మ యనఁగనేల,
రెడ్డిరాజులనీడ శ్రీనాథుఁ డనిమించఁ
గవిసార్వభౌముఁడన్ ఘనతయేల,
అలకృష్ణరాయల యాస్థాన కవులకు
అష్టదిగ్గజములన్ తుష్టియేల.
రాజులే లేక యవని రేరాజు మిగుల
నెవరి బ్రతుకులు వారివై యేఁచుచుండ
సొబగు లలరించు కావ్యకుసుమము లిచ్చు
కవివరుల్నేఁడు మనకెంతొ ఘనులుగారె?"

కావ్యములు దేశకాలముల కనుగుణములై, యుదాత్త లోకోత్తర నాయక గుణవర్ణనముచే దేశశాంతి సౌభాగ్యములకు దారిఁ జూపునవిగా నుండవలయును గాని, వంకరటింకరలై యేయొక్క తెగవారినో తృప్తి పఱుచుచు, నుద్రేకములను రెచ్చఁగొట్టునవిగానుండిన నుపద్రవకరములై జాతీయభావములను భంగపఱుచునవిగాఁ బరిణమించును.

ప్రకృతమనుసరింతము. అశోకరాజ్యమియ్యది మూఁడాశ్వాసముల మహాకావ్యము. లోకోత్తరోదాత్త చరితుఁడగు అశోకుఁ డిచ్చట నాయకుఁడు. ఇతఁడు మౌర్యవంశోద్ధారకుఁడైన చంద్రగుప్తుని మనుమఁడు. బిందుసారనరేంద్రుని పుత్రుఁడు. బాల్యమునఁ దాతవలె శౌర్యమూర్తియై యేకైక వసుధాధిపత్యము సాధింపఁ దలంపుఁగొన్న దిట్ట.

ప్రియదర్శి, అశోకవర్ధనుఁడను నవి యశోకునకు నామాంతర

ములు. ఇతఁడు తండ్రి మరణానంతరము రాజకీయముగ ననేక కష్టములకు లోనయి పట్టాభిషిక్తుఁడయ్యెను. చంద్రగుప్తుఁడు సర్వతో భద్రముగఁ దీర్చి దిద్దిన రాజ్యమగుటచే నెట్టి వికల్పములు లేక హాయిగఁ గాలముఁ గడపుచుండెను.

దక్షిణాపథమునఁ గళింగదేశపు రాజులు స్వతంత్రులు కాఁదలంచి తమలోఁ దమ కైకమత్యములు లేమిచేఁ గలహింపఁజొచ్చిరి. ఆకారణమున నశోకుఁడు కళింగదేశమును జయింపనేఁగెను. ఆఘోరరణమున నశోకుఁడు గెలిచెను. గాని యావిజయ మాతనికి సంతోషమునకు బదులు విషాదమును బెంచెను. ఆ జననాశము, ఆరక్తపాత మాతని మనస్సును మార్చెను. ఒక్కసారిగ నాతనిలోఁ గ్రొత్తపరిణామము, వెలుఁగు ప్రవేశించెను. తన జీవితములో యుద్ధముల జోలి యెత్తకుండఁజేసెను.

అనంతర మశోకుఁడు బౌద్ధగురువుల నాశ్రయించి యష్టాంగ మార్గసాధకుఁడై కొంతకాలముఁ గడపి, దీక్షతో నలువదియేండ్లు రాజ్యము నత్యుత్తమ మార్గమునఁ బాలించి శాశ్వత కీర్తిని సంపాదించెను. ఇందుకాతని శాసనములే సాక్షి. అతఁడు చెప్పినట్లు చేయువాఁడు. తాను చేసికాని యితరులను చేయుమనఁడు. ఇంతటి యుత్తమ పరిపాలకుఁడు మనకు మఱియొకఁడు దొరకఁడని చెప్పుట యతిశయోక్తి కాదని చరిత్రకారులే ఘోషించిరి. కావ్యము ముందున్నది. గుణదోషములను చదువరులే గ్రహించెదరుగాక.

ఇది చారిత్రక ప్రబంధము. సత్యమైన యాధారములు దొరికిననే గాని యిట్టి కావ్యములు వ్రాయుటకు సాధ్యపడదు. నాకు దొరికినంత వఱకు నీక్రింది చారిత్రక గ్రంథముల నాధారముచేసికొని యథాశక్తిని వ్రాయఁగలిగితిని. దొరికిన యాధారములు సత్యదూరములు కావనియే నా నమ్మకము. రెండవ యాశ్వాసమునఁ బ్రధాన కథాంశమునకును, ఔచిత్యమునకును, భంగము కలుగని విధమునఁ గొన్ని యంశములు కల్పితములు.

1. అశోకమహారాజు చరిత్ర. తెలుఁగు శ్రీ వేతపూడి లక్ష్మీకాంత రావు గారిది.

2. కళింగదేశ చరిత్ర. తెలుఁగు. అనేక కర్తృకము.

3. The Early History of India. Vincent A. Smith, 1924.

4. History of India (Hindu Period) Prof. L. Mukherjee, M. A.,

5. When peacock's colled, Hilda Seligman

6. A. History of India Part I The Pre Musalman Period K. V. Rangaswamy Aiyangar, M. A.,

7. Discovery of India Sri Jawharlal Nehru.

నా కావ్యమును గుఱించి నేనింతకన్న నెక్కువ వ్రాయఁజాలను. గుణదోషములను బరీక్షించు నధికారము విజ్ఞులగు పండితులది. అందందు దొరలిన ముద్రణ లోపములను, నా ప్రమాదములను, తప్పొప్పుల పట్టికను గాంచి సవరించుకొందురని మనవి. అంతకు మించిన తప్పులున్నచో క్షమించుచు నాకుఁ దెలియపఱిచిన సవరించుకొందును.

నన్నీకావ్యమును వ్రాయఁ బ్రోత్సహించిన మిత్రులకును, అచ్చొత్తించుటకై యార్థిక సహాయ మొనర్చి యాదరించిన సారస్వత ప్రియుల కును, అడిగిన వెంటనే యభిప్రాయములు వ్రాసి యిచ్చి ప్రోత్సహించిన విద్వాంసులకును, సరసమైన మార్గమునఁ జక్కఁగ ముద్రించి సమయమున కందఁజేసిన తాడిపత్రి దేశబంధు ప్రెస్ వారికిని, నా కావ్యమును జదివి తమ తమ యభిప్రాయములను బ్రకటించు సహృదయులకును, మిక్కిలి కృతజ్ఞుఁడను.

ఇట్లు విన్నవించు,
బుధజనవిధేయుఁడు,
కాండూరు నరసింహాచార్యులు.

జమ్మలమడుగు.
3-8-1954

—॥ శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః ॥—

# అశోకరాజ్యము.

## చారిత్రక ప్రబంధము.

### ప్రథమాశ్వాసము.

—♦ మంగళము. ♦—



శ్రీసాన్నిధ్యము శేముషీగరిమముం జెన్నొంద, నాశాంతరా
వాసుల్ శీర్షములందుఁ దాల్పఁగ యశోవాసంతికామాలికల్
వాసింగాంచు నశోకరాజ్యమున నే భాస్వత్ప్రబుద్ధాత్మనై
శ్రీసీతాపతిఁ గొల్చెదన్ సతతమున్ శ్రేయంబుఁ జేకూర్పఁగన్. 1

ఉ॥ కబ్బములోకసంగ్రహణ కార్యధురీణము గాఁదనర్చు నే
నబ్బురమొందఁగానడరు నార్యచరిత్రము కావ్యమైనచో
నుబ్బును బెంచునంచు మదినుంచి రచించు నశోకరాజ్యముం
గొబ్బున లోకపూజ్యమయి కూర్మినిఁ బేర్మినిఁ గూర్పదే యిలన్. 2

ఉ॥ సత్యము ధర్మరక్షణము సజ్జనసేవయుఁ దోడుగాఁగ, స
ద్భృత్యులు ధర్మపాలకులు పేదలు రక్షణలక్ష్యమైతగన్
గృత్యములందు నేమఱక, కీరితి మెల్లెడఁ బ్రాఁక రాజ్యమున్
సత్యపథమ్మునన్నడుపు జాణ యశోకున కెన్నసాటియే.

గీ॥ ప్రజలఁ బీడించి, హింసించి, పరిభవించు
గర్వితాత్మనృపాలుర గణమునందు
రామరాజ్యంబు తరువాత రాజితండె
ముండ్లపొదలను బూచిన మొగలిపూవు. 4

సీ॥ చంద్రగుప్తమహీంద్ర సారకల్పకశాఖ
వినుతింపవేరూని పెరిగెనెచట,
చాణక్యతంత్రి కాసారకల్హారముల్
ప్రభవించి వికసించి పర్వెనెచట,
బిందుసారనరేంద్రు డెందంపురాయంచ
విహరించె మానసవీథినెచట,
శౌద్ధోదని యతీంద్రుబుద్ధి బీజాంకురాల్
ఎడఁదపొలమ్ముల నెదిగెనెచట,

గీ॥ యశము ఘుమఘుమలాడ నల్దిశలయందుఁ
బాటలీపుత్రనామ సంభావ్య రాజ
ధానివెలుఁగొందె నెచట విధానగరిమఁ
బ్రథితమైనట్టి మౌర్య సామ్రాజ్యమదియె. 5

ఉ॥ దానిని సత్యధర్మము లతంద్రత లాస్యముసల్పఁ బాలనం
బూనియొనర్చెనెవ్వఁడు సుపూజ్యుఁడశోకుఁడు శుద్ధమూర్తియై
వానిచరిత్రముందెలిపి వాసిగధన్యత నొందబూనితిం
గాని, యదెట్లొ! భారతి! సుఖంకరి! వంకలుతీర్చి దిద్దవే. 6

ఉ॥ తప్పులబట్టువారనుచుఁ దాలిమివీడకు, రాచకొల్వులన్
మెప్పులఁబొంది వెల్గితివి మించి వరించి నుతించి పెంచఁగా
నిప్పటికొందఱెవ్వరొ విహీనమతుల్నిను రచ్చకీడ్వఁగా
నొప్పునె కుందఁగంద? ముదమొందుము మెడందను దెల్గుభారతీ! 7

చ॥ వలపులఁ జంద్రికారుచుల వాయుతరంగ విలాసవీథులం
గలికివనమ్ముల న్మధురగాన కుహూరవకోకిలమ్ములం
దళతళలాడు క్రొమ్మెఱుఁగుతావులఁ మబ్బులఁ, ద్రిప్పవంచు నీ
వలుగకు భారతీ! నడువు మౌర్యపథమ్మున నాదువెంబడిన్. 8

చ॥ భయమొకయింతలేదు నిను భావమునందిడి పెంచువాఁడ, ని
ర్దయుఁడనుగాను చూపఁటి యథాతథమైచెదు దారిఁజూప, ది
గ్జయముగఁ గావ్యతత్త్వ రసికావళిమెచ్చ నలంకరింతు, నీ
నయవినయంబులుల్లసిల నాట్యముసల్పుము తెల్గుభారతీ! 9

చ॥ పొలపుగశబ్దమర్థమును బొందిక భావసుగంధభావ్యమై
విలసిలు నీదురూపగుఁ; గసీందుప్రిలుమెచ్చ రసంబుహెచ్చ న
వ్వలపు వసంతకోకిల సుపల్లవ పుష్పసుగంధ చంద్రిశ
బ్దలవములెన్నొపెంచ బలవంతపుసొమ్ములవేలభారతీ! 10

ఉ॥ రాజులుమెచ్చఁ బూర్వకవిరాజపరిష్కృతమైనబాట, సా
మాజిక చిత్తధిక్కరణమా! గుణమెద్ది? యహంకరింపఁగా
మోజునుదీర్చుకొంట గుణమో! ఫలమెయ్యది? యుండనిమ్మటుల్
సాజముకొత్తవింతగుట సంభ్రమమెందుకె తెల్గుభారతీ! 11

ఉ॥ చారుతరంపుసొంపు సరసంపుఁ బదప్రసరంపుజాడ లొ
య్యారము, కుల్కుతళ్కు మృదుహాసములొల్కెడు భావగౌరవం
బేరికిఁ దోఁచకుండుఁ? బరికింపఁగ నభ్యుదయంపు భావముల్
చూఱఁగొనంగ లేవె? సరసుల్మదిమెచ్చరె తెల్గుభారతీ! 12

## —♦ చరిత్రప్రారంభము. ♦—

చ॥ కలుములకిక్కయౌ భరతఖండమునందున క్రీస్తుపూర్వ మం
దలరెడు పాటలీపురమునందున ధీరుఁడు పద్మనంద భూ
తలపతియేలుచుండె సరదారులు మెచ్చఁగ వైభవోన్నతిం
దెలియఁగ దిక్కులన్మగధదేశము, వైరుల కన్నుగుట్టఁగన్. 13

## —♦ మగధదేశము. ♦—

సీ॥ కాశికొండలుతూర్పు కనుమలైవిలసిల్లు
బ్రహ్మపుత్రానదీ ప్రాంతభూమి,

దక్షిణదిశయందుఁ దనరువింధ్యనగంబు
దండకాటవిమూల ధామమగుచు,
పడమటియెల్లయై పరఁగుఁజేదికిఁదోడు
తనరెడు బలువింత తారెడారి,
భరతఖండపుగీటు పగిదినుత్తరమందు
నగరాజు శీతాద్రి నెగడియుండు,

గీ॥ నాల్గుకంబములై యొప్పు నాల్గుదెసలుఁ
బెండ్లిచవికెను గూర్చున్న పెండ్లికూఁతుఁ
బోలెఁ బాటలి నిగనిగల్బుగులుకొనఁగ
మగధసామ్రాజ్యరమయొప్పె మహినుతింప. 14

గీ॥ వింధ్యహిమవంతముల మధ్యవెలయుభూమి
వేదకాలపుటార్యుల విడిదిగృహము;
భారి పంజాబు, కాశ్మీర, హారిసింధు
రాష్ట్రములవీడి మగధసామ్రాజ్యసీమ. 15

## —♦ అలెగ్జాండరు దండయాత్ర. ♦—

ఉ॥ భండనములొప్పెనర్చి, పరిపంథి నృపాలురఁ గీటడంచి, ది
జ్మండలి తాండవంబొ యనఁగాఁబొగడొందుచు గ్రీకురా జలె
గ్జాండరు దండయాత్రల నఖండితతేజుఁడు సల్పె నాసియా
ఖండమునం బలాఢ్యుల కఖండజయంబని భేరి మ్రోఁగఁగ౯. 16

గీ॥ క్రీస్తుపుట్టకమున్ను చరిత్రఁబట్టి
మూఁడువందల యిరువదియేడు వత్స
రంబులందున దండయాత్రలను గడఁగి
సలిపెనాతఁడు సర్వదిగ్జయముఁ గొనఁగ. 17

ఉ॥ సైనికశాఖ లుప్పెనల చాడ్పునఁబొంగుచు వెంబడింప, స
మ్మానిత శాసనుండయి యమానుషశక్తిని గ్రీకురాజు, సిం
ధూనది ప్రాంతముంగెలిచి, దోర్బలధుర్యుఁడు తృప్తి లేమి చేఁ
బూని సమస్తభారతము బుద్ధిబలంబున గెల్వఁగోరుచున్. 18

ఉ॥ ముందుకుసాగుచుండెఁ దనముక్కుకుసూటిగఁ గాని యంత వా
నిం దలమున్కసేయఁ దననిశ్చితకార్య విఘాతవాహినీ
బృంద తరంగమాలికలు వెన్కకుఁబోవఁగ నిశ్చయించి, తా
నందు జయించురాజ్యముల నర్హులనిల్పె స్వసైన్యులం దగన్. 19

గీ॥ ప్రతినిధులనిల్పి యందందుఁ బ్రజ్ఞమెఱయ
బాబిలను పట్టణంబున బసయొనర్చి
మూఁడువందల యిరువది మూఁడువర్ష
ముల నలెగ్జాండ రసువులఁదొలఁగెనఁట. 20

కం॥ అంతట ముఖ్యోద్యోగులు
పంతంబున జయముఁగొన్న భాగములెల్లన్
వంతులకొలఁదిని గార్యముఁ
జింతింపక పంచుకొనిరి; సెల్యూకసుఁడున్ 21

గీ॥ తనకువచ్చిన పంజాబుధరణి నేలు
కొనుచునుండంగ రాష్ట్రింపు జనులుకలఁగి
యన్యదేశీయులకులొంగి యడఁగిమడఁగి
యుండఁజాలక విముఖులై యుండిరపుడు. 22

ఉ॥ ద్వేషముఁబూని చిత్తములఁ డిట్టుచు, రచ్చలనచ్చుకొట్టుచుం,
దోషనిరూపణప్రకట ధూర్వహులౌచు, స్వతంత్రజీవికా
వేషములందలంచుచుఁ దపించుచుఁ, గాలముఁగాచియుండ్రు, ని
ర్దోషులు పౌరుషోన్నతులు దుష్టులక్రింద నడంగియుందురే. 23

ఆ॥ పాలనంబునందుఁ బరిపాటితప్పుట,
స్వార్థపరత, పాపచరితులగుట,
కార్యగతివిదారి కయ్యంబులకుదారిఁ
జూపకున్నె? ప్రజలనేఁపకున్నె? 24

—♦ చంద్రగుప్తుఁడు పంజాబును జయించినవిధము. ♦—

ఆ॥ అపుడు మగధరాజ్య మత్యంతమభివృద్ధిఁ
గాంచి, కళలుపెంచి, మించియుండఁ
బద్మనందరాజు ప్రాభవశాలియై
యేలుచుండె దాని నిచ్చమెయిని. 25

ఆ॥ పద్మనందరాజుభార్యయౌ 'మురి' యందుఁ
జంద్రగుప్తసుతుఁడు సంభవించి
శౌర్యసాహసాది చతురగుణోన్నతి
నెదుగుచుండె నిరువదేండ్లవాఁడు. 26

చ॥ మురయగు శూద్ర; యారమణిముద్దులబిడ్డఁడె మౌర్యుఁడయ్యె; భా
సురమగువంశ మూలపురుషుండగు నాతఁడెచంద్రగుప్తుఁ డా
సురుచిర సద్గుణాకరుని శూరుని నందుఁడు సంశయించి భీ
కరుఁడితడంచు, నిందుఁగొఱగాడని రాజ్యమువెళ్ళగొట్టినన్. 27

గీ॥ తరలి పాంచాలప్రాంత కాంతారసీమఁ
దిరుగుచుండెను దిక్కుఱి పరితపించి
ఆదరములేని యతిథియై యటమటించి
నిర్జనాటవిఁగాయు వెన్నెలవిధాన. 28

—♦ చ ం ద్ర గు ప్త చా ణు క్యు ల మై త్రి. ♦—

చ॥ అతఁడువిదేశవాసమున నంధుఁడుపోలె విధిందలంచుచుం
గతిఁ గనలేక చింతిలుచుఁ గాఁడవుల్చరియించువాఁ డహ

ర్వతిసమ తేజుఁడౌ ద్విజుఁడు భగ్గునమండి కషాయితాక్షుఁడై
"మతినుడికింపనీకుఁ గుశమా! తగునా! ననునీ వెఱుంగవే?" 29

చ॥ అనియొక దర్భపోచఁగొని యప్పుడబూదియొనర్చి త్రావ నా
తనిఁగని "యుగ్ర తేజుఁడుగదా! యితఁడెవ్వఁడొ" యంచు నెంచి చే
రనుజని యిట్లుపల్కెను గరంబులు మోడ్చి నమస్కరించి "పా
వనతరమూర్తి కిప్పగిది భావ్యమె గడ్డికిఁగన్నులున్నవే!" 30

గీ॥ పశువులకు మేఁత పేదకు బయలుమూఁత
పసిమి మిసమిస నేత్రసాఫల్యదూత
ప్రకృతిమాతను గైసేయు పట్టుపూఁత
కాలిక్రిందిదిగాదె యీగడ్డిపోచ. 31

ఉ॥ "చేసిన నేరమేమి? వడిఁజీల్పఁగఁజాలిన మానవాధముల్
భాసిలుచుండ గడ్డి పగవాఁడయిచిక్కెనె చేతికిట్టు లో
భాసురమూర్తి! పట్టుబలవంతపుఁ బట్టుదలం గడింతు మే
వాసి? నిజప్రతాప కరవాలసహాయతఁ గ్రాలకుండినన్." 32

చ॥ అనుటయు మోముఁగన్గొనుచు నాతఁడుపల్కెను భ్రూకుటస్ఫుర
ద్ఘనతరరోషరూక్షమగు కన్గవనిప్పులరాల "పౌరుషం
బున బ్రదుకంగఁ దప్పగునె మూఢుఁడ! కంటకబాధనాకు నీ
కును సమమౌను, సేమమునకుం బగఁదీర్చుట పాడిగాదొకో! 33

మ॥ నరులజ్ఞాను లెఱుంగఁజాలరె? చాణక్యుండు కాశ్మీరదే
శరమాలంకరణిష్ణు భూమిసురవంశప్రాభవప్రోల్లస
ద్గురుకోపోద్ధతుఁడంచు నందపరిభూతోగ్రాకృతిం గ్రాలుచుం
జరణస్పర్శనమాత్రమేని సహియించంజాలఁడంచున్మదిన్. 34

ఉ॥ భోజనశాలలోఁ బ్రథమపూజ్యుఁడుగాఁడటె విష్ణుగుప్తుఁడీ
రాజకిరాతకాళిఁ బొగరాఁడెడు కోపదవానలమ్మువి

భ్రాజితమౌచు భగ్గుమనిగ్రమ్మి విభూతియొనర్చుదాఁక నే
యోజ నహంగు? గడ్డియని యొగ్గెనె శత్రువు విష్ణుగుప్తుఁడన్. 35

ఉ॥ నందఘనాటవుల్సమయునంతకు నీవిషమప్రకోప మ
ధ్యందిన బాడబాగ్ని శిఖలారునె నాశిఖకట్టునందు నే
మందులుకోర్లిల్లులింజెనకి మందురె కుందక క్రుందిపోక? నా
ముందఱనా! ప్రతాప పరిభూతులు భూతియొనర్పకుండురే. 36

చ॥ అనుటయుఁ జంద్రగుప్తుఁ "డహాహా! ననుదైవముప్రోవఁజూచె నీ
తనికర మండగైకొనిన దాయలగెల్వఁగవచ్చు" నంచు నె
మ్మనమున యోజచేసి యసమాన రుచోజ్జ్వల తేజుఁడైన యా
తనిచరణంబులంబడుచు దైన్యముతోఁపఁగఁ బల్కె నిట్టులన్. 37

ఉ॥ "చంద్రుఁడు వంశకర్త గుణసాంద్రుఁడు నందుఁడు నాకుతండ్రి రా
జేంద్రుఁడు పెండ్లియాడు మురయే యగుశూద్రక నాకుఁదల్లి ని
స్తంద్రగుణోజ్జ్వలుండనుచు జంకుచు నార్యకులీనుఁడయ్యు దు
ష్టేంద్రియవశ్యుఁడై ననువసింపగఁదోలెను గొండవాగులన్. 38

గీ॥ వందురిలుచుంటి మీపాదపద్మయుగముఁ
గంటి మిమువంటి ధుర్యుల వెంటనంటి
దుస్తరంబగు దుఃఖోర్మిఁదోలఁగనుంటి
విధివశంబునఁ బులిపిల్ల పిల్లియయ్యె. 39

మ॥ మదిలోనెక్కొను దుర్విపాకకృత సమ్మర్దప్రతప్తాంగి కా
పథముంగోరుచుఁ దిర్గు నాకు నటవీసంచార మాహాత్మకుం
బదిలమ్మైన భవత్ప్రతాప విభవప్రత్యక్ష వీక్షారుచుల్
వెనుకంబోయిన మాలికల్కనుల ముందుద్వేల ముప్పొంగుటల్" 40

గీ॥ అనుచునగ్గింపఁ జాణక్యుఁడాత్మఁబెరిగి
తనదుప్రతినకుఁ జక్కనిదారిదోఁప

"విష్ణుగుప్తుఁడ నాకేమి వెలితి యింకఁ
బట్టి గిరగిరలాడింతు బ్రహ్మనైన." 41

మ॥ అనుచున్ శీర్ణశిరోజముల్ మెలయ "నన్నా! దిక్కులేకుంటివా
నను వెన్నంటుము నందరాజ్యరమ చాణక్యుండు సాధించి నీ
వెనువెంటం దిరుగంగఁ జేయు భయమున్ వీడొల్పు మింకేల, యో
జనముల్ చెల్లవు విష్ణుగుప్తుఁడు ప్రతిజ్ఞాకార్య నిర్వాహిగాన్." 42

ఆ॥ అనుచుఁ బ్రతిన సలిపి యత్యంతమోదార్చి
మంత్రతంత్ర విధులమరగి, కడఁగి
చంద్రగుప్త రాజచంద్రునిఁ జేయంగ
విష్ణుగుప్తుఁడలరె వేయికనుల. 43

కం॥ తమలో సంకేతమ్ములు
కొమరొప్పఁగఁ జేసికొని యకుంఠితదీక్షం
దమకిచ్చవచ్చుతావుల
విమతుల యటు సంచరింప విడిచిరి వనమున్. 44

ఉ॥ పోయి ప్రవాసముండి మదిఁ బొక్కుచు మౌర్యుఁడు ధీరుఁడౌచు ని
శ్చాయకవృత్తిలోఁ గొనుచుఁ, జయ్యనఁ బంచనదంపుదేశ మా
ప్యాయకమాటఁ జేరె, నతఁడచ్చటి ఛిద్రములెల్లఁ గ్రోలుచున్
నాయకుఁడౌచు నాప్రజ కనాహతపద్ధతి బోధసేయుచున్. 45

శా॥ స్వాతంత్ర్యప్రియుల న్మహానిపుణులన్ సంగ్రామదీక్షాత్ములన్
నీతిప్రౌఢ విహారులం గలిపి తన్నేతృత్వమున్ బూని, తా
నెంతే సాహసికాగ్రగణ్యుఁడయి బద్ధేర్ష్యా ప్రపూర్ణాత్ముఁడై
భ్రాతృప్రీతినిఁ బ్రోత్సహించె ననికిం బంచాప దేశీయులన్. 46

ఉ॥ పంచనదంపుదేశజులు బాహుబలాఢ్యులు కార్యదక్షు ల
భ్యంచిత పౌరుషోన్నతు లహార్యదృఢోన్నతకాయు లైకమ

త్యాంచితసుందరాకృతు లుదారులు ధీరులు చంద్రగుప్తుని
ర్వంచక ధీరబోధము శుభంకరమౌనని మెంచి యేకమై. 47

ఉ॥ కత్తులుబల్లెముల్ బహుళకార్ముకజాలము నిచ్చెప్రోవు లా
యత్త గ్రీకుయోధుల కహో యనిపించఁగఁ బ్రోగుచేసి, యు
ద్వృత్తినిపోరు ఘోరముగ దిట్టతనంబులు మెట్టిసేయ "నా
కత్తికి నడ్డులే" దనెడు కట్టిఁడి కాలికిబుద్ధిసెప్పెచున్ 48

గీ॥ బాతెసెల్యూకసామీఁదఁ బ్రౌఢుఁడగుచుఁ
జంద్రగుప్తుఁడు పంచాపజనపదంబు
నేలుకొనసాగెఁ, జిత్రమేనేలఁదేజ
మడఁచియుంచినశకక్యమే యడఁగియుండ. 49

—◆ చంద్రగుప్తుఁడు మగధరాజ్యము నాక్రమించుట. ◆—

మ॥ మగధన్నందుఁడు దుష్ప్రవృత్తుఁడగుటంభావించి యాపౌరు లె
ప్పగిదినీవ్విఁ దొలంగువారమనుచు న్వాపోవుచుండఁగ, నా
వగవుల్ సాకుగఁగొంచు మౌర్యుఁడు గిరిప్రాంతప్రజానీకముం
దగసాయంబుగఁగొంచు దండువెడలెం దానష్టజేయాత్ముఁడై. 50

మ॥ పరిభూతవ్యగ్ని ప్రతప్తచిత్తుఁ డతులప్రజ్ఞుండు చాణక్యుఁ డా
తురుఁడై లోపల వెల్పలంగడఁగి లోతుద్దీసి తంత్రింబు రా
జ్యరమాసాధకమైతనర్ప, బహులాహంకారద
ర్పరసోద్దీపితుఁడౌచు నందనృపతి ప్రాగల్భ్యముంబాపఁగన్. 51

ఉ॥ పోరిజయించి యమ్మగధఁ బూర్ణమనోరథుఁడౌచుఁ బాటలిం
జేరి ప్రజాహిత ప్రభుతనేర్పునఁదీర్చుచుఁగూర్మిఁ గూర్చుచుం
బౌరుషశాలియైపరఁగెఁ బౌరులభాగ్యము పండెనోయనం,
గూరిమిలేని నందునకుఁ గ్రూరభయంకర కర్మబాసెనే? 52

శా॥ చాణక్యుండు పురోహితుండగుచుఁ జంచచ్చంద్రగుప్తావనీ
జానిం బట్టముగట్టి నిల్పి కలుముల్సంధిల్లఁగా నేలుకొ
మ్మా! నైపుణ్యముచేతనంచుఁ బలుకం బ్రీతాంతరంగుండునై
రాణింజేయఁగ మౌర్యరాజ్యరమ తా రాజిల్లె నప్పాటలిన్. 53

ఆ॥ మున్ను చంద్రగుప్త భూపతిగైకొన్న
తలము పంచనదము తన్నుఁగలియ
నపుడు మగధరాజ్య మతివిపులంబయ్యెఁ
బరులదృష్టి దోషభయముతొలఁగ. 54

ఉ॥ పాటలిపుత్రకుండు జనపాలుఁడు శూరుఁడు చంద్రగుప్తుఁడా
ఖేటవినోదియై ప్రజలు ఖేదముమోహమునెఱుంగకుండఁ, బె
క్కాటలఁ బాటలం దవిలి హాయిగసౌఖ్యములందుచుండ, న
ప్పాటను బాలనంబును శుభంకరవృత్తిని సల్పుచుండగన్. 55

ఉ॥ గెలిచినరాజ్యమీడుటకు గ్రీకుధరాధిపుఁడాత్మనొచ్చి, దు
ర్బలతతొలంగ, దోర్బలము పైకొన, వెండిజయింప నెంచి, తా
బలములఁ గూర్చుకొంచు వడిఁబంచనదస్థలినడ్డుపెట్టి, యా
విలమతియూచుఁ గయ్యమును వియ్యముగా మరలింపఁజూచుచున్. 56

ఉ॥ "సాధ్యముగాదు కయ్యమిఁక, సంధియ యుత్తమమార్గమౌను, దు
ర్భేద్యుఁడు చంద్రగుప్త పృథివీశుఁడు, కాలముమాఱిపోయె, వా
యుద్యమమింకఁజాలు, సుగుణోజ్జ్వలు శూరునినాశ్రయింప, న
భ్యుదయ దశేషశోభన పరంపరనొందంగ నాకరంబగున్." 57

కం॥ అనుచు సెల్యూకసప్పుడు
మనమునఁ జింతించి, యొకనిమౌర్యునికడకున్
ఘనమతి సంధికిఁబంపిన
వినియాతఁడు సమ్మతించె వేడుకమీఱన్. 58

త్యాంచితసుందరాకృతు లుదారులు ధీరులు చంద్రగుప్త ని
ర్వంచక ధీరబోధము శుభంకరమౌనని యెంచి యేకమై. 47

ఉ॥ కత్తులుబల్లెముల్ బహుళకార్ముకజాలము నీటుప్రోవు లా
యత్తత గ్రీకుయోధుల కహో యనిపించఁగఁద్రోగుచేసి, యు
ద్వృత్తినిపోరు ఘోరముగ దిట్టతనంబులు మెట్టిసేయ "నా
కత్తికి నడ్డులే"దనెడు కట్టెఁడి కాలికిబుద్ధిసెప్పుచున్ 48

గీ॥ బాటసెల్యూకసామీఁదఁ బ్రోధుఁడగుచుఁ
జంద్రగుప్తుఁడు పంచాపజనపదంబు
నేలుకొనసాగెఁ, జిత్రమేనేలఁదేజ
మడఁచియుంచినశక్యమే యడఁగియుండ. 49

—♦ చంద్రగుప్తుఁడు మగధరాజ్యము నాక్రమించుట. ♦—

మ॥ మగధన్నందుఁడు దుష్ప్రవృత్తుఁడగుటంభావించి యాపౌరు లె
ప్పగిదినీవనిఁ దొలంగువారమనుచు న్వాపోవుచుండంగ, నా
వగపున్ సాకుగఁగొంచు మౌర్యుఁడు గిరిప్రాంతప్రజానీకమున్
దగసాయంబుగఁగొంచు దండువెడలెం దానష్టజేయాత్ముఁడై. 50

మ॥ పరిభూతవ్యగ్ర ప్రతప్తచిత్తుఁ డతులప్రజ్ఞుండు చాణక్యుఁ డా
తురుఁడై లోపల వెల్పలంగడఁగి లోతుల్గోసి తంత్రంబు రా
జ్యరమాసాధకమైతనర్ప, బహులాహంకారద
ర్వరసోద్దీపితుఁడౌచు నందనృపతి ప్రాగల్భ్యముంబాపఁగన్. 51

ఉ॥ పోరిజయించి యమ్మగధఁ బూర్ణమనోరథుఁడౌచుఁ బాటలిం
జేరి ప్రజాహిత ప్రభుతనేర్పనఁదీర్చుచుఁగూర్మిఁ గూర్చుచుం
బౌరుషశాలియైపరఁగెఁ బౌరులభాగ్యము పండెనోయనం,
గూరిమిలేని నందునకుఁ గ్రూరభయంకర కర్మబాసెనే? 52

శా॥ చాణక్యుండు పురోహితుండగుచుఁ జంద్రగుప్తావనీ
జానిం బట్టముగట్టి నిల్పి కలుములన్ఁధిల్లఁగా నేలుకో
మ్మా! నైపుణ్యముచేతనంచుఁ బలుకం బ్రీతాంతరంగుండునై
రాణింజేయఁగ మౌర్యరాజ్యరమ తారాజిల్లె నప్పాటలిన్. 53

ఆ॥ మున్ను చంద్రగుప్త భూపతి గైకొన్న
తలము పంచనదము తన్నుఁగలియ
నపుడు మగధరాజ్య మతివిపులంబయ్యెఁ
బరులదృష్టి దోషభయముతోలఁగ. 54

ఉ॥ పాటలిపుత్రకుండు జనపాలుఁడు శూరుఁడు చంద్రగుప్తుఁడా
ఖేటవినోదియై ప్రజలు ఖేదముమోము నెఱుంగకుండఁ, బె
క్కాటలఁ బాటలం దవిలి హాయిగసౌఖ్యములందుచుండ, న
ప్పాటను బాలనంబును శుభంకరవృత్తిని సల్పుచుండగన్. 55

ఉ॥ గెలిచినరాజ్యమోఁడుటకు గ్రీకుధరాధిపుఁడాత్మనొచ్చి, దు
ర్బలతతొలంగ, దోర్బలము పైకొన, వెండిజయింప నెంచి, తా
బలములఁ గూర్చుకొంచు వడిఁబంచనదస్థలినడ్డుపెట్టి, యా
విలమతియౌచుఁ గయ్యమును వియ్యముగా మరలింపఁజూచుచున్.56

ఉ॥ "సాధ్యముగాదు కయ్యమిఁక, సంధియ యుత్తమమార్గమౌను, దు
ర్భేద్యుఁడు చంద్రగుప్త పృథివీశుఁడు, కాలముమాఱిపోయె, వా
యుద్యమమింకఁజాలు, సుగుణోజ్జ్వలు శూరునినాశ్రయింప, న
భ్యుదయ దశేషశోభన పరంపరనొందంగ నాకరంబగున్." 57

కం॥ అనుచు సెల్యూకసప్నుడు
మనమునఁ జింతించి, యొకనిమౌర్యునికడకున్
ఘనమతి సంధికిఁబంపిన
వినియాతఁడు సమ్మతించె వేఁడుకమీఱన్. 58

చ॥ గురుతుగసంధికై తనదుకూఁతునొసంగి వివాహబాంధవం
బరుదుగసల్పి మౌర్యునకు నాఫ్ఘనురాష్ట్రము, హిందుకుష్గిరీ
శ్వరములునెల్లగాఁ దనదుపాలిటి దేశములెల్లనిచ్చి, తా
నరుగఁ దలంచెమైత్రి "సిరియా" ప్రభువౌటకు నిశ్చయించుచున్. 59

సీ॥ మైత్రిచిహ్నముగాఁగ మౌర్యుఁ డేనూరునే
న్గులనిచ్చి యాతనిఁ గూర్మిననిపె,
నంతసెల్యూకసుఁ డాత్మనుప్పొంగుచు
ఘనురాయబారి మగాస్తనీసు,
బాటలీపురమున వసియింపనియమించ
నతఁడునీతిపరుండు ధృతిధరుండు
నారాజచంద్రుల యతులమైత్రిలత
లాశావకాశంబు లల్లుకొనఁగఁ

గీ॥ బల్లవించుచుఁ బుష్పించి, పరిమళించు
పగిదివర్తించె, వారును బాలునీరు
పోలె భేదంబుతెలియక పొలుచుచుండ
లాస్యములుసల్పె మగధసామ్రాజ్యలక్ష్మి. 60

గీ॥ ఎన్నఁగను మూఁడువందల యిరువదొకటి
వర్షమది క్రీస్తుపూర్వము; హర్షమొదవఁ
జంద్రగుప్తుని పట్టంపు సమయమగుచుఁ
బాటలీపుత్రపురమున నాటలాడె. 61

కం॥ గంగాశోణా సంగమ
రంగమునం బాటలీపురం బది పొగడన్
రంగత్తరంగశీకర
సంగతి శోణోత్తరమునఁ జల్లగ వెలసెన్. 62

## —పాటలీపుర వర్ణనము.—

సీ॥ పదిమైళ్లపొడవును బరఁగ రెండు వెడల్పు
గలిగిచుట్టును గందకంబు మెఱయఁ,
గందకంబు వెడల్పు గట్టిగ నాఱునూ
రడుగులుగలదౌచు, నంతులేని
ముప్పదిమూరలనొప్పు లోతునుగల్గి
కోటగోడలచుట్టు కొమరుమిగుల
నేనూటడెబ్బది యెనలేనిసొంపులఁ
బరఁగెడుకోటల బురుజులెసఁగ
గీ॥ అరువదియునాల్గు ద్వారంబులందగింప
నీటనించిన కందకాలోఁ గోటచుట్టు
ప్రతిఫలించిన దేవేంద్రుపట్టణంబు
సాటిరానని వణఁకెడు సాకుఁదెలుప. 63

సీ॥ కమలాకరంబులతో కందకంబులతీరు
కమలాకరవిభూతి గరిమఁదెలుపఁ,
గొమరొప్పు పైకొప్పు కోటలనెఱియొప్పు
కోటికిఁబడగెత్తు సాటిదెలుప,
ప్రాప్తసర్వంసహావ్యాప్తవైశాల్యంబు
దేశమెల్లడఁబ్రాఁకు దిటవుదెలుపఁ
చంద్రగుప్తమహీశ సారభుజాస్కంధ
సరసతముఖ వికాసములుదెలుప,
గీ॥ నిఖిలకళలును సంపదల్మెఱప, మూఁడు
పూల నార్కాయలై యొప్పి, పొంగిపొరలి
సర్వధర్మాలవాలమై స్తుత్యమగుచుఁ
బాటలీపుత్రనగర వైభవముమించె. 64

ఉ॥ కట్టినకోటలుఁ బహుముఖంబుల మేడలు దారుకుడ్య సం
ఘట్టిత శిల్పనైపుణ వికాసములీనుచు నింపునింపుచుం
బట్టణభాగ్యరేఖ కనుపండువు సేయఁగ, దిఙ్ముఖంబులం
దట్టైవెలుంగుచుండె, నరయం బురరాజము సౌరుమీఱఁగన్. 65

## మగధరాజ్యవర్ణన.

చ॥ ప్రజలు స్వతంత్రవృత్తులు, శుభావహచిత్తులు, చిత్రజాకృతుల్
తలఁపఁగ సత్యధర్మపరతంత్రులతంద్రులు సజ్జనాశ్రితుల్
పిలిచిన దాస్యవృత్తికయి వేఁడుకఁజూపరు, చంద్రగుప్త భూ
తలపతి యేలు నమ్మగధ ధారుణి; జీఁకటి వెల్గుఁజేరునే? 66

ఉ॥ ప్రాకృతభాషలందొకటి భవ్యము మాగధి రాజభాషయై
లౌకిక రాజకీయముల రాజిలుచుండెను, పాళి బౌద్ధులం,
బ్రాకట సంస్కృతంబు బుధవర్యుల నార్యులఁగొల్చుచుండ, స
త్త్వైక పరాయణు ల్ప్రజలనైక్యముచేరుచు నా మౌర్యపాలనన్. 67

ఉ॥ బుద్ధమునీంద్రు సత్కరుణ మొల్చిన బౌద్ధమతంపువృక్షమం
దిద్ధసుమాప సుస్థిరత నెల్లెడఁగొమ్మలు తీఁగలాకులై
వృద్ధిగఁబూలఁబిందెల ఫలింపఁగ మానవ మానసంబులన్
బుద్ధివికాససంపదలు పొంగె సమాహిత సత్యవీధులన్. 68

చ॥ పొలుపుగ నద్ధరావరుని భూమి ప్రజావళి నేడువర్గము
ల్గలవని పల్కెనొక్కఁ డదిగాదని పల్కెఁజరిత్రకారుఁ డ,
య్యిలఁగల వెల్ల వృత్తులని, యేయొకవృత్తికిఁ జోటువాసినం
గలుగునె సౌఖ్యసంపదలు; కాలగతుల్మనకంటియద్దముల్. 69

ఉ॥ కొండఱు భూములంగొలుచు కొల్వుడుకాండ్రయి, పెద్దకాల్వలం
దందునఁ జిన్నకాల్వలయి యచ్చపుఁబైరుకు నీరుమోయఁగాఁ,
గొండఱు వేఁటకాండ్ర పయికొల్వుడుకాండ్రయి యర్హసత్క్రియల్
క్రందుగఁ జూచుచుండ్రి, తమకార్యవిధానము మెప్పులందఁగన్. 70

ఉ॥ రాజకనుంగవన్మెలఁగి రాష్ట్రపువృత్తులవారినుండి యే
యోజను పన్నులంగొనఁగ నొప్పునొ, యప్పనియోజ్యచేసి, సా
మాజికమౌ తెఱంగువఁ బ్రమాణవినిర్ణయ మాచరించి, య
వ్యాజముగా పసూల్గొనుచు నందలిరాజ నియోగులొప్పఁగన్, 71

ఉ॥ దారులదూరముం దెలుపు స్తంభములుంచఁగ రాచబాటల
న్నేరుపుకాండ్రనేలు ధరణీశుఁడు నిచ్చలుచారచక్షువై
కూరిమిఁగూర్పఁగాఁ బ్రజలకుందగుసౌఖ్యము లొప్పమీఱ, నే
నేరములంకురింపవట, నేర్పును, దీర్పును, గూర్పువోయఁగన్. 72

—♦ పంచాయతులు - వాని పనులు. ♦—

ఉ॥ ఐదుగురైద్గురొక్కొటి కాయతసంఘములాఱుగూర్ప; నా
పాదిత ధర్మబద్ధమయి పట్టణరక్షణసల్పుచుండె, సం
పాదిత సర్వసౌఖ్యములఁ బౌరులునిశ్చల వృత్తినుండ, నే
కోదరులే మొయన్న భ్రమనొందుచు లోకము విస్మయంపడన్. 73

చ॥ తరగతులుండె రెండు మగధావని మౌర్యునిపాలనంబునం
బురపరిరక్షణంబొకటి పూనియొనర్పఁగ, వేఱొకండు తీ
ర్పరియయి సైన్యరక్షణము పాడిదొలంగక సల్పుచుండ, భూ
వరుని యశోలతల్దిశలఁ బ్రాఁకెను, వ్రేలిడి చూపకుండఁగన్. 74

మ॥ ఒకపంచాయతి శిల్పకారులను, వేఱొక్కండు సుంకమ్ము లిం
కొక పంచాయతి రాకపోకలను, నింకొక్కండు బేహార, మిం
కొక పంచాయతి వస్తుమూల్యముల, నందొక్కండు పన్నుల్దగం
బ్రకటప్రౌఢిగఁ జూచుకోఁదొడఁగి యప్పాట్నాపురంబేలఁగన్. 75

చ॥ కరిబల మశ్వసైన్యమును, గాల్బలమ ట్లరదంపుసైన్యముం,
బరఁగను నావికాబలముఁ బాలనసేయఁగ నైదునాయతుల్
తిరముగఁ జోటుమార్పులకుఁ దేఁకువనొక్కటి పూనిసేయ న
వ్వెరపునఁ జంద్రగుప్త పృథివీశునిరాజ్య మసాధ్యమైతగెన్. 76

చ॥ అతనికి, గాల్బలంబడరె నద్భుతపౌరుష మూలులక్ష లా
యతమయి, వేలువుష్పది హయంబులు, తొమ్మిది వేలయేనుఁగుల్,
తతమయి వేలు నెన్మిది రథమ్ములునొప్పఁగ, యుద్ధకౌశలం
బతులముగాఁగఁదీర్చ, వినయంబు నయంబు, సమున్నతింగనన్. 77

ఉ॥ అప్పటి సైనికాంగముల కాయుధములొప్పెలుపొందె నీ శెలు
వ్నెప్పున నొప్పుకత్తులు, తమిం దమయెత్తగువిండ్లు, బల్లెముల్,
చొప్పడయుద్ధరంగములు, జోదులు దిట్టలుగా మెలంగ, నా
చొప్పున రాజ్యమేలెను వసుంధర నింతటివాడు లేఁడనన్. 78

ఉ॥ పల్లెలు పట్టణంబులును బంటల, వృత్తులనోలలాడి, సం
పల్లలితంబులై యొసఁగు భంగినిదిట్టములై తలిర్పఁగం
గొల్లగఁదీర్చ జేసి తనకున్ సరిసాటియొకండు లేఁడనం
జల్లగ రాజ్యమేలెను బసందు పసందని మెచ్చ భూజనుల్. 79

చ॥ ఒకచిన తప్పుచేసినను నూపిరితీయుదునన్న శాసనం
బు కడుఁ బ్రజాళికిం దలఁకుఁబొందఁగఁదీర్చిన చండశాసనుం
డొకఁడుగలండె యుర్విని గడుంగడుఁ గ్రూరుఁడు చంద్రగుప్తుఁడున్
దికమకతప్ప, నాతనికి దీటుగలండె యొకండు పాలనన్. 80

ఉ॥ చారులు సత్యసంధులు విచారవిచక్షణు లాత్మనిర్మలుల్
శూరులు గూఢసత్యము నిరూఢినెఱింగెడి నేర్పుచూపఁగన్
భారము లేని తీర్పులిగఁ బాలకవర్గము వాసిగాంచె, నా
తీరున నేకదా ప్రభుత దిట్టము, చట్టములున్న నేమగున్. 81

ఉ॥ రాజవినోదము ల్మగధరాజులకయ్యె నజాలిపందెముల్,
మోజగు కోడిపందెములు, రూఢిగ వేఁటయు నప్పుడప్పుడు
త్తేజకమయ్యె, దానికొకతీరు వినిశ్చితమయ్యె, రాజశో
భాజనకంబుగా యవనభామలు కొల్తురు రాజుపార్శ్వముల్. 82

ఉ॥ ఏనుఁగునెక్కి యేఁగుధరణీశుఁడు వేఁటకుఁ, దోవప్రక్కల
న్మానక త్రోళ్లు కట్టుదు రమాయికసూజనమందుఁ జొచ్చినం
గాని మరల్పరాని మరణంపువిధానమె శిక్ష, యిద్దియే
గాని నిరంకుశప్రభుత, కాక మరెయ్యది నిశ్చయింపఁగన్. 83

సీ॥ సింధు, హిందూకుశాబంధ, మాష్ఘనిస్థాన,
మందంపుఁ గాశ్మీరమందికొలువ,
నెంతయు నెసఁగు నవంతిసొంతము గెల్వఁ
గోసలమును సేరి వాసిఁగాంచ,
దిట్టతనంబులు మెట్టి గట్టిగ నేలు
నుద్యోగిగణము సముద్యమింప,
గంగశోణలు పొంగి పొంగార రంగారు
బంగారుఁ బండింపఁ బంటవలఁతి

గీ॥ తక్షశిలయు, నళంద విద్యాలయములు
జ్ఞానదీపంబులై ప్రపంచాన వెలుఁగ
మగధ విస్తృతమైన సామ్రాజ్యమగుటఁ
జంద్రగుప్తుఁడు తానయ్యెఁ జక్రవర్తి. 84

ఉ॥ ఉత్తరదక్షిణంబులనియుం బొగడొందెడు భారతోర్వియం
దుత్తరహైందవావని సముజ్జ్వల తేజుఁడు చంద్రగుప్తుఁ డ
త్యుత్తమ పద్ధతుల్నెఱపి యొప్పుగ నేలుచు, దక్షిణంబునం
దత్తఱినేలెఁ గొంత తనయాజ్ఞకు లోఁబడియుండు భాగముల్. 85

గీ॥ వింధ్యదక్షిణభూమి యవంధ్యయగుచు
వెలయు దక్షిణభారత పృథివియనఁగ
నందుఁ గేరళ, చోళ, పాండ్యములు తప్ప,
మహితకాళింగమునుగూడి మగధసీమ. 86

శా॥ నానాశాఖలఁ దీర్చిదిద్ది పుడమిం దర్పంబు నిండార, స
న్మానప్రోషిమలుల్లసిల్లఁ సన్మైత్రిఁ జాణక్యుండు కల్పింప, ని
ర్మాణప్రాభవ నిర్నిమేష పరతల్ రాజిల్లగాఁ మాగధీ
ప్రాణేశుండయి చంద్రగుప్త ధరణీపాలుండు బల్ధీరుఁడై. 87

ఉ॥ ఎల్లలు పల్లటిల్లఁ దనయేల్బడి యంతట నానృపాలుఁడుం
జెల్లఁగఁ జండశాసనము, చీమచిటుక్కనకుండ నట్లుగా
నుల్లమెలర్పఁజారులకు నొప్పును మెప్పును, జొప్పడంగ, ని
ల్వెల్లనుగండ్లుగా మగధనేలెను నిర్వదియైదువర్షముల్. 88

సీ॥ చాణక్యకౌటిల్య శాస్త్రసంపాదిత
రాజ్యపాలనకలా ప్రౌఢదీక్ష,
న్యాయంబుఁబరికించి వ్యాజ్యంబుఁదిలకించి
శిక్షలవిధియింపు సిరులసొంపు,
నిష్పక్షపాత నిర్ణిద్రవిచారణఁ
బేదలనరయుట పెంపుఁగనుట,
కార్యదీక్షారతి ధైర్యానుగతనీతి
పాలితాఖిలజాతి బహువిభూతి,

గీ॥ వెలయమాగధరాష్ట్రంబు విస్తరించి
తేఱిచూడంగ లేనట్టి దిటవునెఱపి
చంద్రగుప్తుఁడు పాలించెఁ జతురుఁడగుచు
లేరుజగమునఁ దనుమించు ధీరులనఁగ. 89

ఉ॥ ధారుణినేలుకాలమున దక్షిణహైందవభూమిని న్మహీ
శూరపురంపురాష్ట్రమునుజొచ్చెఁ గళింగములోఁబడంగ, నా
శూరుఁడు చంద్రగుప్తుఁడనుచుండ్రు, చరిత్రముచాటునిక్కముం
గారణమాప్రదేశమునఁ గల్గుపురాతన శాసనంబులే. 90

ఉ॥ విందుము చంద్రగుప్త పృథివీంద్రుఁడు జైనమతప్రవిష్టుఁడై
యెందఱొ జైనభిక్షువుల కిష్టగురుండగు భద్రబాహుతో
నందువసించె భిక్షువయి యంత్యదశ న్శ్రవణుసూరు ప్రాంతమం
దందురు, శాసనంబులును నందుకు సాక్ష్యములిచ్చుచుండఁగన్. 91

గీ॥ పరులుకన్నెత్తి కనకుండ భద్రపఱిచి
రాజ్యమునువీడి స్వర్లోకరాజ్యమేలు
కోర్కె నేఁగెను దేవేంద్రుగుండెలవియ
సూరులకు నేల నేనేలసులువుగాదు. 92

సీ॥ గ్రీకురాజన్యుల మూఁకలనెదురించి
గిరగిరాలాడించు కీర్తిఘనుఁడు,
పంజాపుప్రజలకుఁ బౌరుషమ్ములువోసి
పరపీడనమ్ములఁ బాపుదిట్ట,
కన్నుగానక తన్నుఁగారియవెట్టిన
నందదుష్టాటవి నఱుకుమేటి,
దారితప్పినఁ గ్రూరదండనమ్మునముంచి
జగమునేలిన చండశాసనుండు,

గీ॥ సేతుశీతనగావృత భూతలమును
నొక్కగొడుగున నడిపిన యొక్కలీఁడు
మహారథ్యకులముద్ధరించిన మంత్రవేత్త
చంద్రగుప్తుఁడు, జగమున సముఁడుగలఁడె? 93

## — బిందుసారునిపాలనము. —

చ॥ పదపడి చంద్రగుప్త నరపాలునిపుత్త్రుఁడు బిందుసారుఁడ
య్యదనున నిస్సపత్నముగ నమ్మగధావనిఁ బట్టభద్రుఁడై
కొదవలులేనిరాష్ట్రమునకుం బ్రభువౌటకుఁ జింతచీకులం
బొదువక యేలెఁదండ్రి పరువుం, బరువుం, గసినిశ్చలాత్ముఁడై. 94

చ॥ అతని కమిత్రఘాతియను నాఖ్యయొకండదియుంటఁ జూడ నా
తత భుజదర్పుఁడై యతఁడు దక్షిణ హైందవభూమిఁ గొంత ని
శ్చితమతియై జయించెనని చెప్పుదురంతియ, గాని యెంతయు
స్మృతిఁ బరికింపఁ దోఁచ వసమానపరాక్రమ కార్యరంగముల్. 95

ఉ॥ ఎన్నఁగఁ జంద్రగుప్త ధరణీశుఁడు కట్టిన యుక్కుకోటలో
నున్నత సౌధరాజిపయి నొప్పునలంకరణంపు సొంపులన్
సన్నుతమైయెసంగు సరసంపురుచి ప్రకరంపుటింపుసి
ద్ధాన్నము, చింతసేయఁగలదా యొకవాదపు హేతువయ్యెడన్. 96

చ॥ ఇరువదియైదు వత్సరము లేలెను నాతఁడు తండ్రివోలె, భా
సురసుకుమారసుందరి మునుంగిడి యాడెడు ముగ్ధయట్లు, చూ
పఱులమనంబులందిగిచి పల్కులఁ దళ్కులఁ బారవశ్యముం
దొరలఁగఁ జేయ జిర్ణగవుతోఁపఁగ రాజ్యరమావధూటి తాన్. 97

మ॥ సిరియాదేశము నేలువాఁడరుగఁగా సెల్యూకసుం, డా పురీ
శ్వరుఁడై యాతని పుత్రుఁడాంట్యోకసుఁడుం, బ్రాజ్ఞుండునై గుప్తుఁడు
న్వరలన్మైత్రిని, డీమెకాసుఁడపుడ పాట్నాపురీవాసియై
పరఁగెందిట్టఁడు రాయబారియగుచుం బ్రజ్ఞావిశేషోన్నతిన్. 98

—♦ అశోకచరిత్ర ప్రారంభము. ♦—

సీ॥ బిందుసారనరేంద్రు బిడ్డఁడై శూరుఁడై
ప్రజ్ఞాధురీణుఁడై పరఁగె నెవఁడు,
మగధసామ్రాజ్యసీమల నేలు దిట్టయై
సత్యధర్మప్రౌఢిఁ జూపె నెవఁడు,
జీవకారుణ్యమా జీవమయ్యెడునంచు
దేశదేశమ్ములఁ దెలిపె నెవఁడు
మనకథానాయకమణి లోకపూజ్యుండు
సుశ్లోకుఁ డౌ వాఁ డశోకుఁ డతఁడె

గీ॥ తండ్రి యాజ్ఞానుకూలుఁడై ధర్మగతిని
రాజప్రతినిధియాచు సామ్రాజ్యమునకుఁ
బరఁగ నుజ్జయినీ పురప్రభువుగాఁగఁ
గడఁగుచుండెను నొడలెల్లఁ గన్నుగలిగి. 99

గీ॥ తండ్రి మరణంబునొందు తత్సమయమందు
సరగఁజనుదెంచి తనపరువరసి చాటె
రాజ్యమంతకు నేన సమ్రాట్టుననుచుఁ
గాని పట్టాభిషేకంబు మాఱుపడియె. 100

—♦ అశోకుని పట్టాభిషేక మాలస్యమగుటకుఁ గారణములు. ♦—

సీ॥ బిందుసారనరేంద్రుడెందమ్ము మెప్పించు
పదునార్గురైన యప్పుత్రులందుఁ
గల్గు పుత్రులయందుఁ గడపటికోటిలోఁ
జేరునశోకుండు ధీరుఁడగుచుఁ
దండ్రికి మరణంబు తలకొనునమయంబు
మననంబుసేసి, వెంబడినయుండి,
రాజ్యంబునకును సమ్రాట్టుగావలెనంచుఁ
బలికిన యంతలోఁ బగలుపెరిగి

గీ॥ పలుతెఱంగులఁ దమలోన వగలుహెచ్చఁ,
దెగడియందఱఁదెగటార్చి, తిస్సవిడిచి,
గద్దెఁగైకొనెననియెడి సుద్దియొకటి
కాలయాపన హేతువై కాలుచుండు 101

ఉ॥ పొందుగబిందుసారనృపపుత్రులు నూటయొకండుగాఁగ, నా
యందఱలోనఁ బెద్దసుమనాఖ్యుఁడు, తిస్సుఁడు చిన్నవాఁడుగా
నిందఱలో నశోకునకు నెద్దియుపాయము గద్దెనెక్క, నా
క్రిందనముల్గలంప, సమరంబులు క్రిందుకొనంగఁ జిత్రమే 102

ఉ॥ సందడిచేసి యందఱను జంపి యశోకుఁడు గద్దెనెక్కెనం
చందురు కొంద; అప్పలుకులాగవు నిల్వఁగనంచుఁ బల్కఁగా
విందుము, "బిందుసారునకు విప్రుఁడొకండొక కూఁతునీయ, నా
సుందరియందశోకుఁడు, విశోకుఁడు పుట్టిరటన్న పల్కులున్. 103

చ॥ తలచిరి విప్రకూఁతుఁదొలుతం దనపత్నులు దాసిఁగాఁగ, న
వ్వేలఁదియు సందుజూచి పృథివీశుని డెందము నందుకొంచు, నా
విలమతియూచు నిట్లనియె "విప్రకులంబునఁ బుట్టుదాన, నా
కులగతిఁగాంచి, యించుపనిఁగొంచు సమంచిత వృత్తినుంచవే" 104

చ॥ అనుటయుఁ జిత్తముం గరుగ, నత్యనురాగము పెర్గఁ, బల్కులా
తని మతినత్యుదారగుణ తత్పరమౌనటు ప్రోత్సహింపఁగాఁ
గనికరమంది సాంద్రగుణగణ్యు నశోకుని విప్రనందనుం
గని "యితఁడేలువాఁడు కడఁకం బృథివీతలమం"చు నెంచుచున్. 105

గీ॥ పిలిచి యువరాజ పట్టంబు బేర్మిఁ గట్టి
యనిపెఁ దక్షశిలాపురంబునకు రాజ
ప్రతినిధిత్వము తలమోపి పదిలమనుచుఁ,
గాని నిక్కంపుఁ బ్రేమ భూజాని గనునె? 106

ఉ॥ చక్కఁగఁ గాలమప్పగిదిఁ జాలఁగసాగఁగ నంత్యకాలమం
దక్కపటాత్ముఁడౌ జనకుఁడాదరమేది, సపత్నిపుత్రులం
దొక్కనిఁ బెద్దవానిఁ దనయుంగని మెప్పునుజూపెఁ, జిత్రమౌ
నెక్కడిప్రేమలీజగతి నెప్పటియక్కర లప్పుడేగదా. 107

ఉ॥ సారవిహీనుఁడౌ నతఁడు చయ్యనఁబట్టముఁ గట్టుమన్న, నా
బూరుగు నెట్టులో సచివ పుంగవులుం గడతేర్చి, పేర్చి, బల్
ధీరుఁబరాక్రమోజ్జ్వలిత తేజు నశోకు గభీరభావు నిం
పూరిమిచిల్క రాష్ట్రమునకుం బతిఁగమ్మని కోరి రందఱున్. 108

చ॥ ఎఱుఁగఁగ నేర నెయ్యెడ నెవ్వని కెవ్విధి వ్రాసియుండునో
తఱుఁగని పక్షపాతముల తత్పరతం దలఁదన్ని మిన్నగ
న్వోరలు నదృష్టరేఖ తలఁప న్విధిచోదకమాచుఁ గావఁగం
జరిపిన పక్షపాతమది చాలెనె వీడ నశోకు భాగ్యమున్ ' 109

గీ॥ ధూర్తుఁడై సోదరులఁ జంపు దుష్టుఁడన్న
వార్తయొక్కటి యెడనెడ వాడుకొనఁగఁ
బరఁగె మూఁడేండ్లవ్యవధి తత్పట్టమునకుఁ
గలహ మూలంబు సామ్రాజ్యకాంక్షపుడమి 110

గీ॥ తొడరి యిన్నూటయిరువది తొమ్మిదేండ్ల .
కాలమయ్యెది క్రీస్తుముక్, ఘనునశోకుఁ
జేర్చె నెయ్యెది పట్టాభిషిక్తు మగధ
రాజ్యలక్ష్మి సమాగమ ప్రాభవంబు 111

ఉ॥ సోదరసోదరీగణ మశోకుని పాలన మధ్యకాలమం
దాదరపూజ్యమై పరఁగెనంచు సమంచితమైన పల్కు, ని
ర్బాధముగా నతండు తనరాజ్యముఁ గైకొనెఁ దండ్రిపోలె, నే
భేదములుప్పతిల్లవని పేర్కొనుచుండఁ గనమ్మకుండు టే. 112

ఉ॥ శాసనబద్ధమిప్పలు కచంచలమై కనుముందు నిల్వ, దు
ర్వాసనలెట్టులో పెరిగె భాస్వదశోక చరిత్రయందు, స
న్న్యాసులబౌద్ధ వాఙ్మయమునాఁటి పురాణకుకల్పనంబులా
దోసముకానరా దతఁడు దుష్టుఁడనంగ నిమిత్తమేమిటో 113

—♦ అశోకుని పట్టాభిషేకము. ♦—

సీ॥ సౌధాగ్రములనిండు సౌరుల మెఱయుచు
ధ్వజపతాకలు దేవతతినిఁ బిలువ,
రమ్మరమ్మని స్వాగతమ్ములఁ బమ్మెచు
శృంగారతోరణాల్ రంగులీన;

దోరణరాజపై దొంతరలై శాలిలు
కుసుమవాసనలు ఘుంఘుమలఁజేలఁ,
బన్నీటి చల్లకాలున్నాడి పథికాంత
రంగాళిఁ బొంగించి చెంగలింప

గీ॥ చంద్రిశాలా విశాలంపు సౌధపంక్తి
రంగవల్లీతరంగాళిఁ బ్రతిఫలించు
పగిదనొప్పఁగ సామ్రాజ్య పట్టమునకు
సొగసులనుదీర్చెఁ బాటలీసుదతి యపుడు. 114

సీ॥ నానామణిప్రోత శోణాతటోద్భూత
రంభాతరువ్రాత రంజనముల,
అంతరాంతర దీప్తికాంత దీపపుఁగాంతి
చంద్రికాధవళాప్తి సాంద్రరుచులఁ
ఘనసారచందనాగరుగంధ సంబంధ
వాసితోన్నిద్ర నివాసతతుల,
సంగీతసాహిత్య సరసాభినయనృత్య
శృంగారితోత్సంగ రంగరుచుల,

గీ॥ సౌధములతీరు స్వర్గంపు సౌరుఁగేరు
ముగ్ధకాముక యువకుల ముద్దుఁగోరుఁ,
జొచ్చికను గొన్నఁబాటలి సొబగు వేఱు
సందడింపంగఁ బట్టంపు సంబరములు. 115

చ॥ అతులప్రతాపమూర్తి యనఘాత్ముఁడశోకుఁడు ధీరుఁడుర్విఁకిం
బతియగునంచు వేడుకలు పర్వఁగ, నుర్విఁయుఁబొంగె నోయనన్
సతతము వాద్యఘోషములెసంగ నభస్థలమెక్కి మ్రోఁగఁగాఁ,
గుతుకమెసంగుఁగాదె తనకుంబతి యట్టిఁడు దిట్టఁడౌనెడన్. 116

ఉ॥ చేరెను బంధువర్గములు, చేరిరమాత్యులు, మిత్రకోటియుం
జేరెను, రాయబారులును జేరిరి, పౌరులు పండితోత్తముల్
చేరిరి, రాజకీయులును జేరిరి, సర్వము నాయితంబుగాఁ
శూరుఁడు పట్టభద్రుఁడగుచుండ నశోకుఁడు మించువేఁడుకన్. 117

ఉ॥ పట్టపుశే న్గభంగుర శుభంకరభంగి నలంకృతంబుగా
నట్టిశుభోదయ ప్రభల నందముచింద నశోకుఁడెక్కె నూ
పట్టె దిగంతరాళముల వ్యాప్తికిఁ బొంగెడు భాస్కరుండొనా,
నుట్టిపడంగఁ బట్టపు సముజ్జ్వలితోత్సవ కౌతుకంబులన్. 118

ఉ॥ బారులుతీర్చి బెత్తములవారు బరాబరిసేయుచుండ, దై
వాఱఁగ వాద్యఘోషములు ప్రాఁకిదివంబును బోరుకొల్ప, శృం
గారిత చత్వరంబుల నఖండములై జయఘోషలొప్ప, నా
భూరిపరాక్రముండు గుణపూజ్యుఁ డశోకుఁడు నాల్గువీధులన్ 119

చ॥ మెఱవణినేగుదెంచి తమిమించఁగ ద్వారమునందుడిగ్గి, చా
మరములమధ్య నిర్ఝరసమాహితరేఖలు రెండు ప్రక్కలం
బరఁగఁగ సొంపునింపుఁ గొలుప న్నడయాడెడు కొండపోలె, భూ
భరణము దుర్వహంబనెడుభావము తోఁపఁగ గొల్వుచేరినన్ 120

ఉ॥ సొంపుగసింహపీఠిక నశోకునిఁజేర్చి పురోహితుండు, భా
సింపఁగ మంత్రపూత మభిషేక మొనర్చి, పవిత్రశీర్షమం
దింపులు గుల్కుచున్ రహివహించు కిరీటముఁబెట్టఁ బండితుల్
పొంపిరి సర్వసౌఖ్యములు పొందఁగ దీవనలిచ్చి రెంతయున్. 121

ఉ॥ అంతట రాయబారులును, నాపయి మంత్రులు, వాహినీపతుల్
ప్రాంతములందునిల్చి బహుభంగుల దీవనలిచ్చుచుండ, సా
మంతులు పాదపీఠిఁగుసుమాంజలి యప్పనసేసి మ్రొక్క, న
త్యంత మశోకభూవరుఁడు హర్షము చాలెను పట్టభద్రుఁడై. 122

ఉ॥ దానముచేతఁ బేదలు, సుధామధురోక్తుల మిత్రకోటి, స
న్మానముచేత మంత్రు లసమానసపర్యలబంధువు, లక్షహో
దానముచేత విప్రులును, ధర్మముఁ బెంచినను సాధువు, లభిమా
ధానముచేతఁ బౌరులు నితాంతము హర్షములంది కొల్వఁగన్. 123

ఉ॥ లేచి సభాసదుల్వినఁగఁ బ్రేమతలిర్పఁగఁ బల్కెనిట్లు, "నా
యాచితి నెంచి, హర్షసముదంచిత చిత్తుల మిమ్ముఁ గాంచి, యీ
యేచినభక్తి తత్పరతకేను కృతజ్ఞుఁడనంచు నెంచుఁడీ
మీచన వూఁతగాఁ బుడమి మెచ్చఁగ నేలెదఁ దాతయట్టులన్.124

ఆ॥ అనుచుఁ బ్రీతిన సలుపు నయ్యశోకనరేంద్రుఁ
డనుప, వీడుకొనుచుఁ జనఁగనెంచి
విందులారగించి వేడ్కల హర్షించి
యరిగిరెల్లవార లనువు కొలఁది. 125

—♦ అశోకుని రాజ్యపరిపాలనా ప్రారంభము. ♦—

చ॥ ఇరువదిరెండువర్షముల యీడునఁ బట్టముఁ గట్టుకొన్న యా
నరపతి యెన్మిదేండ్లటు లనంతవిలాసవినోదియౌచు, నే
గురుతరభారముంగనక, కుందక, కందక, బొందుపోక, స
త్పురుషుఁడు చంద్రగుప్త నృపపుంగవుఁ డట్టుల రాజ్యమేలుచున్.

ఉ॥ ఊనివసించు కాలమున నుజ్జయినీపురి, వైశ్యకూఁతు నిం
పూనఁగఁ బెండ్లియాడెననియుం దనపాటలి పైనమప్పు డా
దీనమహేంద్రుఁబుత్రుఁ, బ్రిఖుతింగను పుత్రిక సంగమిత్ర, నం
దే నిలు వంగఁజేసెనని తెల్పుఁ జరిత్ర, యదెంత నిక్కమో. 127

చ॥ తొలుతటి యెన్మిదేండ్లు తన తోఁచినయట్లు వినోదలోలుఁడై
మెలఁగు నశోకభూవరుఁడు మేదిని సర్వసమృద్ధమై తగం,
దలఁచెను దక్షిణాపథముఁ దప్పక కైకొనువాఁడనంచు, నెం
దులఁగల రిచ్చలేని నృపతుల్తమ రాజ్యము విస్తరింపఁగన్. 128

## —♦ వసంతర్తు వర్ణనము. ♦—

ఉ॥ పంతముఁబట్టి గట్టిబలవంతము లెంతయు లెక్కసేయకే
కాంతమునందుఁ జింతిలుచుఁ గాంతులఁ జెంతలఁ జేరనీక య
త్యంతము కోపఘూర్ణిత ముఖాంబుజ ముల్ముకుళింపఁజేయు న
క్కాంతల కౌఁగిలింత లెసఁగంగ వసంతుఁడు రాయబారియై. 129

ఉ॥ వచ్చెఁ, గుహూకుహూయనురవమ్ముల కోయిల స్వాగతమ్ముల
న్నిచ్చె శుభోదయమ్మనుచు నెమ్మది మోదుగురాగ పూర్ణమై
హెచ్చువిలాసముల్మెఱప, నెల్లెడఁ జిల్కలు కల్కిపల్కుల
న్మెచ్చుటఁగూర్ప, సంతసిలుమోము కడుంగడు వెల్గు లీనఁగన్. 130

చ॥ లలితవసంతరాగ సమరాంగణభూమిని ముగ్ధకావుకుల్
కలితమనోభవాంగిక విలాసపుఁబల్కుల పూలముల్కులం
గలకల మొప్పఁబోరిరి ముఖాముఖి యొండొరు క్రిందుమీఁదులై
మలయజవాయుపోతములు మాటికిఁజక్కిలిగింత పెట్టఁగన్. 131

ఉ॥ చుక్కలతేఁడు తేలమదిఁజొక్కుచు, నిక్కుచు, వెక్కిరించుచుం
బొక్కువియోగితాప భరముంగొని నల్గడఁజిమ్మఁ, గ్రిమ్మఁ, దా
నెక్కువియత్తలం బపహసించెడు పోల్కిని వెల్గుచుండె, నిం
దొక్కరి వెక్కిరింపులకు నొక్కరి స్రుక్కులు తావలంబహా. 132

సీ॥ ప్రాదేశములఁగూడి పంతాలు విడనాడి
సంతాపములవీడి జంటలొప్ప
వియ్యాలలోఁడాగి యుయ్యాలలోనూగి
సయ్యాటలోదోగి నెయ్యమడర,
కాంతారములఁదవి సంతానములభావి
యెంతేని ముదితావి సంతరింప,
యోగాలు, త్యాగాలు, భోగాలు మితిమీఱి
రాగాలవాలమై రహివహింప,

గీ॥ అంతకంతకు నిత్య మత్యంతమడరి
పూలవనములఁ బొదరింట్లఁ బువ్వుఁబోండ్లఁ
జెంతలనుజేరి కంతునెచ్చెలి యనంత
సంతసముఁగూర్చె నిండు వసంతుఁడపుడు. 133

గీ॥ భావములపంట, యువకుల వలపుజంట
అంగజవిలాస వికసనాభ్యాసగురువు
నింటనింటను గలుముల నంటునంటు
కన వసంతుఁడె నిండు జవ్వనపు బంటు. 134

క॥ గుసగుసలాడ వసంతుఁడు
బిసరుహ పత్త్రేక్షణాళి బింకము తొలఁగన్
పొసఁగెను మన్మథ రాజ్యము
కసి తొలఁగు ప్రజాప్రభుత్వ గరిమకు నెనయై 135

చ॥ లలితరసాలపల్లవములన్ మృదుకంఠము చక్కఁజేసి, ని
ర్మల శుభవృత్తముం దెలుపు మంగళగీతిక పాడుచుండెఁగో
కిలము, వసంతశోభ గిలిగింతలు పెట్టి వనాంగణమ్ములం
గలికితనంపుఁ బెండ్లికొడుకైన మనోభవు కీర్తి చాటుచున్. 136

ఉ॥ ఆకులు రాల్చి క్రొత్త చిగురాకులు పూవులలంకరించి, బి
బ్బోకము చొప్పడం బ్రకృతిముద్దియ వెల్గె వసంతలక్ష్మి “నా
శోకడ, నావిలాసములు, పొందిక నందునె యెందు నేని” అం
జోకను, ముగ్ధమైజగము సుందరరూపముఁజూచి చొక్కఁగన్. 137

ఉ॥ క్రొత్తఁదనంబు తావసుధకుం గలిగించి వసంతలక్ష్మి, ని
ర్వృత్తి మనంబులం దొలకరించఁగ నూత్నవిలాసవీచిక
ల్మొత్తములాచుఁ గ్రమ్మకొన, ముగ్ధ ముదంబుధిఁ దేలియాడుచుం
దత్తరమేది సౌఖ్యపరతంత్రిత వెల్గె శుభోదయమ్ములన్. 138

—♦ అశోకుఁడు వేఁటకరుగుట. ♦—

ఉ॥ తాతయుఁ దండ్రిపోలె సరదారుఁ డశోకుఁడు వేఁటలాడఁ బ్రి
ఖ్యాతివహించి యప్పుడపు డమ్మృగయార్థ మరణ్యమేఁగువాఁ
డాతఁ డొకప్పుడిచ్ఛమెయి నంతిక కాననమేఁగె వేఁటకై
ఘాతుకవన్యసత్త్వ పరికల్పితబాధలు తోఁచకుండఁగన్. 139

ఉ॥ వేఁటయనంగ నెంతు ప్రిథివీస్థలి దుర్వ్యసనంబటంచు, దు
ర్గాటవిఘాతుకోద్ధత మృగంబులఁ జీల్పఁగవచ్చు లక్ష్యమున్
సూటిగఁగొట్టు నేర్పుమదిఁ జొప్పడు, దేహముకార్శ్యమందుటం
దీటుగఁజుల్కనై పరుగుదీయఁగవచ్చు, నిషిద్ధమెందుకో. 140

సీ॥ పరుగువాఱెడు మృగపఙ్క్తిని గాన్పించి
పిఱికిపందల తీరు లెఱుకపఱుచు,
గాండ్రించుమెకపు మగంటిమిఁ జూపించి
పౌరుషబీజంబుఁ బదిలపఱుచుఁ
గోళ్లువాఱెడు వాని రీతులు మెప్పించి
లాఘవ చతురతల్లక్ష్యపఱుచు,
వివిధమృగంబుల వెన్నాడి తఱిమించి
కార్యదీక్షారతి గట్టిపఱుచు,

గీ॥ బీతుఁదొలఁగించుఁ బరుగిడురీతిఁ గఱపు
నెగుడుదిగుడులఁ బోకార్చి బిగువుఁగూర్చుఁ
జూడ మృగముల స్వేచ్ఛంద సుఖముఁదెలుపు
వేఁటమించు వినోదమేనాఁటఁ గలదు. 141

ఉ॥ కట్టిరి పిక్కటాళ్లు వడిగం జనుదారినిఁ, గంపముండ్లు వే
నెట్టి రశోకభూవరుఁడు నిశ్చితప్రాంతముఁజేరుదాఁక, బల్
దిట్టలు వేఁటకాండ్రు పరతెంచిరి ముందఱ గోలపెట్టుచున్
నట్టడవిన్నడి న్మృగగణంబులు బెగ్గిలిలేచి పాఱఁగన్. 142

ఉ॥ ఏఁగి యరణ్యప్రాంతమున కేనుఁగు నెక్కి నరేంద్రుఁ డొక్కచో
నాఁగఁగ, భృత్యకోటి మృగయా పరతంత్రమనస్కమౌటచే
సాగ మృగవ్యమత్యధిక సంభ్రమ సంభృతమౌచు, నిచ్చన
యోగ్యగజను త్రలంకుగొని యుద్ధతియేమని నివ్వెఱంపడక్. 143

సీ॥ గవులలోపలనుండి గాండ్రించు సింగముల్
చెంగుచెంగను దాట్లనంగలింప,
పొదలలోపలి పెద్దపులుల మొత్తమ్ములు
తత్తరమ్మున లేచి దాడుదీయఁ,
గొండవాగుఁల దిగ్గదండి యేనికదండు
చండతరార్భటి మండిపఱవ,
నిక్కించిమోముల, రిక్కించి కొమ్ములఁ
గ్రుమ్మకారెనుములు చిమ్మిపాఱ,

గీ॥ గోలచెలరేఁగి యడవి గగ్గోలుపఱుప
నెక్కడెక్కడి మెకములు నిక్కిచూచి
దిక్కు తెలియక బెదరుల సుక్కిపాఱ
విప్లవంబులు చెలరేఁగు వితముదోఁచె. 144

ఉ॥ దుప్పులుకుప్పలై పడఁగ, దొంకల సూకరపంక్త్రాలగం,
జప్పున శల్లకూలఁగ, వనంబున సంతట వేఁటకాండ్రు తెం
పొప్పఁగఁ జోపిచోపి కడునుద్ధత ఘాతుక సత్వసంతతిం
జొప్పడఁ బౌరుషంబు గడుసుం దన మీాది వధించుచుండఁగన్. 145

చ॥ గుఱిగొని మంచెమీఁదఁ దనకుంగుఱిపడ్డ మృగంబులేయుచుం,
దఱుముచు నొక్కవేళ వడిఁ దానును, నెమ్మదిమంచె నుండుచుం
బరిగొని యంప కోలలఱుమన్ మృగసంతతిఁ గూల్చుచుండె న
య్యుఱిమిఱి పాటులేని నృపుఁడమ్మృగయా పరిణద్ధ చిత్తుఁడై. 146

ఉ॥ మూఁడుదినంబులిప్పుగిది ముచ్చటదీఱఁగ వేఁటలాడి, మ
ర్నాఁడొకకొంతసేద యమరం దనవారల హెచ్చరించి, యా
నాఁడు మృగవ్యమాపి, విపినంబున నొక్కెట విశ్రమించె, నే
నాఁడునులేని సంతసమనంతము గూర్పఁగఁ బక్షిరావముల్. 147

ఉ॥ శోణనదంబు మందగతిసొంపె సలారెడు నిస్స్వనంబునం
గానముసేయుచుండ, గహనాంతరచారి వసంతవాతముల్
సూన సువాసితంబులయి శోభనరాగము దీటుకొల్ప, న
క్కానన మంతటంబలుకఁ గొంత శకుంతపు సుస్వరంబులున్. 148

ఉ॥ హాయిపొనర్ప భూవరుఁ డహాయని యొమ్మనఁజేయివైచి, యా
హ్వాయితమూర్తియై నిదురబట్టి కడుంగడు సేదదేఱె, దు
ర్న్యాయలు వాయుయోగిగతి మాయఁగజింతలు నిశ్చలాత్ముఁడై
యేయెడనున్న నేమి యలరించు నదృష్టము కూడనుండఁగన్. 149

చ॥ కలఁతలులేని రాష్ట్రములు, కాంక్షలఁదేలని ప్రోషకాముకుల్
ఫలములమాని ధర్మములు, భాగ్యముఁ గోరని మానవు ల్ధరా
తలముననుందురే, యరిది, ధార్మికరాజ్యము, నిచ్చలుం బ్రజా
సులభుఁడు చింతచీకుల నశోకుఁడెఱుంగఁడు, పున్నెమెట్టిదో. 150

—♦ సూర్యోదయ వర్ణనము. ♦—

ఉ॥ చల్లనితెమ్మెరల్మదికి సంతసముం బొనరించుచుండ, సం
ధిల్లఁగవేఁట వేడ్కలు, మదిందలపోయఁగఁ గార్యఫక్కి, వె
ల్వెల్లను దూర్పురేకలటవీ స్థలిఁబర్వఁగఁ, జుక్కవొడ్వఁగం,
బల్లునఁదెల్లవాఱె వడిభాస్కరుఁడెక్కఁగఁ దూర్పుకొండపై. 151

సీ॥ శ్రీహరి తనయింటి శిఖరంబుపైనిల్పి
దేశాల వెలిగించు దీపమనఁగ,
భారతజాతీయ భావపూరితకర్మ
చోదకమగు పెద్దజ్యోతియనఁగ,

ఆశావధూటి నిత్యానంద సౌభాగ్య
తీర్చు కుంకుమబొట్టు తీరనంగ
సృష్టజగద్దృష్ట తుష్టుఁడై యాడించు
బంగారురంగుల బంతియనఁగ,

గీ॥ భాస్కరుండొచుఁ బ్రభవించి పరిఢవించి
యించుకించుక యుదయగిరీంద్ర శృంగ
తటినిఁ బొంగుచుఁ గర్మతత్పరతఁ గఅపు
కరణి నుదయించె విశ్వంపుఁ గర్మసాక్షి 152

గీ॥ తీర్చుకొని నిత్యకర్మంపు దీక్షలెల్లఁ
బేర్చి వేఁట కశోకుఁడు వేడ్కపడఁగఁ
బరిజనంబులు బంటులు 'భాగ్యమ'నుచు
నలుగు తలుగులతోడ నాయత్తులయిరి 153

క॥ కూడిరిగుంపుగ నొక్కట
నాడిరి కౌతుకమెసంగ నడవిచలింపన్
బాడిరి పౌరుషమడరఁగ
వీడిరి తెగతెగలుగాఁగ వేఁటాడుటకున్. 154

శా॥ ఆనాఁడాతఁడశోక భూపతి సమగ్రాటోపదీప్తాత్ముఁడై
శ్వానంబుల్తన వెంబడిం బరవ నశ్వారూఢుఁడై పిక్కలా
బాణంబుల్గొని విల్లుబట్టి యతుల ప్రజ్ఞావిశేషోద్ధతిం
దానొక్కంటను వేఁటలాడ నరిగెం భావి ప్రభావంబునన్. 155

మ॥ తిరిగెంగానన మెల్లచోటు లరసెం దేదీప్యమానుండు, భా
స్కరుఁడత్యంతము తీవ్రతాపకరుఁడై గాసించునందాఁక, నె
త్తెరువుంజొచ్చిన నొక్కసత్త్వమయినం దృగ్గోచరంబయ్యెనే?
పరుగుల్వాఱిన యంతమాత్రమున సంభావ్యంబులే భాగ్యముల్. 156

ఉ॥ ఒక్కటఁ బోతరించు మృగ మొక్కటి మేయుచునుంటఁ గాంచి, యా
చక్కికి గుఱ్ఱముం దఱుమఁ జప్పుడు సోఁకఁగ నిక్కి చూచి యా
మ్రుక్కడిలేడి పర్విడఁగఁ బూనెను వెన్కకుఁ ద్రిప్పి చూచుచుం
జిక్కక నాల్గుకాళ్లు ధరణీస్థలి మోపియు మోపకుండఁగన్. 157

ఉ॥ భూపతి యెక్కిడించి శరము న్వడి దానిని వెంబడించె ము
కోపము మోముపైఁ గదుర, గుఱ్ఱపువేగము హెచ్చరించుచుం,
బాపమొ పుణ్యమో! యొకఁడు పట్టినపట్టునె తీర్పఁ జూచుఁ గా
నీ, పని పన్కిరాదని యనిందన్యపుబద్ధతి యోజసేయునే? 158

ఉ॥ దూరము లాగికొంచు వడిఁ దొంకలువాఁగులు క్రేళ్లువాఱుచుం
గారడవి న్మహారయముఁ గైకొని చిక్కక నిక్కి చూచుచుం,
దూరుచుఁ జెట్లసందులను దోఁచక కంటికి మాయదారియా
గారడిపోలెఁ గన్నులకు గంతలుకట్టుచు బాఱుచుండఁగన్. 159

చ॥ ఇది పనిగాదటంచు మదినెంచి శరంబునులాగివీడ, న
య్యదివడిమేన దూరిచన, నంతట నెత్తురు కాల్వగట్టఁగం
జదికిల భూమిపైఁబడుచుఁ, జావక ముందుకుసాగి యాశ్రమం
బది తన కాశ్రయంబగుట, నచ్చటఁ జొచ్చి వగర్చుచుండఁగన్. 160

—♦ అశోకుఁడు బౌద్ధాశ్రమమును బ్రవేశించుట. ♦—

చ॥ కని మునిబాలకు ల్తమ మృగంబటులౌటకు హేతువేమియం
చనుకొను నంతలోన నొకఁడాశ్వికుఁ డాతని ముందు కొందఱు
న్వనమున నేదియో వెదకువారయి వచ్చుటఁ గాంచి, యేమియే
మని యెగఁజూచుచుండఁగ భయంకరకింకరు లొక్కరిద్దఱున్. 161

చ॥ బిరబిర నేఁగుదెంచి తమబింకముఁ జూపుచు, "మా యశోక భూ
వరుని శరంబు వ్రేటుదిని వచ్చినలేడినిఁ దెచ్చియిండు, మీ
రరయుదురే మహీపతి యహంకృతిమీఱఁగ నందునిల్చునం"
చుఱుముచుఁ బల్క, శాంతినిలయుల్మని బాలకు లబ్బురంబునన్. 162

చ॥ "నరపతి యేఁగుదెంచెనె, వనంబిది యెంతటి పుణ్యభాజనం!
బరుగుడు, తోడితెం"డన, రయంబునఁ గొందఱు వేగనేఁగి "భూ
వరులకు స్వాగతం"బనుచుఁ బల్కులఁ జేష్టలఁగల్కఁదీర్ప, న
న్నరపతి సంతసించుచు, వనంబున వారల వెంబడించినన్. 163

ఉ॥ కొందఱు పల్కరింప, మఱికొంద ఱిదే సుఖమాస నంబనం
గొందఱు సేదఁదీర్చుకొనఁ గొమ్ము జలమ్ము పవిత్రమంచనం
గొందఱు "మాయతీంద్రు లిటకుం దమరాకకు సంతసింతురం"
చందఱుమూఁగ నాతఁడరుదంది వినీతప్రశాంతచిత్తుఁడై. 164

ఉ॥ అందలి చిత్తవృత్తులును, నందలి సత్త్వశరణ్య మైత్రియున్
అందలి సుప్రసన్నతయు, నందలి నిర్విషయాను రాగముల్
క్రిందుకొనంగ డెందమునఁగాంచి యరణ్యపుటాశ్రమంబు, నా
నందము సందడింపఁ, దగునా! పురవాసమటంచు నెంచుచున్. 165

ఉ॥ హీనవిచారుఁడై వటమహీరుహ మూలపు వేదికాస్థలిం
ధ్యాన సమాధినిష్ఠుఁ, బరతంత్రిత బౌద్ధమునీంద్రుఁ డొప్ప, న
మ్మానివిశుద్ధ తేజ మసమాన ప్రశాంతత దేజరిల్ల, నా
జ్ఞానిముఖాంబుజంబె మననం బొనరించుచుఁ జూచుచుండఁగన్. 166

చ॥ శ్రమణకమాని కందెఱచి సంగతిఁ గన్గొని చింతసేసి, "యీ
క్రమము పరంపరాగతము, రాజులు భోగపరాయణుల్గదా,
విమతములయ్యె నిత్యమటవీస్థలిఁ బెర్గు మృగవ్రజంబు లీ
మమతలు మాయునెట్లు? తరమా! విధిదాటుకొనంగ నేరికిన్." 167

మ॥ అని చింతించుచు శాక్యసింహుని వచో వ్యాపారధౌరేయ స
జ్జనతాసాంద్రమృదు ప్రబోధముల భూజానిం బ్రబోధించి, స
త్య నయశ్రీలకుఁ దావలంబగు నితాంతజ్ఞాన దీప ప్రకా
శనముంగల్గఁగఁ జేయువాఁడగుచు నిశ్శ్వాసించి తానిట్లనెన్. 168

ఉ॥ "గ్రీకులఁ బాఱఁద్రోలి పరికీర్తిత భారతజాతి పౌరుషం
బేకముసేసి, యేలి ధరణీశులు మెచ్చఁగఁ, జంద్రగుప్తుఁ డ
ట్లాఁకలుతీర్పఁ, జంత లరయంగను శూన్యముగా, మహీస్థలిన్
సాకెడు సార్వభౌములకు సంతత సౌఖ్యమె, సేమమేయిలన్? 169

ఉ॥ సాధులవేఁటలాడు సరసాత్ములు రాజులు, చింతదీఱ, ని
ర్బాధముగా నరణ్యములఁ బచ్చికమేయు మృగంబులే యిటుల్
బాధల పాలుగాఁ, బ్రజకుబంధువులై తమ జ్ఞానదీపముం
బోధలఁజూపు సాధులకుఁ బుట్టగతు ల్భువినుండునే యిఁకన్. 170

ఉ॥ తిట్టెనె నిన్ను, నెప్పగిది దెప్పఁగఁ జూచెనె, నిన్నెదిర్చెనే,
కట్టిఁడి కార్యముల్నెఱపఁ గైకొని శత్రుపథంబుఁ ద్రొక్కెనే,
పట్టి ప్రజాప్రభుత్వ విభవంబునకై ప్రజరెచ్చఁగొట్టెనే,
యిట్టి విశుద్ధసాధు మృగ మేగతి నీకు విరోధియయ్యెనో? 171

చ॥ తలచెనె హింసనేరికి, నెదం దలపోసెనె కార్యఘాతముం,
దలకొనెనే దురాశలు, మనంబునఁగోరెనె యన్యవిత్తముల్,
పలువతనంబునం బ్రజకు వంచనఁగోరెనె, యేమిసేసె నీ
విలఁబడనేయ? సాధు విదియేగతినుండెనొ చూడు పార్థివా! 172

ఉ॥ పెద్దలయందు గౌరవము, పేదలయందు దయారసంబు, దు
ర్బుద్ధులయం దుపేక్ష, సమబుద్ధిఁ బ్రజావళిఁ గల్గువాఁడునై
యుద్ధురభారముల్తొఱఁగి, యుర్విని సజ్జన దుర్జనావళిం
బుద్ధినెఱుంగువాఁడె గద! పూజ్యతముండగు రాజెఱుంగవే? 173

ఉ॥ మోదముఁగూల్చి రోగగణముల్వడిఁ బీలిచిపిప్పిసేయ, దు
ర్వాదములుప్పతిల్లి తమ వారల నిచ్చలు కీడుచెంద, స
త్యాదర హీనులై ప్రజలు హాయిఁగనం దెరువేది యుండఁగా
సాదుమెకంపువేఁట సరసంపువినోదమె పృథ్వి జేనికిన్. 174

సీ॥ అష్టాంగముల మార్గమరసిన నేగాని
దుఃఖోపశాంతికిఁ ద్రోవఁగనఁడు,
శీలపరామర్శ చేసిన నేగాని
చేరఁడు యానందసీమనరుఁడు,
అపరాధములజోలి నడఁగించిన నెకాని
శాంతిసౌభాగ్యంపుఁ గాంతిఁగనఁడు,
జీవకారుణ్యంబుఁ జేపట్టిన నెకాని
పురుషార్థసంసిద్ధి పొందఁగనఁడు,
గీ॥ ఏది యుచితమొ పుడమికి నేదికాదొ,
యరయునందాఁక బురుషున కంధకూప
పతనమేకాని సౌఖ్యంబు ప్రబలదెపుడు
రాజునకు నేని వైదిక రాజి కేని." 175

చ॥ మునిపతి కొంత సేపిటు లమోఘమృదు ప్రియవాక్య బీజముల్
గొనకొని భావిభాగ్యమునకుం దగునట్టులఁ నాటునంత సే
పును దలవంచి, పెక్కుతలఁపుల్మది నెక్కొన, గొప్పతప్పు సే
సిన మనుజుండుపోలె నిరసించుచు నాత్మను, బల్కె నిట్టులన్. 176

ఉ॥ "పండినపైరు మేయు మృగపంక్తులఁగూల్చుట, యాలమందలన్
ఖండనసేయు ఘాతుకమృగంబులఁ గూల్చుట, రాజధర్మమై
యుండదె, వేఁటరాజులకు నుర్వి వినోదముగాదె, చూడ నా
దండను తప్పులేదని మొదందలపోయుట తప్పె మాన్యుఁడా?" 177

చ॥ అనుటయు రాజుపల్కులకు నల్కయుఁ జుల్కఁదనంబుతోఁప, ని
ట్లనియెను మౌని "రాజతనయా! యిదితప్పిదిగాదటంచు నే
మని వచియింపనౌను, మృగహంతకుఁడే జనహంతకుండుగాఁ
డనిమొడిదేమి? చూడ ఫలమారయ హింసకు నొక్కటేగదా! 178

ఉ॥ హింసయొనర్చువాఁడు తనహింసకె బాటలు వేయుచుండు, నా
కంసుఁడె సాక్షి, బుద్ధిపరికల్పిత దోషముగాదె హింస, నీ
యంసతలంబుమోయుబరువారయ దొడ్డది, నీవెఱుంగ, నీ
సంశయముల్తొఱంగి జనసంఘముఁగావుము సంతసింపఁగన్." 179

చ॥ అది విని రాజచంద్రుఁ డనఘాత్ముఁ డశోకుఁడు పల్కెనిట్లు, "నా
మది కొఱతీఱె సర్వజనమాన్యుఁడ! నన్ను క్షమించుమిప్డు, నేఁ
డిది మొదలింక వేఁటకయి యెన్నఁడు బుద్ధిమరల్పఁ బోవ"నం
చదియగు; నుత్తమ ప్రకృతి హత్తి కొనున్సుఖబోధ మెయ్యెడన్. 180

గీ॥ చిత్రమిది రాజచంద్రుని చిత్తమపుడు
మునిసుబోధము ఛాయయై ముందునిలువ
సరసముగ దాని గ్రహియించు జంత్రమయ్యె,
యోగమునఁదేలు వస్తుసంయోగమహిమ. 181

గీ॥ నిమిస నిముసంబునకుఁ బెక్కు భ్రమలు గలుగ
వనధితరఁగలలోఁజిక్కు పడవయట్లు
చిత్తమొకరీతి నిలువక తత్తఱిల్ల
రాజువీడ్కొని పటకుటీరంబుఁజేరె. 182

గీ॥ చేరి పరివారమునుగాంచి, సేదదీఱ
వలదు నను లేపకుండని వారిననిపి,
రకరకంపు విచారతరంగములను
నూఁగుచునుదూఁగె రాజేంద్రుఁ డుబుసుపోక. 183

గీ॥ మఱుదినంబున నుదయాన మంత్రులరిగి
వేట తమకంబుపై కొను వేడ్కఁ దెలుపఁ,
జాలునిఁక వేఁట, నగరికిఁ జనుఁడనంగ
నూరు జేరెను బరిజనవారమెల్ల. 184

చ॥ పడి పడి లేచిలేచి బహుభంగులఁ బొంగు విచారభంగముల్
సుడిగొన, నందుఁ జిక్కుకొనుచుం దరిఁగానకకూలు చిత్తముం
దడయక చిక్కఁబట్టి, తన ధైర్యము తీరముదారిఁ జూపఁగా
నుడుకుదొలంగి నెమ్మదిగనుండె నశోకుఁడు నిర్విచారుఁడై. 185

ఉ॥ చిన్నతనంబునం గురువుచెప్పెడి నీతులు త్రోసిపుచ్చి, నే
నెన్నఁటికేని నిప్పుడమియెల్ల జయింపఁగఁ జాలుమార్గముం
దిన్నగబోధ సేయు మనుదిట్టఁ డశోకున కేమిజాలి, యీ
మన్నన లెంతమాత్ర మనుమానము తీఱెడుదాఁక నమ్మఁడే. 186

ఉ॥ కాలమె నిర్ణయించుఁ, బలుకంగనె చెల్లదు కార్యరూపమై
క్రాలెడు నంతదాఁక, బలరాముఁడొ, రాముఁడొ, రావణుండొ, యీ
నేలకు నేలికల్ తెలియ నిశ్చయమెయ్యది, కార్యమాఁగదా,
శీలమె చిత్తశుద్ధి పరిశీలన సేయుట కద్దమయ్యెడిన్. 187

ఉ॥ పౌరుల చిత్తనిర్ణయము భావనసేయుచుఁ బాలనంబు ని
ర్ధారితపద్ధతిం జరుపురాజులె భూసురరాజ పూజ్యుల
వ్వారలె నుత్యకీర్తి ప్రసవంపుఁ బరీమళవాసితాశులౌ
ధీరులు, కానిచో సురనదీతట ప్రాంతములంటు ధీవరుల్. 188

ఉ॥ అంతట వేఁటమాని కరుణాకరుఁడౌచు నశోకుఁ డేలుచున్
సంతతపౌరుషోన్నతి మనంబుననాటిన వాఁడుగాన న
త్యంత ప్రభూత సైనికసహాయుడు దక్షిణ దిగ్జయంబు నా
క్రాంతిఁగొనంగఁజూచె బొసఁగందగు హేతువుచేతఁ జిక్కినన్. 189

అశోక రాజ్యము - ప్రథమాశ్వాసము

సంపూర్ణము

గద్య- ఇది శ్రీభారద్వాజ గోత్రపవిత్రాపస్తంబసూత్ర రాఘవా
చార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధ
కవితావిస్ఫురణ, సాహిత్య శిరోమణి, ఉభయభాషా
ప్రవీణ, కవిరాజ బిరుదాంచిత, కాండూరు నరసింహా
చార్య ప్రణీతంబైన యశోకరాజ్యంబను
చారిత్రిక ప్రబంధంబునందుఁ బ్రథ
మాశ్వాసము సంపూర్ణము.



॥ శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః ॥

# అశోకరాజ్యము.

## చారిత్రక ప్రబంధము.

### ద్వితీయాశ్వాసము.

### కళింగదేశ వర్ణనము.

ఉ॥ సంగతసంపదుజ్జ్వలము, సారతరంబును బైరుపచ్చలన్
రంగుగ హైందవావనిఁ బురాతన దేశములందు నొక్కటై
పొంగెఁ గళింగదేశమది పూర్వమనార్య సమాశ్రితంబు, స
న్మంగళధామ మాపిదపమాన్యులు కొల్వఁగనార్య పుంగవుల్. 1

మ॥ మనుజశ్రేయముఁ గూర్చు భారతము, శ్రీమంతంబు రామాయణం
బు, నుతింపంబడు కాళిదాసకృతమై పొల్పొందుచున్నట్టి య
య్యనఘంబౌ రఘువంశకావ్యమును, నుత్యంబు లుపురాణంబులున్
మును పేర్కొన్న కళింగదేశమది సంపూజ్యంబు గాకుండునే. 2

మ॥ త్రికళింగంబను పేరుతోఁ బరఁగె నాదేశంబు మున్ముందు, భా
వుక గంగాతటముందొడంగి యతుల ప్రోల్లాసి గోదావరీ
ప్రకటప్రాంతముదాఁక వ్యాప్తమగుచుం భాస్వత్ప్రదేశమ్ములన్
సకలాశా వితతంబులై నెగడు బల్సాంద్రాటవుల్ శోభిలన్. 3

సీ॥ గంగాతరంగిణీ కపిశానదీమధ్య
నుత్తరంపుఁ గళింగ మొప్పుచుండుఁ,
కపిశనుండి మహేంద్రగైరిక ప్రాంతంబు
మధ్యమంపుఁ గళింగమహితభూమి,
అల మహేంద్రగిరీంద్రుఁ డాదిగ గౌతమీ
తటముదాఁకఁ గళింగధరణియగును

పరఁగుఁగళింగ ముత్తర రాజధానియై
రాజపురము మధ్యరాజధాని

గీ॥ దంతపురి రాజధానియా దక్షిణోర్వి,
దానిఁ బాలించువాఁడయి తనరుచుండె
నింద్రవర్మాఖ్యుఁడౌ రాజచంద్రుఁ డతఁడు
ప్రథిత త్రికళింగపతి యనం బరఁగువాఁడు. 4

క॥ ఇప్పటి గంజాంమండల
మప్పటి మహేంద్రపర్వతావృతమయి సొం
పొప్పఁ గళింగము నాఁజను
జొప్పడఁ దనరూపురేక సొగసులకిరవై. 5

సీ॥ కమనీయకల్హార కాంతమహానది
యుత్తరసీమయై యొప్పుచుండ
రమణీయకానన రమ్యగోదావరి
దక్షిణసీమయై తనరుచుండ,
ప్రథితపాథోనిధి బంగాళఖాతంబు
తూర్పుతీరపుసీమ తొంగలింప
నిరతిశయాహ్లాద నిలయంబులౌ తూర్పు
కనుమలు పడమట ఘనతమించ

గీ॥ వీనినడుమను గరిమను వెలయుభూమి
ప్రథితకాళింగమైమును బ్రబలియుండ
నచటివారలె కాళింగులైరి, నేఁడు
రూపుకలవయ్యె, బేరు వేరూని నిలువ 6

ఉ॥ అందు వహించుచుండఁగ మహానది, శాబరియుఙ్, సువర్ణయుం,
గ్రిందుగ వంశధారయును, బ్రాహ్మణి, లాంగని, శారద ల్మహా

నందముఁగూర్చు నింద్రవతి నాఁగ ననేక మహానదుల్సదా
డెందము పొంగకుండునె వడిం దమపొంగులు చెంగలించఁగన్. 7

చ॥ మలయమహేంద్ర శృంగములు, మాన్యము ఖండగిరీంద్ర శృంగముం
బొలుచుచునుండ నింగి కెగఁ బొంగుచు వేల్పుల నాట్యశాలలై
వెలుఁగఁగఁ, బాపి, సూది పృథివీధరరాజులు పాలకొండ పెం
పలరుచునుండు నింపొసఁగునందము చందము చిందులాడఁగన్. 8

చ॥ అడవులు దట్టమైపరఁగ నారు బయళ్లును పిక్కలొప్పఁ, బె
న్మడుగులఁ, దోఁపుదోడ్ల, నసమానశుభంకర భాగ్యవైభవం
బడరు కళింగభూమి యరుదందఁగలోక మెసంగుచుండెఁ, బెం
పడరు కుటుంబినీగతి శుభావహధూర్వహ కార్యశోభలన్. 9

ఉ॥ మంగోలు ద్రావిడప్రజ లమంగళమూర్తు లనార్యులాభువిన్
సంగత సచ్చరిత్రులటు సల్పఁగఁగాపుర మార్య నింద్యకా
ళింగమనంగ నొప్పి, యటులే యొకకొన్నితరంబులేగఁ దా
నిం; గయికోఁగ నార్యు లవనిం బరిపూజ్యకళింగమై తగెన్. 10

చ॥ మొదటఁ గళింగవాసిజనముల్కడువ్రాత్యు లనార్యు లందుచేఁ
బదములిడంగ నార్యులట బాపఖ్యలు, గాని క్రమక్రమంబునం
గుదురుకొనంగ వారచట, ఘోరబహిష్కరణంపు వాదముల్
తుదిఁగొనఁ, బుణ్యభూమియన రూఢికి నెక్కెను లోకమంతటన్. 11

సీ॥ జాతిమతఖ్యాతి జాటించి పాటించు
పూరిజగన్నాథ పుణ్యభూమి,
తాపత్రయాభీల దావాగ్ను లడఁగించు
భువనేశ్వరావాస పుణ్యనగరు,
జీవకారుణ్య సంజీవనౌషధులిచ్చు
బౌద్ధాలయములకుఁ బట్టుఁగొమ్మ,

సత్యశౌచనిరూఢ చతురద్విజావళి
కాలవాలము సాదుపూలవనము

గీ॥ వేదవేదాంగ విదులగు విప్రవరులు
సత్యమార్గ ప్రబోధ నిస్వార్థపరులు
ఋషులు సన్యాసు లలరుచు నిరవుకొనఁగ
లీలలను దేలియాడెఁ గళింగమపుడు 12

ఉ॥ ముప్పదిరెండు భాగముల మూలల మూలల రాజు లేలిరం
చప్పటి శాసనంబు లరయం బ్రకటించు, నశోకు కాలమం
దొప్పఁ గళింగము, న్మహిమ, ముచ్చ్రమహేంద్రము సన్నభాగముల్
తప్పెను నుత్కళింగమది తత్పతివేఱుగఁ జేయుటాదిగన్. 13

ఉ॥ దంతపురంబు, కుంభవతి, తార్కొనుతోసలి, ఔగడంబు, న
త్యంత ప్రసిద్ధ పట్టణములయ్యె నశోకుని కాలమందు, వా
నంతటివై కళింగమున నచ్చుగఁ బిష్టపురంబు, వేఁగియుం,
బొంతకళింగముం, గురళ, పాల్చెను కుస్థల దేవ రాష్ట్రముల్. 14

చ॥ తలఁపఁ గళింగమల్లునకు దంతపురంబది రాజధానియై
వెలసె నశోకు నాఁటికిది విశ్వసనీయము, నేఁడు దిబ్బయై
తలరెడు నాచికాకొళము దాఁపున స్టేషనుచెంత, గాంగ రా
జులు తరలింపఁగాఁ గటకు చోటికి, రూపఱి పాడుపడ్డదై. 15

ఉ॥ పాలి కళింగ భాష, వృషభాంకులు రాజు లనేకులై ధరా
పాలనసేయుచుండ, నరపాలవరుండు మహేంద్రవర్మ యా
నేల మహానదీ ఝురపునీతము తోసలినేలుచుండె, నా
భీలకళింగమల్లపృథివీశుఁడు దంతపురంబు నేలఁగన్. 16

ఉ॥ బాహుబలాఢ్యు లత్యధికపౌరుషశాలులు, యుద్ధకౌశలో
త్సాహులు, కార్యతత్పరులు, సాహససాధిత భండనుల్ప్రచం

డాహవకాంక్షులెల్లపు దహార్యపరివృతదుర్గరక్షణో
ద్బాహులు, శక్యమే పొగడ, ధారుణినేలు గళింగ భూపతుల్. 17

చ॥ ప్రజ లటస్వామిభక్తియలరం గడు విశ్వసనీయచిత్తులై
విజయములందు నేర్పుఁ బటువీర్యము, ధైర్యము, శౌర్యమొప్ప, సా
మజములయట్లు పోరుతరుమన్వెనుకంజ యెఱుంగనట్టి బల్
భుజబలవంతులు న్నెదురుమోములు గల్గియు న్యాయవీక్షణుల్. 18

సీ॥ దూరదేశమ్ములఁ దోరమ్ముగా సాగి
భాగ్యవంతులఁజేయు వర్తకమ్ము
ముక్కాఱుపైరుల మొక్కవోవని పొల
మ్ముల నిండువ్యవసాయముల పసందు
సున్నితమౌచుఁ బ్రసన్నత నిగనిగ
ల్పచరించు వస్త్రాలపడుగు నేఁత,
ఫలవంతమగు తీర్పు, బలవంతమగు కూర్పు
ధనవంతమగు నోర్పు తనరు జనులు,

గీ॥ గలిగి వర్ధిల్లు నక్కళింగావనీ పు
రాతనపు వైభవంపు విలాసములను
దలఁచుకొన్నంత మాత్రనఁ దనువువణఁకి
పులకల నెపానఁ గోర్కులు మొలవకున్నె. 19

సీ॥ చీనా జపానులు సింహళంబును లంక
వలసల కిరవౌచు వరలుచుండ,
నడిసముద్రపుఁ బ్రయాణముల నేర్పులు మించి
తూర్పుదీవులతోడి కూర్పు నెఱప,
ఓడలు పడవలు నోలిగాలికిఁ దేలి
పయనంబులకుఁ జాల నయము లొసఁగ,

తూర్పుదీవులయందు, దూరదేశములందు
విరివియై వర్తకం బరుదు గొలుప

గీ॥ వజ్రవైడూర్యములు నూలువడుకు బట్ట
లాణిముత్యాలు, పగడాలు, నరుస మొసఁగు
పరిమళద్రవ్యములు, మంచి పరికరములు
బియ్యములు సాధనంబయ్యె బేరములకు 20

ఉ॥ తూరుపుతీరమందపుడు తోరపుదూరపు దారిమీఁదుగా
బేరముసాగెలంకకని విందుము, మున్ను కళింగదేశపుం
బౌరులు నేర్పరు ల్జలధిపైనను, బ్రాంతములం జరింపఁగా,
వారికిఁ జింతవింత, బలవంతులు సుంతయు వంత నెంతురే. 21

సీ॥ లలితచిత్రకళా విలాసమ్ము లెలయించి
పొంగి చెలంగిన పుణ్యభూమి,
సంగీతసాహిత్య శాస్త్రమ్ములను బెంచు
పాఠశాలను మించు ప్రౌఢభూమి,
నాట్యంబు శిల్పంబు నయమగు నాలేఖ్య
మడరి దిశల్ప్రాఁకు నతులభూమి,
వేదాంతమతవిద్య, విశ్రుత బౌద్ధంబు
పేరుమోసిన యట్టి సారభూమి,

గీ॥ రమణ శృంగారవనముల రంగభూమి,
బహుకళాకోవిదుల కుక్కిపట్టు భూమి,
దేశదేశాలఁ బ్రథితమౌ దివ్యభూమి,
లీలలను మించెనపుడు కళింగభూమి. 22

ఉ॥ రాజులు మేడలందు వసురాజి విరాజిత భాగ్యశాలుల
య్యోజనె యొప్పుచుండ, సుఖయోగ విహీనులు పేదవారు ని

స్తేజములైన కొట్టములఁ జెంతలఁ గాపురములిరించువా,
రీ జగమందుఁ బేదలకు నెంత నదృష్టమదృష్టమే గదా. 23

ఉ॥ చుట్టును కందకాలు బురుజుల్గల కోటలు, వానిలోపలం
దిట్టములైన మేడలును, దీర్ఘగ నంతిపురం పుటింతు ల
ప్పట్టున నందచందములు పైకొన భావవిలాస వీచులం
బట్టియు ముంచినన్ నృపకుమారులు మోహరసాబ్ధి మున్గరే. 24

ఉ॥ భూసురకోటికూర్పు, పరిపూజ్యుల బౌద్ధుల నాదరింపు, ని
ర్వాసులఁ జెంతఁజేర్పు, సహవాసులనెల్ల సముద్ధరింపు, దు
ర్దోషులఁ జీకటింటనిడి దుర్గుణముల్తొలఁగించు శైలిదు, ల
భ్యాసము లాకళింగ నరపాలుర కయ్యెను నప్డు పాలనన్. 25

మ॥ చతురంగంబు లుపాయము లనుపరసత్సన్నద్ధ సప్తాంగముల్
ధృతిషాడ్గుణ్యము, పొందికందమకు సంధింపం గళింగాధిపుల్
గతిఁగల్పించుచుఁ, బన్నుసుంకములనుం గైకొంచుఁ బాలింతు రా
య్యతనుంబైన విచారణం బ్రజకు నన్యాయంబులం బాపుచున్. 26

శా॥ అక్కాలంబునఁగూడ మూఢులకు దయ్యంబుల్పిశాచంబులున్
సుక్రిందేహము, చెట్టుచేమలును, యక్షుల్ రాక్షస వ్రాతముల్
మ్రొక్కుల్గొందు రీ మనోరథం బొసఁగుచున్మోక్షంబు సాధించుచు
న్నిక్కంబౌ నమలంపుజ్ఞాన మవని న్నేఁడైనఁ జేకూడునే. 27

చ॥ తొలుతటి రాజపుంగవులు, తోడియమాత్యులు, సత్ప్రజావళు
లకలిసి విధించువాఁడెయగు రాజు, తనంతట నుద్ధతుండుగాఁ,
దొలఁగఁగఁజేసి యింకొకనిఁదోడనె రాజునొనర్చు నగ్గత
ల్గలిగి చరించి, రప్పగిది కానిమెడం దలకిందులయ్యెడిన్. 28

చ॥ అనుమతిఁ బొందికాని నృపుఁడారయఁ డొక్కటిసేయఁదాను, స
జ్జనులను మంత్రులంగలిపి సార మసారము నిశ్చయించి, యా

వెనుకనె కార్యనిర్వహణ విజ్ఞత వెల్లడిసేయు, లేనిచో
ననువగు నెట్లు? విప్లవగుణంపు గణంబు లణంగి యుండునే? 29

చ॥ ఇటుల గళింగ భూరమణు లేలఁగ, నందుఁ గళింగమల్లుఁడన్
కుటిలుఁ డొకండు సంపదధికుండయి దంతపురంబు నేలుచుం
బటుతరవాహినీ విభవ వైభవముల్ తనరార ధూర్తుఁడై
దిటవుకొనన్ స్వతంత్రిత మదిఁదలపోయుచునుండె నత్తఱిన్. 30

చ॥ అరువదివేల కాల్బల మనాహత, మేనుఁగు లేడునూర్లు, స
త్తురగములత్యుదాత్తములు తోడుపడం బదివేలు, రాజ్యముం
దిరము స్వతంత్రము న్వసుమతిం బలవంతము సేయ నెంచి, త
త్పరుడయి దక్షిణాపథ నృపాలురకూటముఁ గూర్ప నెంచుచున్. 31

—♦ కళింగమల్లుఁడు దక్షిణారాజకూటమున నుపన్యసించుట. ♦—

చ॥ నెపమున నొక్కనాఁడు ధరణీశుల నెల్లరఁ జేర్చి యొక్కటం,
గపటముఁ గప్పిపుచ్చి, తనకంటె విధిజ్ఞుఁడు లేఁడనంగ, ని
ష్కపటియుఁబోలె "రాజకుల సంభవులార! స్వతంత్ర జీవికా
తపము ఫలింపకున్న మది తాపమడంగునె పృథ్విజేనికిన్. 32

చ॥ మనది కళింగభూమి, యభిమానము మానము పుట్టినిల్లు, స
ద్వినయవివేక విజ్ఞతలు వీడక యందఱమేకమైతిమే
ననయము రాజ్యలక్ష్మి మనయం దనుబాయక నిండియుండు, మీ
మనముల యోజసేయుఁడిది మాన్యమొ, హైన్యమొ గోచరించెడిన్.

ఉ॥ ఉత్తరమం దశోకుఁడు రణోత్సుకచిత్తుఁ డనంగ వింటి, మా
యత్తత నుండువాఁడనియు నాడుకొనంగను విందు, మాతనిం
జిత్తమునందు నిల్పుకొని చేరకయుంటిమి, దక్షిణాపథం
బుత్తది మీకు నాకు, సమరోద్ధతి మీఱక రిత్తవోవునే." 34

చ॥ అనుటయుఁ గొందఱౌననుచు నాడఁగఁ, గొందఱు చూతమంచన
న్మనకుఁ బరీక్షయానిది యనన్ మఱికొందఱు, నందఱుం గనుం

గొని "మన దక్షిణాపథము కూటము గాటమనంగఁ జాటుచే
మనవిధి' యంచుఁబల్కె నభిమానముతోడఁ గళింగమల్లుఁడుల్. 35

చ॥ అరయమహానదీ తటమునందలి తోసలినేలువాఁడు భూ
వరుఁడు మహేంద్రవర్మ "తనభావము నం దిదిమేలె యానుగా
కరయుదమం"చు నేఁగెఁ దనయాత్మవిచార విమర్శమగ్నుఁడై,
భరమగు రాజకీయములు పాటుకు వచ్చెడుదాఁక నేరికిన్. 36

గీ॥ ఇంద్రవర్మకుఁ బుత్రిక చంద్రవదన
నవనవోన్మేష యౌవన నాగవల్లి,
పుత్రసంతానహీనుఁడు పుడమిఱేఁడు
నాగవల్లి యెఱుంగక నడువలేఁడు. 37

—♦ కళింగమల్లుని దురాలోచనము ♦—

చ॥ అరుగఁగనిచ్చి యందఱను నక్కపటాత్మ కళింగభూవరుం
డరుదుగ యోజచేసి, యెటులైనను రాజ్యము విస్తరించినం
బరఁగు స్వతంత్రతాధిక శుభంబు లటంచును నిశ్చయించి, మం
త్రియగు నాగవర్మ యరుదెంచఁగ లోపలి మందిరమ్మునన్. 38

చ॥ "ధరణి ఁగళింగరాజ సముదాయము లోపల దొడ్డవాఁడనై
వరలఁగ దారిలేదె, బలవంతుల పాలిదె భాగ్యలక్ష్మి? నే
నరయుదు నొక్కతీరు, మరియూదకు భంగముతీఱు మీఱు, మీఁ
దరయక యున్నఁబోరు, తనరారు స్వతంత్ర సమీరు లాస్యముల్.39

ఉ॥ తోసలిరాజు చిత్తమది తోఁచద యెట్టిదొ, నిందుకుండ, స
న్యాసివిధంబునం బరఁగుఁ, జక్కఁబడం డతఁ డిచ్చకంబులం,
బాసలు చెల్లవాతనికి, వాసిగ మోసమెఱుంగఁజాలఁ డా
యాసములేని మార్గమున నాతఁడు లోఁబడఁజింత తీఱెడిన్. 40

చ॥ అతనికిఁ బుత్రసంతతి యహంకృతి సున్న, నిరాశుఁ డాతఁ డే,
వితమున లోఁ గొనంగ, బృథివీతలమయ్యది చిక్కఁజేతికిం?

గతి యది యోజచేసి తగుకార్యవిధానము నిశ్చయింపఁగ
న్మతిఁ బరికింపఁగా వలయు, మాటలఁజొప్పడునే స్వతంత్రతల్. 41

ఉ॥ కయ్యముగాదు నామతము, గారడి కొంతయొనర్పు, నాతఁడు
న్వియ్యము నియ్యకొన్న ధరణీతల మంతియు నాదిగాదె, యీ
నెయ్యము భద్రమైపరఁగ, నేర్పరు లెవ్వరు వేల్రిలుపెట్టఁగం,
జయ్యన రాయబారివయి సంధియొనర్పుము మంత్రిసత్తమా! 42

గీ॥ ధారుణీపతి కూఁతు రందాలరాణి
కన్య, పూఁబోఁడి, కంజాక్షి, కనకవల్లి
నాగవల్లియ పెద్దది నాకు సతిగ
నొసఁగఁ బూనఁగును, గుసగుస లెసఁగకుండ." 43

చ॥ అనుటయు నాగవర్మ "యిదియా! తమయూహ, సమంజసంబె, యీ
మనుజవరుండు శాంతుఁ డభిమాని స్వతంత్రుఁడు, నాగవల్లియుం
జనపతిముద్దుకూన నెఱజాణ మనోహరమందయాన, యీ
పనియెటులౌను, వృద్ధనరపాలుని మెత్తురె ముగ్ధకామినుల్. 44

ఉ॥ ఇట్టిదె రాయబారమన? నెట్టులు గిట్టును? మోహనాంగి కే
నెట్టులు విన్నవింపనగు? నియ్యది యించునె యింద్రవర్మ? కీ
కట్టిఁడి భావమున్వదలి కార్యగతిందలపోయరాదొకో
పట్టి బలాత్కరించు బలవంతపుఁ బెండిలి చెల్లునే యనన్. 45

చ॥ "తెలిసెను నీమనంబిచటఁ దేలికయయ్యెను గార్యభారముం,
బలుకుల లాభమేమి? ప్రతిభా ప్రతిపత్తి కసాధ్యముండునే,
"పలుకు శుభమ్మునా, "నడుగుపట్టె" యనం జనుపల్కు పోలెడిన్
'తొలుత నవిఘ్నమస్తు' నఁగఁదోఁచదె రాజపురోహితాత్మకున్."46

—♦ నాగవర్మ యింద్రవర్మకడకు రాయబార మరుగుట. ♦—

చ॥ అని యవధీరణమ్ముగ తొలుకాడఁగఁ బల్కిన, నాగవర్మయుం
బనిగొని యింద్రవర్మ నరపాలుని చెంతకు నేఁగువాఁడునై

మనమునఁ జింతసేసె, "నడుమంత్రపు బుద్ధుల కొల్వు లీగతి
న్మెన మెరియించుచుండు, నభిమానికిఁ జెల్లదు కొల్వుసేయఁగన్." 47

చ॥ అటఁజనికాంచె నద్భుత మహానదితీరమునందు భాసిలన్
గటకచరత్కరేణు కరకంపిత సాలమహేంద్రశైల సో
ద్భట నికట ప్రదేశబలవత్ప్రహరీవృత సౌధజాల స
ద్భట నటనానుకూల పటువైభవ శోభితమైన తోసలిన్. 48

క॥ కాంచి తదీయోదంచ
త్కాంచనగోపుర ప్రహృష్టకౌతుక మతియై
ప్రాంచత్తోరణ గరిమ స
మంచితమగు ద్వారభూమి నడుగిడు నంతన్. 49

క॥ చారులు దెల్ప నుదార గ
భీరాకృతి భావపూర్ణ ప్రియవచన సుధా
సారాతర్పిత మతియగు
చా రాజసుధాకరుండు హర్షము పొదలన్. 50

## —♦ ఇంద్రవర్మ నాగవర్మల సంభాషణము. ♦—

ఉ॥ స్వాగతమిచ్చి కౌశలము సంబరమొప్పఁగఁ బృచ్ఛచేసి "మీ
యాగమనంపు హేతువరయన్మదిఁ బ్రేరణపొంగుఁగాని, య
య్యా! గమనంబుచే శ్రమలనందితిరం"చు మహేంద్రవర్మ యు
ద్యోగులఁబిల్చి యాతనికి నొప్పు సపర్యలఁగూర్ప నేర్పినన్. 51

చ॥ పరిజనకల్పితాదర సపర్యలఁ దృప్తిజనింపఁ, గొంత సే
పఱగొఱ విశ్రమించి తనయాగమనంపుఁ బ్రయోజనంబు తన్
ద్వరపడు మంచుమేల్కొలుపు తంతు పొసంగ మహేంద్రవర్మమం
దిరమున కేఁగె నాతఁడు మదిందలపోయుచుఁ గార్యపద్ధతిన్. 52

చ॥ ఇరువురు మేడపైకరిగి యెంతయు వేడుక సంతరింప, నె
వ్వరికిఁ బ్రవేశమీక శుభవార్తలఁ దేలుచునుండునంత, భూ

వరుఁడనె 'నాగవర్మ! నరపాలకళింగుని గొల్వు సేమమే,
పరువుగసాగునే సుపరిపాలన పౌరులు సంతసింపఁగన్." 53

చ॥ అనవుడు "రాజ్యమందొకఁడు నారయలోపములేదు మాకు, మా
జనపతి సచ్చరిత్రుఁడు లసత్ప్రతిభాన్వితుఁడైన ధీరుఁ డా
తనికిపుడొక్క-చింత, మన దక్షిణభారత భాగ్యభూమియం
దనయము నైకమత్యమున కాస్పదమెయ్యది"యంచు నిచ్చలున్. 54

ఉ॥ ఉత్తరభారతోర్వఁగల యుద్ధతుఁడైన యశోకరాజుకుం
దత్తఱమంది కుంచి వసుధావరులందఱు సార్వభౌమతం
గుత్తకుఁగట్టి యాతనినిఁ గొల్చుచునుందురు, దక్షిణోర్విపై
నెత్తెడువాఁడుగాఁ దెలియు, నీగతి నిఁగఁగనేది మార్గమో. 55

మ॥ మనలో నిట్టులె నైకమత్యమకటా! మాయమ్మగా, నింక నా
తని పాదమ్ముల నాశ్రయించి గొలువుం బాటించుటో, లేక, నె
మ్మనము లేనిరిచి నైకమత్యమమలం బ్రావీణ్యముం జూపి యా
తనికిం జిక్క-క మొక్కు-లీక మన స్వాతంత్ర్యంబుఁ జాటించుటో. 56

ఉ॥ వచ్చెడువాఁడు ధూర్తు, మనవారలదారులు వేఱువేఱ, యా
మచ్చరినొక్క-రై మనము మానక తాకిన నోర్వవచ్చు, లే
కిచ్చకునిచ్చ తోడ్పడక యెవ్వరిదారిని వారు పట్టుచో
వచ్చుఁ బరాయివానికడ పాదములంటెడు దుర్గతులున్నవియా" 57

చ॥ అనియిటు చింతసేసి తమయాత్మను గన్గొని రమ్మనంగ, నే
ననుమతిఁ బొందివచ్చితిని, 'నార్యుల కేది యభీష్టమో' యనం
జనపతి యింద్రవర్మ మనసారఁగఁ దెల్పెను "దక్షిణా పథం
బున నరపాలకూటమున ముందుగ నిల్చెదన"న్న సమ్మతిన్. 58

చ॥ అది విని నాగవర్మ మరియాదగనిట్లను "భూమిపాల! మీ
మది కడునొప్పుఁగాని, యొకమాటకుఁ జోటునొసంగఁ బ్రార్థనం,

బిడియొక హేతుబద్ధమయియేచినఁ బొంది పొసంగియుండు, మా
మది కొఱ్ఱదీఱు, మావిభునిమాటయకా గ్రహియింపఁగావలెన్. 59

ఉ॥ మీసుతనాగవల్లి కలిమిం బలిమిం దమి మించు మావిభున్
వాసిగఁ బెండ్లియాడ నిరువంగడము లుసుఖభాజనంబులౌ
మోసముసేయలేఁ డవలమూర్ఖుఁ డశోకుఁడు నిన్న నన్నుఁ నే
బాసటయౌదు నీకెపుడు, బాసయొనర్చెదనంచుఁ దెల్పెడిన్” 60

చ॥ అనవుడు నింద్రవర్మ “యిదియా! తన యూహ, కళింగమల్లుని
గని పరికించి యెవ్వరయినం గయికొందురె పెండ్లియాడ, నా
తని వయసెంత! యిట్లుడుగ ధర్మరహస్యమె, యుక్తమౌనె, పూ
చిన నవపుష్పమాలిక నశింపఁగ ద్రోయుటె బూది లోపలన్. 61

శా॥ నీవైనం బరికింపఁగా వలదె మంత్రీ! భావ్యమౌనెట్లు, సం
భావింపం బదునాఱువర్షముల భామం, గోమలాంగిం బటు
ప్రావీణ్యం గొని వృద్ధుచేత నిడుటే, బాగుండెఁ, జాల్చాలు, నీ
భావంబింతట మానుటొప్పుఁ, జనుమీ భాషింపఁగా నేటికిన్. 62

శా॥ ఆనాఁడాతని చిత్తవృత్తి యరయన్ హాస్యంబుగాఁ దోఁచఁగా
నేనేమన్న నసహ్యమంచు మదిలోనే నిల్పియూఁ కొట్టఁ, దా
నీనాఁ డింతటివాఁడ నైతినని భావింపంగ యుక్తంబె, నా
కేనాఁడెయ్యది యుక్తమౌ నదియపో, యీజోలి నాకేటికిన్. 63

చ॥ వెలయఁగ ముద్దుబిడ్డలను వృద్ధపిశాచుల కంటఁగట్టి, య
వ్వెలఁదుల భాగ్యముల్త్రొలఁగ వెట్టి మొగంబులు తేలవైచి, చిం
తిలఁగ విధాతవ్రాసెనె? యిదే తలిదండ్రుల త్యాగదీక్ష? నా
ఫలమెటులున్న నట్లగును, భావ్యము గాదిది పల్కనేటికిన్. 64

ఉ॥ బాసటయౌట కుం బసుచు భామలనిత్తురె వృద్ధరాజులన్,
గాసటబీసటే చదివి కన్ను నెఱుంగక తిర్గువార లీ

దోసమెఱుంగఁజాలుదురె? దుర్జనపద్ధతి, చాలుపొమ్మ్మ, నా
యాసము నామనంబిపు డహా! భవితవ్యము భావ్యమయ్యెడిన్. 65

ఉ॥ నామతమింతె దక్షిణమునం గలరాజ సమాజమందు నా
భూమికయొక్కఁడై నిలుచుఁ, బోరుపొసంగిన జాఱిపోదు, నా
సీమము నిశ్చితంబు, తగునే యిటుకన్నెల బేరమాడఁ, గా
నీ మరియాదమై మెలఁగ నిల్చెద నిశ్చల నిర్ణయంబునన్." 66

చ॥ అనఁగనె నాగవర్మ "ప్రభువా! సమయానుగతమ్మ కార్య, మీ
సునఁ బరతెంచువాఁడగు నశోకున కాహుతి మున్నె తోసలీ
శుని ధరయంచు మాప్రభువు చూచెడు నంతియు, నాగవల్లి మీ
తనయ వరించఁగా శుభముతాఁగొనుచుండ వయస్సు చూచుటే. 67

ఉ॥ ఉన్నది విన్నవించితిని, నొప్పులొ తప్పులొ సమ్మతించి, మీ
యన్నల మిన్ననిచ్చి కరుణాకరుఁడైన కళింగమల్లు స
త్సన్నుతుఁ జెంతఁ జేర్పఁ, గలదా యొకచింత, కళింగరాజ్య మ
త్యున్నతిఁ బొందకున్నె విబుధోత్తములెన్నఁగ మిన్నుమన్నులన్"68

చ॥ అను వినయంపుమాటల నయం బనయంబయి కంటగింప, నా
జనపతి యింద్రవర్మ "విరసంబగుపల్కు లవేలమాటికిం,
దనయలనిచ్చిరే తనకు దక్షిణభారతభూమి రాజులె
ల్లను, విపరీతమార్గమిది రాజగుణంబిల నిట్టి దయ్యెనే. 69

ఉ॥ ఇచ్చలఁ దేలువా రవని నింతులు, వారి మనోరథమ్మల
నెచ్చక కుచ్చితుండగుచు మేదిని నొక్కని కంటఁగట్ట, నా
యిచ్చినవాఁడు మూర్ఖుఁడగు, హెచ్చుగఁ గాపురముం దరింప దే
మిచ్చిన నెంతవాఁడయిన నిచ్చకముల్పచరింపఁ బండునే. 70

ఉ॥ చాలువివాదమింక సరసంబు లవే విరసంబులైన మా
పాలిటి భాగ్యమంచుఁ బరిపాటిఁ దలంతుము, కుందనేల, మీ

యేలిక నేలనేలికొన నేల తలంపఁడు సాధుమార్గ; మీఁ
జాలను నీలతొంగి మనసారఁగ, నా పయి దైవముండెడిన్. 71

చ॥ అని తెగఁబల్కి యూరకొనునంతఁ గళింగునిరాయబారి "నె
మ్మనమున యోజచేసికనుమా! తగదిప్పుడు తొందఱంపడం,
జనవిది శాశ్వతంబగును, జాలు స్వతంత్రత నిల్పుకోఁగ నం
చును సెలవందియేఁగె, మనసుం బిరుసు న్నిరసించు వాఁడునై. 72

—♦ గ్రీష్మ ఋతు వర్ణనము. ♦—

సీ॥ పాపకర్మల బర్వు భరియింపఁజాలక
యుర్వి తావిడుచు నిట్టూర్పులనఁగ,
దుర్వారదుర్భర దుస్తంత్రములఁ బన్ను
శత్రుపన్నగ విషజ్వాలలనఁగ
ధర్మగతుల్బాయు ధార్మికబుద్ధులపైఁ
గుపితుఁడౌ దినకరు కోపమనఁగ,
గతిలేని నరుల దుర్గతుల పాలొనరింప
నావరించెడు బడబాగ్నులనఁగ,

గీ॥ నాలుకలు సాచి జంతువుల్నాల్గు దిశలఁ
బరుగువాఱుచు నీటికై పరితపింపఁ
గ్రిందుమీఁదుల మాడ్చెడు గ్రీష్మఋతువు
నెండగాడ్పులు దిశలందు మెండుకొనియె. 73

గీ॥ తాపముల మేఁతమాని యుత్తాలవృక్ష
జాలముల నీడలఁ బరుండి డీలుపడుచు
నెమరువేయుచు నెగరొప్పు నీరువట్టు
గలిగి జంతువు లెండమావులకుఁ బాఱు. 74

క॥ సురగాళులు చెలరేఁగుచు
గిరగిర వడిఁదిరిగి తిరిగి గిమ్మనఁగా స

త్వరలై తల్లులు బిడ్డల
బిరబిరఁ జనిమొత్తుకొందు రీతుతొలంగన్. 75

చ॥ గనగన వేఁచుట న్విసనకఱ్ఱలు, చెంబులు చేతులందుఁ బా
యని వగుచుండఁ, జిత్తములహా! యని శీతలమారుతమ్ములం
దనుపఁగ వేఁడుచుండ, వసుధాస్థలి యగ్నిపరీతమానటు
ల్వనములు మండ, గ్రీష్మఋతు బాధలు నల్గడఁ దాండవించెడున్. 76

ఉ॥ కోరిజలమ్ములఁ ద్రావ, వడిఁగుండె చెమర్పు విధానఁ గాఱి పో
నాఱఁగ గొంతువెంబడిన, యంతటమాటికి నాల్కఁ దడ్పుచున్
దూఱుచు, నెండతాపములతో నిరసించుచు నంగవస్త్రముల్,
మాఱుమొగంబులై చెదరు, మండెడు వేసవి మానవుల్ధరన్. 77

చ॥ ధనపతులైనఁ జల్లని లతాగృహరాజములందొ, మేడలం
దనువగు చంద్రికా రుచిర హారిమణీమయపాళులందొ, త
త్తనువులు వాడకుండ సమధాతువులై వసియింతురిగాని, ని
ర్ధనులగు వారి దుర్గతులు దైవమెఱింగెడు మండువేసవిన్. 78

—♦ ఇంద్రవర్మ విచారము. ♦—

ఉ॥ అత్తఱి నాగవర్మ చనినప్పటినుండి మహేంద్రవర్మ భూ
షోత్తముఁ డుత్తలంబడరు నుత్కటభావ పరీతచిత్తుఁడై
తత్తఱపాటుపై కొనఁగఁ దాలిమిలేకొకచోటనిల్వ ను
న్మత్తగజేంద్రమ ట్లుపవనంబున కేఁగెను విశ్రమింపఁగన్. 79

ఉ॥ ఏఁగి నికుంజపుంజమున నింపగు వేదికపైనఁ దా నిరు
ద్యోగినరుండుపోలెఁ గడుఁదోరపుభార విచారమగ్నుఁడై
క్రాఁగుచు భ్రూకుటీకుటిల గ్రంథి నిమీలిత లోలితాక్షుఁడై
యూఁగుచు ముందువెన్కలకు, యోగితెఱంగుననుండె నొంటిమై. 80

చ॥ పిలిచినయట్టు లెవ్వరో వినం దనవీనులు నిక్కఁబెట్టుఁ, జేఁ
గలఁచిన యట్లు గర్భమునఁ గన్నులుమూసి మొగమ్మునుల్చు, సం

చలనము దేది కల్గినను సంశయమేచఁగ లేచినిల్చుఁ, జా
పలమున నిందవ్రిర్మకు నుపాయము తోఁచక యుమ్మలించఁగన్.81

—♦ నాగవల్లితో రాణియుద్యానమునఁ బ్రవేశించుట. ♦—

చ॥ తపనుఁడు పశ్చిమాశకు యథావిధినేఁగుచు వ్రాలుచుండఁ, ద
త్తపనకర ప్రతప్తల విధంబున రాణియు నాగవల్లియున్
సఫలతరుప్రతాన విలసత్కమనీయలతాంత శోభితం
బుపవనమేఁగి రత్నతతి సముజ్జ్వలభూషణ భూషితాత్మలై. 82

సీ॥ ఒకవంకనకలంక శుకపిక నినదంబు
లొకవంక శారికా ప్రకటరుతము,
లొకచోటఁ దరుకూటనికటనృత్యద్బర్హి
లొకచోట హంసల యొప్పుగతులు,
నొకనేల మృగబాల నికరచంక్రమణమ్ము
లొకనేలనుయ్యాల లూఁగుపొదలు,
నొకభూమి నడబావి వికచరాజీవమ్ము
లొకభూమిఁ గృతకాద్రి ప్రకృతియొప్పు,

గీ॥ లిట్టు లసమానసౌందర్యముట్టిపడఁగ
నొప్పునుద్యాన శోభలమెప్పుఁ గనుచు
మూలమూలలఁ దిరుగుచుఁ జాలతడవు
లీలలను ముచ్చి మాటలఁ దేలుచుండి 83

ఉ॥ దారులతీర్పు, తీఁగలకు ద్వారపుఁగూర్పు, విశిష్టశోభ నా
కారపుటందగింపుఁగని యచ్చెరువందుచు, దిర్గితిర్గి, సిం
దూరపుమంజిమ లొప్పెసఁగు తోరపు దీపగృహమ్ముచేరి, మం
దారపు వేదికంగని రుదారవిచారుని జేని నచ్చుటన్. 84

చ॥ కనిముదమంది భూపతిముఖంబున భావవికాస రేఖలం
గనక, యిదే మివింతయని కాంతుని చెంతను గూరుచుండి, "మీ

తనువున వంతచింతగలదా? నెపమెయ్యది? నాకుఁ దెల్పరా!"
యని వినయంబు తోఁపఁగ నయంబున రాణి బలాత్కరింపఁగన్. 85

ఉ॥ అంతట నాగవల్లిచని యంతికమందు మహానదీతట
ప్రాంతమునందు నెచ్చెలుల భాషణబద్ధప్రియానులాపమై
పంతములాడఁగం దన కుపాంతమునందు వినంగవచ్చె సా
యంతన మారుతాహతికి నజ్జనపాలు వచించు భావముల్. 86

—♦ ఇంద్రవర్మ తనభార్యకుఁ గళింగుని రాయబారముఁ దెల్పుట. ♦—

ఉ॥ "వింటె కళింగమల్లపృథివీశుని దంటతనంబు, నిప్పుడా
తుంటరి నాగవల్లిని మదోద్ధతిఁ బెండిలియాడఁగోరు, నే
మంట! యిదేమి వింట చనుమంటిఁ దిరస్కృతిరాయబారి, నా
వెంట నతండువత్కెఁ బృథివీంద్రని చిత్తముఁ గొంటమేలుగన్. 87

ఉ॥ ఇచ్చినఁ గోరునెయ్యమును, నీయకపోయినఁ గోరుఁబోరు, నా
మచ్చరితీరువేఱు, మఱుమాటకు దారికిరారు వార; లీ
నచ్చికబుచ్చిక ల్మనకు నచ్చవు; మెచ్చెరె వృద్ధువెండ్లి! శ్రీ
మెచ్చిన యంతమాత్రమున మెత్తురె ముగ్ధలు వృద్ధుజేకొనన్. 88

ఉ॥ కుచ్చితములొనర్చుఁ దనకోరికఁ దీర్చుకయున్న వాఁడు, నా
యిచ్చమెయిం బ్రవర్తిలఁగనేది యుపాయ? మశోకభూవరుం
జొచ్చి సహాయముంగొనెదు సూచన, తోఁచిన యంతమాత్రనే
వచ్చి ధరాస్థలింగొనఁగఁ బైఁబడు దగ్గఱివాఁడు గావునన్. 89

చ॥ అతని నెదుర్పఁజాల మసహాయుల మాతని క్రూరసైనికో
ద్ధతి సహియించి పోరఁగల ధైర్యము, స్థైర్యము, సైన్యమున్నె? భూ
పతి కొఱగాని వాఁడనుచుఁ బొక్కరె లోకులు హింసరేఁగ? నే
వితమున నీ విపజ్జలధి వీఁకఁదరించుటొ తోఁచదయ్యెడిన్." 90

చ॥ అని యురియాడు చిత్తమున నాతఁడు పల్కఁగ రాణియిట్లనెన్,
"మనమునఁ జింతగూరి యనుమానము లెక్కుడు మొల్కలెత్తఁ జె

ల్లునె జననాథ! తీరుదలలుం దలపోయక, రాయబారినిం
బనిపి యశోకభూధవుని భావము గైకొనమేలుగాదొకో. 91

చ॥ పడుచు పడంతుల న్మసలివగ్గుల కంటఁగఁ గట్టుకంటెఁ, దుం
దుడుకు లడంచి భూజనుల దుర్గతిఁ బాపుటమేలుగాదె, య
వ్వెడఁగున కింతచింత తగవే! మనుజాధిప! యయ్యశోకునిం
దడయకచేరి సాయపడు తంతుపౌనర్పుక చింతసేయుటే? 92

ఉ॥ ముప్పదియేండ్లవాఁడు, నృపపూజ్యుఁడు, ధీరుఁడు, సార్వభౌముఁడుం,
జొప్పడు సద్గుణోన్నతుఁడు శూరుఁ డశోకుఁడనంగ విందు, మీ
రిప్పగిదిం దపింప మనకెమ్మెయి సాగును? నాగవల్లి నిం
దప్పక కూర్చునన్న, సరదారుఁడు సాయము సేయకుండునే? 93

—♦ నాగవల్లి సంతోషము. ♦—

మ॥ తనలోఁ బొంగెడు భావవీచికలచెంతండాగి, గిల్గింత పె
ట్టిన యంతం జిగురించు భంగిఁ గడుదట్టింగొన్న హావంబు లొ
క్క నిమేషంబున హాసరూపమయి పొంగంబాఱె నాగావళీ
వనజాతేక్షణకప్డు, మాటచెవుల న్వాతాహతిం జోఁకఁగన్. 94

మ॥ చెలులన్యోన్యముఖావలోకనములం జెల్వొందఁగా, మీఱ ల
జ్జలజాతంబుల చాటుమాటుల విలాసంబుల్ప్రచారించు, న
ష్పులుఁ గుంజంటలఁ గాంతురే, చెలువులొప్పొందీఱునం చాత్మ లో
పలి భావంబును గప్పిపుచ్చె నతుల ప్రావీణ్య నిష్ణాతయై. 95

చ॥ జనకుఁడు తల్లిమాటవిని "సంగతమా నెటు? లయ్యశోకుఁడు
న్మనవినిఁ జిత్తగించఁగ సమానులమా? మన దక్షిణాపథం
బునఁగల రాజులొక్కటిగ మూఁగరె! మంత్రివినందు, గోయి వె
న్కనుజన, నూయి ముందుజనఁ, గార్యవిధానము నిర్ణయింపఁగన్. 96

ఆ॥ ఇట్లు జరుగునేని ఈ తోసలీభూమి
సమరరంగమగుడు జనపదములు

ధ్వంసమగును, ధరణి హింసలు రేఁగును
శత్రురాజకోటి సంతసింప. 97

ఆ॥ అనుచు సూర్యుఁ డంత నస్తగిరిం జేర
మనుజవల్లభుండు మందిరమున
కరుగఁదలఁపఁ దల్లియాదరంబునఁ బిల్వ
నాగవల్లి వారి ననుగమించె. 98

—♦ నాగవల్లి కలఁగని విచారపడుట. ♦—

ఉ॥ రాతిరి నాగవల్లి నిదురం దమ తోసలి యుద్ధరంగమై
ఘాతుకచర్య లుప్పతిలఁగా, జనసంఘము హింసపాలుగాఁ
జేతికిఁ జిక్కకొక్కరును జెట్టులు గుట్టలు పట్టి నీల్గిన
ట్లాతురభావముల్గనుచు నట్టె దిగుల్పడి యిట్లు చింతిలెన్. 99

ఉ॥ "రాఁడె! యశోకభూవరుఁడు రమ్మని పిల్చిన సాయమాచు? నీ
పాడుకళింగమల్లునకుఁ బంతమిదేలకొ! కుత్సితుం డహో!
లేఁడె సమస్తజాతులు తరింపఁగ శాంతిని బోధసేయువాఁ!
డేడి? వచింప నేనయితినే విధికంతకుఁ గ్రూరహేతువున్." 100

మ॥ అని చింతించుచు వంతనొందుచు సమస్తాశా నిరాశా తరం
గ నికాయమ్ములు నెమ్మి రేఁగి యడఁగంగా నుంత పాలోప్పిక క్రి
మ్మిన గాఢాంధతమస్సున న్మనుగ, 'లెమ్మా' యంచుఁ గేల్బట్టి లే
పిన చందమ్మున ధైర్యమ న్వెలుఁగు చూపెం దారి నిల్పోపఁగన్ 101

—♦ నాగవర్మ కళింగమల్లునకు ఇంద్రవర్మ భావముం దెల్పుట. ♦—

ఉ॥ వచ్చిన నాగవర్మఁగని "వార్తలు పండెనె, కోర్కె నిండెనే,
మెచ్చెనె యింద్రవర్మ, ప్రజమేలు దలంచెనె, నొచ్చుకోఁడుగా,
యిచ్చక మేమిదైన వివరించితొ" యంచుఁ గళింగమల్లు తా
నచ్చటివార్తలెల్ల నరయం గడు తొందరపాటు చూపఁగన్. 102

ఉ॥ "దక్షిణభారతోర్వి వసుధావరకూటమునందు నొక్కఁడై
దీక్షగ నిల్తునం చతఁడు తెల్పెను; మీఁద వివాహబంధురా
పేక్ష వచింప నంపుల కుపేక్ష వహించి తిరస్కరింపఁగం,
'గక్షులు పెంచుటెందుకు మృగాక్షికినై' యని నొక్కిచెప్పితిన్. 103

ఉ॥ అంత మహేంద్రభూపతియు "నాత్మజ యీడునకీడె మీ ధరా
కాంతునియీడు, హస్తిమశకాంతరమౌనని యాగ్రహించి, యే
కాంతమునందు మిమ్ముఁ బరిహాసములాడెను, వృద్ధులంచు, న
త్యంత మసహ్యమంచుఁ, దగునా! జవరాండ్రను గోర నంచునున్.104

చ॥ తనయ నొసంగనొల్లనని ధారుణిపైఁబడఁ జూచునేమొ! యా
తని మనసట్టిదేయగును; దానికి నోడముగాని, తెల్పు; మీ
సున జవరాండ్రపేరిట వసుంధర నేఁచుటకంటె శాంతిమై
వినుత యశోధురంధరత విశ్వము మెచ్చఁగ నేలు టొప్పదో. 105

చ॥ కని యుచితంబుగాని పనికై పగవచ్చెనయేని నేమనం
జను! విను! మిన్ను విర్గిపడినం బెడదారులు త్రొక్కనొల్లనే"
నని వచియించి, చెప్పుమని యాశవిరాశ యొనర్చి, పొమ్మన
న్వినయముఁ జూపుచు న్మదికి వేడిమి యెక్కఁగఁ బల్కివచ్చితిన్.106

ఆ॥ అనుచు నింద్రవర్మ యాడినమాటలు
వినిచె నాగవర్మ విశదపడఁగ
వెనుకముందు లరసి వీడక సత్యంబు
రాయబారి కదియ రాజగుణము. 107

—♦ కళింగమల్లుని ప్రకోపము. ♦—

చ॥ వినఁగఁ గళింగవర్మ మది వేడిమి పోఁడిమి దాఁడిరేఁగ, దా
డినిఁగనికాని యాతఁడు వడిం దనకూఁతు నొసంగఁ జాలఁడం
చును దలయూచి, చూచి తనచూపుల నిప్పులు రాల, నూర్పుచుం
జనియెను లేచివేగ విరసంబుగఁ, దొక్కిన త్రొచ్చుకైవడిన్. 108

చ॥ అటుతరువాత వారి సరిహద్దులయందుఁ గళింగమల్లు దు
ర్భట కపటంపుఁ గయ్యములు రాజఁగఁ, దోసలిరాజు వానికిం
గటకటసెంది, శాంతిమెయిఁ గాలము నీఁగుచునుండెఁ, బోరు లు
ద్భటమగుదాఁక సాధుపు లుదారత నోరిమిఁగూరి యుండరే. 109

—{ కళింగమల్లుని దుండగములకు వెఱచి యుంద్రవర్మ జాగ్రత్త పడుట. }—

ఉ॥ ఇక్కడ నక్కడంబఱుచు నెక్కుడు వెఱ్ఱితనంబు నెత్తిపై
కెక్కినయక్కళింగునకు నేది ప్రతిక్రియ? వెఱ్ఱిమానునే?
యుక్కివుఁ డెప్పుడే పగిది నుగ్రతఁ జూపునొ, నమ్మవచ్చునా,
ప్రక్కను బల్లెమై పరఁగువాఁ డని వేగవినిశ్చితాత్ముఁడై. 110

సీ॥ ఆకాశములనంటు ప్రాకారముల చుట్టు
పరగెఁడు కందకాల్బాగుపఱిచి,
అత్యున్నతంబౌచు నడరెడు కోటల
ప్రాఁతగోడలనెల్ల భద్రపఱిచి,
పరుగువారఁగఁబారు బారగు నాయుధాల్
పఱపైన బురుజులఁ బదిలపఱిచి,
నిర్నిమేషంబుల నిలిచి పొంచెడు యోధ
గణముల నందంద్రుఁ గడఁక నిలిపి

గీ॥ ద్వారములదిట్టముగా యోధవారముంచి
తృణజలాదుల నాహారగణముఁ బెంచి
శక్తి కొలఁది మహేంద్రుఁడు శత్రువునకుఁ
జిక్కకుండెడు పనులన్ని జక్కఁబఱిచె. 111

ఉ॥ "సామముచేత జక్కఁబడు జాడలుగాన మశోకుఁ డండయై
యీమహిఁజొచ్చెనేని మనకేది యుపాయము, మించిపోవ మీఁ

దేమియొనర్ప సాధ్యమగు? నెన్నిటఁబోయెడుఁ? బోవనిత్తునే,
యేమఱుపాటునం జని మహేంద్రుని తోసలి ముట్టడించెదన్." 112

మ॥ అని రోషం బడరంగ నిశ్చయపరుండై యాకళింగుండు, సై
న్యనికాయప్రబల ప్రదీప్తి మెఱయం దంత్రిజ్ఞుఁడై భూరి కా
ర్య నిమగ్నుండయి, సైనికాధిపతులన్ రప్పించి, యేకాంత శా
సన సంధానపరత్వముం గఱపె నుత్సాహంబు రేకెత్తఁగన్. 113

గీ॥ అంత సేనాధిపతులకు సంతసంబు
గదుర లోలోన జరిపిరి కార్యములను;
కాని జగమెర్గరాదని కన్నుమూసి
పిల్లిపాల్త్రాగు చందమై వెల్లివిరిసె. 114

గీ॥ తమ రహస్యము డాఁగునం దలఁపుచేతఁ
గొందఱేమేమొ చింతింతు రిటు లగుచు,
గోడలకుఁ జెవులుండునం జూడఁ గనరు
కపటములు డాఁగియుండంగఁ గలవె చిరము? 115

— ( మహేంద్రవర్మ యశోకుని సాయమునకై మంత్రియగు హేమనందిని బంపుట. ) —

ఉ॥ అంత మహేంద్రవర్మకది యంతయు గోచరమైనఁ, జింత నే
కాంతగృహమ్ముఁజేరి, కపటాత్ములకార్యకుతంత్ర మంతయు
న్వింతిరి హేమనంది కనుమానము తీఱఁగ బోధచేసి, "కా
ర్యాంతరమున్నె యింక నరయంగ నశోకునిమైత్రి తక్కఁగన్. 116

ఉ॥ పోరుట తప్పదంచు మది మున్నె యెఱింగితిఁగాని, దుండగుల్
దారులు గట్టికొట్టి రహదారుల నడ్డ నుపేక్షఁబూనితి
నైవ్వరము మేలుగాదనుచు; వారలు మీఁదికి దండు పంప ను
న్నారని వింటి; నింకఁదగునా! మనమొప్పరికించి చూడఁగన్. 117

ఉ॥ ఏఁగుము హేమనంది! తడవెందుకు నిశ్చితకార్యమందు, నీ
దాఁగురుమూఁతలేల రహదారి పొసంగఁగ, నాయశోకునిన్,
వ్రేఁగగు నాపదం, దొలఁచి పెండిలియాడఁగ నాగవల్లి నీ
వే గతియంచు వేఁడు, పృథివీ పరిరక్షణ చింతకుండుగాన్. 118

ఉ॥ కుత్తుకబంటి యాపదలకుం గడునొచ్చి, స్వదేశపౌరులం
గత్తుల కడ్డునిల్పఁ గొఱగాదని యెంచి, సముద్ధరింప, ను
వ్వెత్తుగ శత్రువుం దఱిమివేయు బలంబులు లేమిఁజూచి, లో
కోత్తర శౌర్యశాలి శరణొందుట యుక్తమ యంచు నెంచుచున్. 119

ఉ॥ మంతిరి హేమనంది మఱుమాట తలంపక పైనమయ్యె సీ
మాంతములెన్నొ దాటి బతిమాలి యశోకుని సాయముం గొనం,
జెంతలనుండు వారనుచు స్నేహముఁగోరి యడంపకున్న, ని
శ్చింతగనుండ నిత్తురె యిసీ! విషజంతువు లట్లు దుర్జనుల్. 120

ఉ॥ ఒత్తుగ శత్రువు ల్తఱిమి యొత్తెడు వేగము తొందఱింపఁగం,
జిత్తమునొత్తి యొత్తి పరిశీలనచేసెడు నాత్మవేగముం
దత్తఱపెట్టుచుండ, జవనాశ్వపు వేగము ముందు దూఁకఁగం,
సత్తుగ నొక్కవేగమయి సాగెఁ బ్రయాణము గ్రుక్కలోపలన్. 121

గీ॥ కలవరంబుల రేఁపెడు కార్యగతులు
త్వరితగతిఁజేర్చెఁ బాటలిఁ దఱిమి తఱిమి,
పసరు, యంత్రాలు, మంత్రాలు, పొసఁగ దేవ
పూజనమ్ములు వలచిన పురుషునట్లు. 122

మ॥ సరగంగాంచి ప్రధానమంత్రి నచటన్ సారంగపాణి, న్మదో
ద్ధుర కాళింగ నరాధిపాధిక దురుద్యోగంబు విన్పించి, "మా
ధరకుం బట్టిన కీడుఁబాపి, మమునో ధన్యాత్మ! కాపాడ మా
నరపాలుంగని వేఁడ వచ్చితిమి, సందర్శింప మన్నింపవే." 123

మ॥ అని ప్రార్థించిన హేమనందికిఁ బ్రధానామాత్యుఁ డత్యాదరం
బున "నయ్యా! భయమేల మీకు? నభయంబున్నేన చాటింతు. మా
జనపాల ప్రవరుం డుదారుఁ డతులోత్సాహంబు పై కొన్న యా
తని యౌదార్యమెఱింగి తెల్పెద సమాధానంబుఁ బాటింపఁగన్" 124

ఆ॥ అనఁగ క్షేమనంది హర్షంబుఁ బ్రకటించి
వెలఁది నాగవల్లి పెండ్లివార్తఁ
దెలుప, నతఁడు, తెలిపి తెలిపెద శుభవార్త
లనుచు వీడుకొలిపె వినయ మడర. 125

ఆ॥ అంత హేమనంది యనువైన చోటున
విడిది గొనుచునుండె వేడ్కమెనఁగ
మూఁడుదినము లట్లు ముగిసెనుగాని యే
జాడఁగనఁడు కార్యసరణి నెఱుఁగ 126

క॥ ఇచ్చటఁ గళింగమల్లుఁడు
హెచ్చుగ సైన్యంబుతో మహేంద్రుని పురికిన్
వచ్చెను ముట్టడి హెచ్చెను
విచ్చలవిడి నన్నవార్త వీనులఁ బడియెన్. 127

క॥ అంతట దత్తుఁ డెచ్చఁగ
మంత్రిగి మందిరముసేరి మర్యాదమెయిన్
గొంతువడంకఁగఁ బలికె, ను
దంతము సెలవిం డటంచు దైన్యము తోఁపన్. 128

గీ॥ పలికి ప్రార్థింప సారంగపాణి యాద
రంబు గదురంగఁ జిత్తంబు రంజిలంగ
"శుభము, శుభమం"చు, "మెచ్చె నశోకుఁడం"చుఁ
"జనఁగవచ్చు నమాత్యులం" చనియె నిట్లు. 129

—♦ సారంగపాణి యశోకుని యంగీకారముం దెలుపుట. ♦—

ఉ॥ "వేఁడినవేళ యెట్టిదియొ, వేగమసుందరగుప్త "సైన్యముం
దోడుగఁ గొంచు నేఁగు"మని తోఁడన యుత్తరు విచ్చిపంపె, న
వ్వాఁడును లక్షలాదిగ నభంగుర పౌరుషశాలివాహినిం
గూడి చలించె భూమి కలఁగుండుపడం, బగఱుల్ భయంపడన్. 130

ఉ॥ "మీసుతనాగవల్లికయి మేమిపుడేమియుఁ జెప్పఁజాల, మా
యాసము తీఱుమీఁద మఱియాదగఁ బెండిలియాడ మాకు సం
తోస" మటంచు మానృపతి తోసలిరాజుకుఁ జెప్పుమన్నవాఁ;
డాసలుతీఱె మీరలిఁకనంజక యేఁగుఁడు సిద్ధసాధ్యులై." 131

చ॥ అనవుడు హేమనంది హృదయంబునఁ బొంగులువాఱు సంతసం
బునఁ గొనియాడి మంత్రిగుణములనుమయోచిత వాక్చమత్కృతిం,
జనఁగ నుపక్రమించె జవనాశ్వభటుల్తనవెంట నంటిరా,
వనములఁ గొండవాఁగుల జవంబున దాటుచు నాగకొక్కటన్. 132

—♦ కళింగమల్లుఁడు తోసలిని ముట్టడించి యాక్రమించుట. ♦—

చ॥ ఇచటఁ గళింగమల్లపృథివీశుని దాడి భయంకరార్భటీ
పరిచలితమాచుఁ దోసలిపురంబునులోఁగొనఁ జుట్టుముట్టి, స
దురిచిర పురంపు వీథులను దుందుడుకు ల్పచరింప వాహినీ
నిచయము, భీతినొంది యవనీశుని యంతిపురంబు చింతిలన్. 133

చ॥ భవనము చుట్టుముట్టి పరిపంథులు రాజును బట్టుకొందురన్
రవములు సోఁకు లోపలనె, రాజుసారంగము దూఱియేఁగె, నీ
రవముగ రాణికూఁతుల దురంత విచారల వెంటఁ గొంచు, నే
వివరము తోఁచకుండఁ బృథివీశుఁడు దారిని మూసివేయుచున్. 134

చ॥ వెదకిరి రాజమందిరపు విశ్వసనీయములైన తావుల
న్వెదకిరి కోటమూలలను, వేదికలందలి చాటు గూళ్లలో

వెదకిరి బావులన్వనుల, నేలరహస్యపుఁగొట్టిడీలలో
వెదకిరి పట్టణంపునలువీథులు; జాడ లెఱుంగఁజాలిరే. 135

ఉ॥ "ఎంతటి మోసమయ్యె మనుజేంద్రుఁడు కూఁతురు చిక్కవైరిగా
యింతటి వింత కెయ్యదియొ హేతువు! మాయఁగఁ దోఁచుచుండె, నా
మంతిరి హేమనందిఁ గడుమాయలమారినిఁ బట్టితెండు, గే
హాంతరమందుఁ గల్గెడు రహస్యపుఁ ద్రోవలు వాఁడెఱింగెడున్." 136

చ॥ అనెడు కళింగవల్లభుని యాజ్ఞను గైకొని హేమనందినిం
గని వడిఁబట్టి తెచ్చుటకుఁగానన మార్గములందుఁ బొంచి, రా
తని సడిఁబట్టి నట్టడవి దైత్యులుపోలెఁ గడింది యోధుః; లే
మని వధియింపనౌను, నరయం దలకిందులు కార్యపాకముల్. 137

—♦ హేమనంది శత్రుమూఁకలకుఁ జిక్కుట. ♦—

చ॥ వడివడి నిల్వ కొక్కయెడ వచ్చుచునుండెను హేమనంది యే
ర్పడఁగ శుభంకరమ్మయిన వార్తలు రాజుకుఁ దెల్పఁగోరుచుం,
దడయక సంతసమ్ము మునుదారినిఁ జూపుచునుండఁ, గాని కా
రడవులు కారుమబ్బు లెదురయ్యెను జీఁకటిక్రమ్మ కాలమై. 138

ఉ॥ ధీరులు లెక్కసేయక మదిం బయనించిరి చిమ్మచీఁకటిం
బారుగ కాగడాల్వెలుఁగ, బంటులు గుఱ్ఱపువారు వెంటరాఁ,
జేరఁగ నాఁటిరాత్రికె రుచించఁగఁ దోఁసలిమీఁది చూపులం
దారులు రాజధాని కయిదాఱులు క్రోసులె దూరమాటచేన్. 139

గీ॥ కాఱుచీఁకటి తొలకరి కాఱుమబ్బు
లడలు గొలిపెడి దట్టంపు టడవిగములు,
కాలినడకలు త్రోవలఁ గంటకమ్ము
లింతకన్న భయంకరమ్మేది గలదు? 140

—♦ శత్రుమూఁకలు హేమనందిని చుట్టుముట్టి పట్టుకొనుట. ♦—

సీ॥ చంపుఁడు పొడువుఁడఁ జప్పుడు లెక్కుడై
గుండెలలో దడల్ క్రుమ్మరింపఁ,
బట్టుఁడు, కొట్టుఁడు, బంధింపుఁ డను కేక
లట్టుడికింప నట్టడవి యెల్లఁ,
బోనీకు రాముందు, రానీకురా వెన్క
నిలఁబెట్టి గుదికాళ్లు నలఁగఁ ద్రొక్కు,
చేఁబట్టి నిలుపురా, ఛీకొట్టగుద్దురా
చెంపలు వాయించి చెవులు బిండు,
గీ॥ మనెడు కోలాహలమ్ము లహంకరింప
దారిదోపిడి గాండ్రెము తలుముచుండి
రనుచు హృదయమ్ము చింతను మునుఁగఁ దొడఁగె
హేమనందికి సంభ్రమ హీనమతికి. 141

ఉ॥ చేయఁగనున్నదేమి విధిచెయ్ద మిదెట్టిదొ చూతమంచు, సం
ధాయకుఁడౌచు నిల్వ, వడిఁదాకిరి కత్తులవారు శత్రువుల్
పాయక ఖడ్గమెత్తి 'జయభారతి!' యంచునె వృద్ధుఁడైన యా
ధీయుతు చేతిఖడ్గమది ధీం, ధిమి, ధిమ్మని నాట్యమాడఁగన్. 142
మ॥ తనవారెవ్వరొ కానివారెవరొ యుద్దామ ప్రకోపంబున
న్వెనుకన్ముందును జూడ కొక్కమెయి విన్విధం బ్రనర్తించి, శ
త్రునికాయమ్ముల కంఠకాండముల సంధుల్ త్రుంచి చెండాడె నొ
క్క నిమేషంబున రూపుఁగొన్న బలియై కార్కొన్నయా చీఁకటిన్.
ఉ॥ తుంటలు తుంటలై పడఁగఁ, దోరపు మూఁకల దండు రేఁగ, నా
యొంటరి వృద్ధుఁ డెప్పగిది నోపును నిల్వఁగ, శక్తిహీనమౌ
చుంటకు, బంటులెక్క డగుచుంటకుఁ జింతిలి, వంతమున్గి, దు
ష్కంటక పూరితస్థలి వెసం బడె మూర్ఛితుఁడౌచు నంతటన్. 144

ఉ॥ పట్టిరి గిట్టకుండ బిగఁబట్టిరి, చేతులుకాళ్లు బిట్టుగం
గట్టిరి; వట్టికేకలిడి కట్టెఁడి బంటులు నెత్తిమోయుచుం,
జెట్టిరి దిట్టలౌచుఁ బృథివీశకళింగుని కాళ్ల ముందటం,
జెట్టికినేని కాలగతి చేటగుపట్టునఁ జెట్టపుట్టదే? 145

## —♦ మహేంద్రవర్మ విచారము. ♦—

చ॥ "తలఁగెనుగాని శత్రుకరతాడన పీడన బంధనమ్ములుం,
దొలఁగెను గీర్తివైభవము, తోసలిరాజ్యము, వైపరీత్యముం
దలఁపఁగనైతి, నిట్టి పరితాపభరమ్మను నెట్టులోర్తు, మా
యలఁబడవైచి యేఁచెదవహా! పృథివీశులనేని దైవమా! 146

ఉ॥ పోయెనో లేదో పాటలిప్రభుం దరియంగను హేమనంది! రాఁ
డాయెనునింక; నేల తడవయ్యెనో? చూచెనో లేదో! సాయముం
జేయఁగనొప్పఁడో! విసుఁగుజెంది యశోకుఁడు లేక దారిలో
మాయలమారిచేతఁ బడిభ్రమందెనో, కుందెనో, యేమియయ్యెనో! 147

ఉ॥ హా! విధియెంతసేసె, గహనాంతరసీమల పాలుసేసి, న
న్నీవిధి నల్పుఁ జూచుటకు నేనొనరించిన కర్మమెట్టిదో,
పావనభక్తితత్పరు లభాగ్యులు పౌరులకేది దిక్కు, హా
రావములెక్కఁ బొక్కు లడరంగ నరాతులచేతఁ జిక్కిరే. 148

ఉ॥ ఏమియొనర్చువాఁడ, తెరువెయ్య దరిం గికురించి పోరఁ, బో
రామిఁ దలంచి, పౌరుల నరాతులకత్తుల కాహుతీయలే
కా మహనీయచిత్తుని సహాయముఁ గోరితిఁగాని, యింతలో
నీ మదవద్విరోధిగణమింతయొనర్చు నటంచు నెంతునే. 149

ఉ॥ దైవమ! తృప్తితీఱెనె? మదాంధులపాలిటి మోహదూతవై
కావఁగఁజూతు, సజ్జనులఁ గారడవుల్చరియింపఁజేతు, నీ
భావమదేమొ! ధార్మికులఁ బాండునరేంద్రుని పుత్రులం ధరి
త్రీవలయంబులో వనులఁ ద్రిప్పవె, నీకెదురీఁద శక్యమే. 150

ఉ॥ రాజయిపుట్టుకంటెఁ గవిరాజయిపుట్టుట కొంతమేలు, శే
రాజు, వసంతరాజు, వలరాజును గొల్వఁగ నిశ్చలాత్ముఁడై
రాజిలు కావ్యకాంత వనరాజము లన్విహరించుచుండు, రా
రాజయినం ధరిత్రిఁ బొగరాజు నరాజకముండ కుండునే. 151

ఉ॥ ఏమియొనర్చిరో ప్రజల నెమ్మెయిఁ దిట్టిరొ, కట్టి కొట్టిరో,
భామల భంగపెట్టి పసిపాపల నల్పిరొ, సోయగంపుటా
రామము లక్కటా! చెఱిచి, రాజగృహమ్ములఁ బాడొనర్చిరో
యేమి తలంపనేమి? బలహీనులకెయ్యది మార్గమిత్తఱిన్. 152

గీ॥ అనుచు నయ్యింద్రవర్మ దుఃఖాబ్ధి మునిఁగి
యూపిరాడక దరిఁజేరు నాపు లేక
యా పరాత్పరు పదములమోపిబరువు
దిక్కులెగఁ జూచుచుండె భీతిల్లుమదిని. 153

—♦ కళింగమల్లుఁడు హేమనందిని బలాత్కరించి యురిదీయించుట. ♦—

చ॥ తెలతెలవాఱఁగా వసుమతీశుఁడుదుష్టకళింగవర్మ, చా
రులు గొనివచ్చు వారలెవరోయని కన్గొని "హేమనందులా!
యిలఁ బడి యుంటిరేల, మమునెగ్గితిరే యిపుడైన, దొడ్డ మం
త్రులుగద! మీ కశోక నృపపుంగవు సాయము నిక్కమయ్యెనే? 154

ఉ॥ పట్టితిఁ దోసలీపురముఁ బట్టఁగఁ జూచితి రాజుఁ బుత్రికం
జెట్టులుకారె మీరు, ధరణీశులు మీవలెఁబొఱి పోదురే,
యిట్టిమంగడు మీనృపతి యెంతయు శూరుఁడుగాఁడె, మాటలం
దిట్టతనంబుఁజూపి, పరతెంచిన మమ్మెదిరించఁ డేలకో. 155

ఉ॥ చెప్పుమ హేంద్రవర్మ యెటఁజేరెనొ, లోపలిమార్గ మెద్దియో,
యిప్పటికైన నేనతని హింసకుఁ బూనను, చెల్మిఁగోరుదుం,
జెప్పెద దక్షిణాపథము చిందరవందరలౌటకంటె, లో
నొప్పు చెడంగనీక, మనయొప్పులు తప్పులు దిద్దుకోఁదగున్. 156

ఉ॥ ఎక్కడివాఁ డశోకధరణీశుఁడు, దక్షిణభారతోర్వియం
దక్కపటాత్ముఁ డెచ్చుకొని యాతని కాళులకిందివారమై
పోక్కక, యైకమత్యమును బొంది సుఖించుట మేలుగాదె, నీ
వొక్కట యోజసేయుమిది యొప్పగుఁ దప్పగు స్పష్టమయ్యెడిన్."

చ॥ అనవుడు హేమనంది "ప్రభువా! ధరనేలఁగ యోగమున్న మీ
ఘనత నెఱుర్పఁజాలెదు మగంటిమిఁ జూపఁగ మాకు శక్యమే,
మన మలరంగమించు బహుమాన్యులు, మీపదధూళి సోఁకఁగా
ననువుగ నేలపైఁ బడితి నార్యుఁ డశోకుఁడు సాయమిచ్చునా? 158

ఉ॥ పట్టుగఁ బట్టుపట్టి మముఁబట్టఁగఁ బుట్టినజెట్టివీరు, మా
జెట్టితనంబు మీయెదుటఁజెల్లునె? నిల్చునె పాటిపోక, మా
దిట్టతనంబు లావయిని దేవుఁడెఱింగెడు; నూపిరున్న చో
బుట్టలనుప్పు నమ్మికొని పొట్టలు పూఁచ్చుకొనంగ నొప్పదే. 159

ఉ॥ పిల్లలు మేఁకలుం బడెడు పీడలు గోడులు చూడలేక ని
ల్వెల్లను తాపమెత్తి నరహింసకు రోసి, పురంబు వీడఁగం,
జెల్లెనె పాటిపోకయనఁ, జెల్లదు ధర్మపరత్వ మిఖ్యలం
దల్లికిఁ బిల్లనోచఁగలదా, సమరంబులు తాండవించఁగన్. 160

ఉ॥ నాకయి నేను నేఁగఁ గరుణాకరుఁడై యతఁడెట్లు లేఁగెనో,
మీకెఱుఁగంగ రానియెడ మీకడబద్ధుఁడనైన నాకు ని
ష్పోకయెఱుంగ సాధ్యమగు పోకడయున్నదె? ప్రోలుమీఁదెగా
సాకులు పెట్టనేల ననుఁజంపినఁ జంపుఁడు, చేతఁ జిక్కితిన్. 161

ఉ॥ దక్షిణ రాజకూటమునఁ దానొకఁడౌటకు సందియంబె, మీ
దీక్షవిరుద్ధమాటఁ దెగడెంపుగఁ బల్కెనుగాని, యిట్లు దు
ర్భిక్షము పాలుసేయఁదలఁపే? యనఘాత్మున కింద్రవర్మ కీ
కక్షలు పాడిగావు, ప్రజఁగావఁగ నాతఁ డశోకుఁ జేరఁడే." 162

చ॥ కనలుచు "హేమనంది! కథగాదు కళింగుని రాజకీయమూ,
నని మది నెంచి పెంచక నయంబునఁ దెల్పు మహేంద్రవర్మ యే
యనువునఁ బాఱిపోయె, నరయంగను నీకెఱుఁగంగరానిదే
వినుము ప్రధానివౌదు, నను వీడము మార్గముఁ దెల్పకుండినన్. 163

చ॥ విడిచెద నిన్ను నీపతిని, వేఁచఁగఁ జూడను; తెల్పకున్న నీ
విడుమర కేదిదారి, విను, వేఁడుక గాదిది తెల్పుచుంటిఁ, బా
ల్పడెదవె ప్రాణహానికిని? భంగపుఁ బాటులకోర్తు వెట్టు? లిం
కుడుగుము మొండిపట్టు, తగునో తగవుం బరికింపకుండఁగన్." 164

చ॥ అనుచుఁ గళింగవర్మ తెగనాడఁగ, నోడక వాఁడు పల్కె "నే
మని భవదీయపౌరుషము మారె! నుతించెద? ముందు చూపునం
జనియెడువాఁడు గావలయు; సద్గతి గల్గునె రాజద్రోహికి?
నన్ను నిటుపట్టికొట్టిన వినమ్రుఁడనై శరణొందువాఁడనే? 165

చ॥ ఎఱుఁగను మా యధీశులెటు లేఁగిరొ, మార్గరహస్య మేమిటో
మొఱఁగుట పాడిగాదు, మొగముంగని పల్కఁగఁ జేతఁగాదు, నే
నెఱిఁగితి నేనియుం దెలుప; నిద్ది కృతజ్ఞుఁడు నేర్చు విద్యయే?
పఱచెదు భంగపాటులకుఁ బ్రాణముతీఁతకు జంకువాఁడనే." 166

చ॥ అనుటయు నాకళింగపతి యగ్నికణంబులు చిన్కఁ గన్గవం
గనుఁగొని "యోజసేయుమిఁకఁ, గాలము చాల దుపేక్షసేయ మా"
కని యొకకొంతసేపటుల నాతని మోమునఁ జూపు నిల్పి, తీ
రనిపని యంచు నెంచి, వినవా! యని చారులతోడ నిట్లనెన్. 167

చ॥ "విడుగర లేదు వీనికిఁక, వేఁచుఁడు, కొట్టుఁడు, వేఁగు లోపలం
గడగడలాడి రాజగృహగర్భములోపలి త్రోవఁజూపిన
న్విడువుఁడు! లేనిచోఁ గొఱతవేయుఁడ"టంచును దెల్పి యేఁగెఁదా
గడబిడఁజేసిచేసి కడకన్నులఁ గోపముఁ గ్రుమ్మరించుచున్. 168

ఉ॥ అంతట రాజసేవకు లుపాంతమునందు గుడారమందు వే
ధింతమటంచు నెంచి, పరతెంచి రుషాగ్నులు క్రుమ్మరించి, సా
ధింతుము, తెల్పవేని కడతేర్తుము, తెల్పుము నాఁగ, వారికి
న్నంతిరి మూఁగవానిగతి మౌనముఁ దాలిచి పల్కకుండెడిన్. 169

ఉ॥ చారులు శత్రువుల్చనిన జాడలు గన్గొన నాసతిప్పి, దు
ర్వార పటుప్రతాప విభవాతిశయమ్ముల యోధవారముం
దారులు గావనిల్పి, సరదారులఁ జారులరాక పోకకుం
ద్వారములందుఁబెట్టి గరువంబున మించెఁ గళింగమల్లుఁడున్. 170

——♦ అశోకుని సైన్యము వచ్చుటఁగాంచి యింద్రవర్మ కలఁతపడుట ♦——

ఉ॥ తోసలి పార్శ్వమం దనతి దూరపుఁ గొండలలోన నొక్కటై
భాసిలు కొండకొమ్మునను బర్వు రహస్యపు మందిరమ్మున
న్వాసము చేయుచుండె బలవంతపు దైవికదైన్యవృత్తి నా
యాసముతో మహేంద్రుఁ డసహాయతకుం గడునొచ్చిపొక్కుచున్.

ఉ॥ "ఇప్పటికైన నేమి వసుధేశుఁ డశోకుఁడు వచ్చువాఁడె! యా
చొప్పెటు లారయందగుఁ, గుచోదకు చెద్దు మడంగునట్టు లీ
ముప్పుఁదొలంగకున్న మునిముచ్చుల నమ్మఁగవచ్చు నెట్టులం
చప్పటి కప్పుడప్పు డహహా! యని దారులు నిక్కి చూచెడున్. 172

శా॥ ఉన్నట్టుండి యరణ్యప్రాంతమున నెంతో ధూళి రేఁగంగ, ను
త్పన్నప్రాంత ప్రదీప్తరావ మొకటై చాటింపుగాఁ బొంగ, నా
సన్న క్రూరమృగాళి బెగ్గిలి వెసన్ శంకించి పాఱంగ, నా
యున్నిద్రుండు మహేంద్రవర్మ గని యత్యుద్వేగియై చూచుచున్. 173

ఉ॥ "ఎట్టులెఱింగె జాడలను! నెవ్వరు తెల్పిరి! శత్రువేయగుం,
గట్టిఁడి నిల్వనిచ్చునె వనంబున నైనను, నేది త్రోవ, నా
గుట్టునెఱింగి నాపయికి గొబ్బున దూఁకుచునుండు వాఁడ హా
నట్టడవి న్వసింపఁదగు నయ్యధికారము నాకు లేదుగా. 174

ఉ॥ ఆకసమెత్తు దుమ్మెగురు నంతటిసైనిక సంభ్రమంబుగా
నాకని తోఁచుచుండెఁ; దగునా! పరికింపక తొండదుంపడర్
మూఁకలు మూఁకలై కడఁక భూతలమంతయు నావరించి, పె
న్వేకున వచ్చుచుండుఁ గడువేగమ, శత్రివులింత వారలే?" 175

—♦ మహేంద్రుఁ డశోకసైన్యముం గాంచి సంతసించుట. ♦—

మ॥ అని చింతించుచుఁ జూచుచున్నలిచె నయ్యార్యరణ్యకవార్తముల్
చనుచుండన్వడి దిక్కుదిక్కులకుఁ, దత్సైన్యాంగముల్ దగ్గఱం
గని యుప్పొంగెను నేలయీనిన గతింగన్పట్టి విస్తారమై
తనలో నిద్ది యశోకుసైన్యమనుచుం ధన్యుండ నంచెంచుచున్. 176

సీ॥ సమరసంరంభముల్ సాగునె మాముందు
నిలునిలుమను మాడ్కిఁ దలలు తిరుగ,
వేనకువేలుగఁ బెనఁగొను నడగొండ
చాళులగతిఁ గాలిజాడలొప్ప,
సారెకు ముందుకుసాచు తొండమ్ములు
బారుగొన్న ఫిరంగి పగిది నడర,
రండు కాళులకిందఁ బిండి యొనర్తుమన్
హుంకారముల భంగి ఘీంకరింప,

గీ॥ సమరసన్నాహ పరవశ చతురగతుల
బిరబిరానను బరతెంచు కరులగముల
ముందు వరుసనుగాంచి సమ్మోదమునంది
యిందరివర్మమొడంద నిస్తంద్రమయ్యె. 177

ఉ॥ పారముమీఱి పైకెగయువారిధి వీచికల ట్లపారమై
ధారలు ధారలై పలువిధంబుల ధారల యశ్వధార లా
ధారములేక లెక్కిడఁగ దాడులఁదీయుచు శత్రుభీకరా
కారతఁ గ్రాలుచుండెఁ గడఁకం దుడుకుల్వడఁకం, దలంకఁగన్. 178

ఉ॥ పక్కల బారుగొన్న బహుభంగిఁ బదాతుల బంతు, వానికిం
జక్కని నడ్మిభాగమునఁ జాలుగవచ్చు రథమ్ము లావయిం
జిక్కని కాల్బలంబు తుది చిక్కక లక్షలసంఖ్య మించుచుం,
జెక్కుతెఱంగులం బుడమిభీకరరూపముఁదాల్చి నట్టులన్. 179

ఉ॥ ఎక్కిడిరాఁగ, బల్లెములు నీటెలు కత్తులు తోమరంబులుం
బెక్కగు నాయుధాల్మెఱయ, బీతులు గొల్పుచు విల్లునమ్ములుం
జక్కవెలుంగఁగాంచి, సరసాత్ముఁ డశోకుఁడు వచ్చెనింక, నా
చిక్కు తొలంగెనంచు నరుసించి మహేంద్రుఁడు చూచుచుండఁగన్.

—♦ అశోకుఁడు సైన్యముతో మహానదీతటమున విడియుట. ♦—

ఉ॥ వచ్చి మహానదీతట మవారిత విస్తృతపాంతమైతగ
న్మెచ్చి గుడారముల్నిలుప మేదిని నాథుఁ డశోకుఁ డయ్యెడం
జొచ్చి మహేంద్రు తోసలముఁ జూచుచుఁ గార్యగతుల్దలంచుచు
న్వచ్చెడు యుద్ధవార్తలను వారక వించుఁ బ్రతీక్షసేయఁగన్. 181

ఉ॥ నాఁడు విచిత్రమే మొ గహనంబునఁగోన గృహమ్ములోన నే
నాఁడు వినంగరాని శకునంబులు తోఁచె, విలాసరోచుల
న్వేఁడుక నాడెఁ జందురుఁడు; వింతగఁబాడుచుఁ, దమ్ములున్ రుచి
క్రీడలఁదేలి విచ్చుకొని లీలలవున్గి వికాస మందఁగన్. 182

చ॥ చెలులను బల్కరించుఁ దనచిత్తమెలర్పఁగ భావమాధురీ
కలితవిలాసరోచులు ముఖంబున లాస్యములాడ నవ్వుఁ, జ
క్కిలిగిలిపెట్టినట్టుల సఖీజనముం బరిహాసమాడుచి
ట్లలరెను నాగవల్లి తన యాత్మను బొంగెడుకోర్కి పెంపునన్. 183

చ॥ బిరబిర హర్షవిస్మయము పెంపున నాదెసకేసిచూచు, సం
బరమునఁ బొఱుముందునను, భాగ్యములన్నియుఁ బండినట్టుల
న్మరిపముఁ జూపు, నెచ్చెలులమోములు గన్గొని యేదియేదియో
గురిగొనఁజూచుఁ, గామినులకోర్కులు చేష్టలు వింతొగదా! 184

మ॥ మదనప్రాజ్ఞుఁ డపూర్వశిల్పకుఁడు సంభావించి ప్రాఁబోఁడి నె
మ్మదికత్యంతముదంబు చేకురఁగ శుంభద్రాగ నానారుచుల్
పొదలం గట్టిన భవ్యభావ భవనోద్భూత ప్రభూతోల్లసత్
హృదయాహ్లాది విలాసడోలికలపై దీపించె దివ్యాకృతిన్. 185

ఉ॥ వేచి సమస్తసైనిక నివేశ మశోకునుదాత్తుఁ జూడఁగన్
లేచి రహస్యవేషమున నిందితుఁడుంబలె నింమునందు సం
కోచముతోఁ జరింపఁ, బ్రతీకారాలుఁ డటంచును సంశయించి, యా
లోచనపేడి రాజభటు లుక్కివునట్టులఁబట్టి తెచ్చినన్, 186

ఉ॥ "ఎవ్వఁడు వీఁడు పట్టువడనేమికతంబ"ని పల్కరింప "నే
నెవ్వఁడఁగా నశోకధరణీశ్వర! తోసలిఁ గోలుపోయి యిం
దివ్వగ దిక్కులేక తపియించు మహేంద్రుఁడ, చూడఁగోరి మి
మ్మిప్రవీథి బంట్లచేఁ బడితి, నేమియొనర్చెదో నిన్ను నమ్మితిన్." 187

చ॥ అనఁగ నశోకభూమిపతి యాదరమొప్పఁగఁజేరఁదీసి, నె
మ్మనమున విచారవీథిఁబడి "మాయురె! దైవికమాయ యే మనం
జను, విధియెట్టులో యటులసాగదె, తాపపడంగనేల", యం
చనువుగఁదెల్ప, నిశ్చయ సమంచితుఁడై తగవొప్ప నిట్లనెన్. 188

ఉ॥ "సేమమె యింద్రవర్మ! మముఁజేరఁగ నేది యుపాయమయ్యె, నా
కామికళింగవర్మ నినుఁ గానన భూమికిఁ బాఱఁదోలెనే
యేమియొనర్చెవాఁడు, తగవెంచఁడె, తెల్పుమనంగ" నాతఁడున్
"స్వామి!"యటంచుఁ గేల్మొగిచి సర్వముఁదెల్పెఁ గళింగవృత్తమున్

ఉ॥ కోటను ముట్టడించి బహుకుత్సితుఁడై నరహింసఁబూన, దు
ర్గాటవినుండు గేహము సురంగము త్రోవను జేరియుంటిఁ, బో
రాటముఁ జూడలేక, తమరాకఁ దలంచి ప్రతీక్ష సేయుచున్
నేఁటికి ధన్యమయ్యె నవనీశ్వర! జన్మతరించె మీకృపన్." 190

చ॥ అనుటయు నాదరించి వసుధాధిపుఁ డాతనికాపునిచ్చి, ““యి
వ్వనమున నొంటినుండఁ దగవాని తగురక్షణఁ బంపువాఁడ” నం
చనునయమొప్పఁబల్కి, కరుణాకరుఁడై “తన యంతికమ్ము చే
రిన నది యెంతొ మేలు వివరింపఁగనం”చు వచించి యంతటన్. 191

ఉ॥ తోసలి కేఁగి చూచి కడుదూరపు యోజనచేసి ““దక్షిణా
ధీశులఁ గూడఁగట్టుకొని, దీక్షవహించి కళింగమల్లుఁ డ
త్యాశల నొందనేల, యడియాసలఁ గుందఁగనేల, వట్టి యా
వేశముఁ జెందనేల, తనవీర్య మెఱుంగఁ డటంచు నుండఁగన్. 192

చ॥ ఎఱిఁగి కళింగమల్లమనుజేంద్రుఁ డశోకునిరాక, వీక్షమైఁ
బరగుచు దక్షిణోర్వి గలపార్థివకూటము సమ్మతింప, దు
ర్భరపటు సాహసంబడర, వైరులమూఁక నెదుర్పనెంచి, స
త్వరుఁడయి సంతరించె బహుభంగులఁ గార్యములోలిధుర్యుఁడై. 193

ఉ॥ దారులు గట్టి కార్యపరతంత్రులఁ జారులఁ బ్రోత్సహించి, దు
ర్వార గజాళిఁబెట్టి సమరాంగణభూమి, మహానదీ తట
ద్వారములందు జోదులను వైరివిదారణ కార్యసూత్రి సం
దారణ తత్పరాత్ములఁ నతంద్రిల నిల్పెఁ గృతప్రయత్నుఁడై. 194

గీ॥ ప్రభువశోకుఁడు సారంగపాణి మంత్రి
యిరువురును భండనోద్ధతి కేది దారి
యనుచుఁ గౌటిల్యపద్ధతు లరయుచుండఁ
బరుగు పరుగున జవనాశ్వభటుఁడు వచ్చి 195

గీ॥ ““జయము పృథ్వీశ! శత్రుసంచయము నీట
మునిఁగి సైనికనౌకల ముంచఁదలఁచి
కదఁగుచుండంగ మనవారు సడినిఁబట్టి
పట్టి బంధించి నిర్బంధ పఱిచిరిపుడు. 196

—♦ అశోకుఁడు యుద్ధమున కాజ్ఞయిచ్చుట. ♦—

చ॥ అనవిని వేగిరింప ననువౌనిఁక లెమ్మని మంత్రిపుంగవుం
బనుపఁగ నాతఁడేఁగెఁ, దరువాతను సుందరగుప్తుఁ డేఁగె, నా
జనపతిమూఁకలప్పుడు పొసంగ నదీతరణంబుసేసి, త
మ్మును నెదురించు శత్రుదళముంగన కెక్కుడు సంబరంపడన్. 197

సీ॥ జంకుగొంకులు లేని జయజయ నినదంబు
కాల్బలంబులలోనఁ గ్రిందుకొనఁగఁ,
దడఁబడి శత్రువుల్గడగడ లాడంగ
హయహేష లమితమై యడలు గొలుప,
ఒక్కడూఁకునదూఁకి పక్కలు చీల్చెడు
పగిదినేనికపిండు పరువులిఁడగ,
గురివెట్టి పడఁగొట్టి యరిగణంబుల పొట్ట
లొక్కటఁజీల్ప నాయుధము లెగుర,

గీ॥ పుడమిపగిలిన చందమై బోరుకొనఁగ
దూఁకెఁ గాళింగ సేనపై పీఁకతోడ
సింహనాదంబు లతినుతి సేయుచుండఁ
బోరుప్రారంభమయ్యె నాఘోరమగుచు. 198

మ॥ ఇరువాగుల్తలపడ్డ వెన్వెనుక నెంతే నాయకుల్ రేఁప, ము
మ్మరమైసాగెను బోరు ఘోరమగుచున్నాక్రోశించుఁ గాక్రోశించు, సం
బరముల్వొంచుచు నప్సరోంగనలకున్, మర్దించి కుందించి, య
బ్బురమై తోఁచుచు, భీకరార్భటులు నార్పుల్పేర్పులుప్పొంగఁగన్ 199

సీ॥ కొమ్ములవడిఁగుమ్మి చిమ్మునేనుగుల దొమ్మి
పమ్మిన కోపానలమ్ము రేఁప,
ధారాగతుల్ఖడ్గధారాహతుల్మీటి
తురగ రణోద్ధతి తొందఱింప,

బాకులీఁటెలు మేటిబల్లెములు కత్తులు
జోకమై వీఁకమైఁ గేకలుడుప,
బలివిముక్త శరపరంపరలు పల్లిజ్ఞలు వల్కు
నరివీరకంఠాల కతుకు తెంప,

గీ॥ ఘోరరావము లెల్లెడ బోరుకొనఁగ
ధీరులకు నేని హృదయ విదారకమ్మౌ
పోరుమీఁదెను నెత్తుటి యేరు లడరఁ
బ్రళయతాండవమా యన్న పగిదినొప్పి. 200

శా॥ "ఓరీ! భారతయుద్ధవీరులము మమ్మోర్మెడింపఁ బీడింప, మీ
కౌరా, పేలెద రేల, నిల్వుఁడనుచుం గాండ్రింపఁ గాలింగు" "తా
ధీరుల్మీరలు, మౌర్యవీరులకు మీధీశక్తి నుత్యంబు, మా
పోరుల్ గీఁకు నృపాలురెగ్గి రిటముల్, బోధ్యంబులౌ మీకిటల్."201

మ॥ అని యన్యోన్యము తూలనాడుకొనుచుల్ హుంకార హుంకారముల్
బెనుప న్మోఁగెను మూఁకమూఁకలగుచుం బీరమ్మౌ తోరమ్మౌగాఁ
గనుమూయం గనుపాపఁదీయు పగిదిం గాండ్రించి వేండ్రించుచుం
ఘనవాతాహతిఁ దూలువృక్షముల చందంబొచు సేనాటవుల్. 202

ఉ॥ వచ్చునొకండు వేగమున, వచ్చును వ్రియ్యలుగాఁగ బొమ్మ, పె
న్మచ్చుగవాని జో మన్నెగల మోఁదునొకండు ప్రవృద్ధకోపుఁడై
చిచ్చులకత్తులం జళిపి, చిక్కినవారలఁ జీల్చిచెండుచు
న్మచ్చరమూని పోరి రసమాన రణాంగణ మార్భటింపఁగన్. 203

ఉ॥ మీసము తీడి కేకలిడి మించఁగ రోసముఁ జూపునంత, నా
యాస మదేలరా యనఁగ నాతనిబొమ్మన నీఁటెదూఱ, నా
కాశమువంక జూచి, రుచిఁగన్గొని విస్మిత చిత్తుఁడట్లు లా
రోసము తూల నిల్వ మిడిగుడ్లను దూలుచు నేలపైఁ బడున్. 204

ఉ॥ పొంగులు వాఱు పౌరుషము ముందుకుఁ ద్రోయఁగ హుంకరించి, యు
ద్ధాంగణమెల్ల గర్జిల నహమ్మని రోషము మీఱఁ బల్కి, దే
హాంగము లొక్కటొక్కటిగ నాహుతిఁ గొంచు నె ఖడ్గధార, లా
పొంగెడు పౌరుషంబడఁగఁ బోరిరి నెత్తురు పొంగి పాఱఁగన్. 205

ఉ॥ కత్తికిఁ గత్తిఁ జూపి కడఁక న్వడిగన్ సుడిద్రిప్పి పోడిగన్
గుత్తుక లుత్తరించుకొని కూలుదు రాహవ రంగమందుఁ, జే
యెత్తి నిజప్రతాపముల యిమ్మలఁ దెల్పుచుఁ దూలనాడుచు
న్నొత్తములౌచుఁ జచ్చెదరమోఘ శరాహతినేలఁ గూలుచున్. 206

మ॥ చటులోన్మాది భటోద్యమ ప్రకటితాశాజ్యోతి మున్నిడ్వ, ను
త్కట నానాయుధ పాటితాంగమగు నక్కాళింగ సైన్యాటవిన్
ఘటనాశక్తి యడంగఁ జేయుచు నశోకాధీశు సేనాళి, యు
ద్భటమై వీరవిహారమున్ సలిపె నుద్యత్క్రోధ దుర్వారమై. 207

ఉ॥ ఒక్కటఁ గాల్బలంబు, మఱియొక్కట గుఱ్ఱపుసేన, యేన్గులిం
కొక్కటఁ, గ్రూరరూపమగు యుద్ధముసేయఁగఁ బౌరుషమ్ములం
బెక్కురు రెండుపక్కలను మృత్యుముఖంబునఁ బడ్గఁ, బీన్గులం
ద్రొక్కెడు యుద్ధమైపరఁగెఁ దొమ్మిది నాళ్లకు దుర్నిరీక్ష్యమై. 208

ఉ॥ అంతఁ గళింగమల్లవసుధాధిపుఁడందఱఁగూర్చి పల్కె "నేఁ
డంతమునందుటో, మనమహత్వ సమత్వసుమంత్రితా సుమం
బెంతయుఁ బృథ్విపైఁ బరిమళించుటొ గావలెఁ జింతసేయకుం
డింతట" నన్నఁ బోరిరి సహించి యశోకుని సైన్యధాటులన్. 209

చ॥ ఉఱకలుపెట్టుచుం దొరలు నుద్ధత వాహిని కడ్డుపెట్ట నే
గఱువకునైన సాధ్యమగు కార్యమె? యైనను నుత్సహించి, యె
త్తెఱఁగుననైన దిట్టయయి దీటుగ నిల్చుట పౌరుషంబ, యి
మ్మెఱుఁగుటమేల, కాని తరమే తనుమించినవారిఁ దాఁకఁగన్. 210

ఉ॥ పట్టి బలాత్కరింప సరిపట్టుల నెట్టుచుఁ బోరుచుండి ర
ప్పట్టున లక్షలాది బలవంతపు మాగధసైన్యఘాటికిం
బెట్టుతొలంగి పల్చనయి బీరములుడ్గి కళింగసేన క
న్పట్టె వినష్టశేష మటుపైఁ బడునైదవనాఁటి కంతటన్. 211

ఉ॥ నాఁడె రణంబు మాన్పఁ బను నాఅవనాఁటి కశోకుఁ డుద్ధతిం
జోడుగ నింద్రవర్మఁగొని చొక్కమదేభము నెక్కి నిక్కుచుం
గూడఁగఁబోయి వాహినులకుం గడుఁబ్రేరణనిచ్చి మెప్పుపుం
దోడయినిల్వఁ బోరిరొక దూఁకునదూఁకి కళింగసేనపై. 212

మ॥ పరఁగం బాహుబలోద్ధతుండయి ధనుర్బాణంబులం బూని, దు
స్తరదుర్భేద్య దురీక్ష్యుఁడై వెలఁగె నాసంగ్రామరంగంబు నం
ధరణీపాలుఁ డశోకుఁ డంచిత రణోత్సాహంబు ప్రోత్సాహముం
బరువై తోఁచఁగ శత్రురాజులకు నార్భాటంబు తూటాడఁగన్.213

శా॥ ఆశాపాశము తుంటలై చెదర సాయంకాలమాదాక్షిణా
త్యేశు ల్పట్టుతొలంగి బోరగిలి సంధింపంగ రాకున్కి నా
వేశమ్మెల్లెదిలో నడంచుకొని నిర్వేదించు చిన్నెల్ధరా
ధీశాశోకుమనంబుఁ జొచ్చె రణముద్దీపించి జేజే యనన్. 214

ఉ॥ ఇంక గళింగ! గెల్తు, వసుధేంద్రునొనర్తు మహేంద్రు, నంత నా
శంకలుతీఱు, శత్రులకు శంకలుమాఱు, పరారుపోదు రీ
వంకకు రారు, వారి కనువాలకమయ్యది వేఱటంచు ని
శ్శంకలఁజూడఁ దోసలిపురాధిపుఁ డచ్చట లేక యుండినన్. 215

—♦ ఇంద్రవర్మ యెడఁబాటున నశోకుఁడు విచారపడుట. ♦—

ఉ॥ "ఎక్కడ కేఁగె వృద్ధధరణీశుఁడు లేఁడు మహేంద్రవర్మ, నే
నిక్కడియాహవక్రమము లెంచుచుఁ జూడఁగనైతి నక్కటా!
చిక్కెనొ శత్రుమూఁకలకుఁ, జెల్లునె యొంటిగ నేఁగ వృద్ధుఁడం"
చెక్కుడు చింతమున్గి తపియించఁగ నొక్కఁడు వచ్చి యిట్లనెన్. 216

మ॥ "రణధురంధరుండగు నిందువర్మ యట సంగ్రామంపు సంరంభులం
ఘనదుర్వార శరాహతిం దనుమ సంకల్పించి పోరంగ, దు
ర్జనులై యోధులు చుట్టుముట్టి పొడువన్ సంపాతముం జెందె, నా
తని ఘాతంబది తీవ్రమౌనని చికిత్సామగ్నులై రందఱున్. 217

చ॥ శిబిరముఁ జేర్చినంతఁ బరిశీలనచేసిన శల్యవైద్యులున్
"శుభకరమైన చిహ్నముల సూచనలెవ్వియుఁ దోఁచకుండె నం
చుఁబలుక, వేఁగఁబర్వులిడుచుం బరతెంచితి మీకుఁదెల్ప, దే
వ! బహుళతాపముల్గలఁచి వంతలముంచుచునుండె నాతనిన్." 218

ఉ॥ ఎంతటి వార్తయంచుఁ బరుగెత్తి యశోకుఁడు విన్నవెంటనే
"వింత యిదేమి! నేనెఱుఁగ, వింటిని నిప్పుడ" యంచుఁబల్క, న
త్యంతము దీనుఁడై పలుకులాడక తోసలిరా జశోకుని
న్వింతగఁ జూచుచుం గనుల వెంటను నశ్రులురాల సైగలన్. 219

ఉ॥ "నావిధి యిట్టులుండఁగ మనంబునఁ జింతయొనర్పనేల, యో
భూవర! కావుమయ్య! జనపూజ్యుఁడవై యిటనుండి రాజ్యముం,
గావుము నాగవల్లిఁ దగఁగైకొని" యంచు నిమీలితాక్షుఁడై
భావనసేయుచు న్విధినిఁ బాసెను జీవము శుద్ధమూర్తియై. 220

-♦ అశోకుని సైనికులు తోసలిపట్టణముఁ బ్రవేశించి జయముచాటుట ♦-

ఉ॥ భేరులు మ్రోఁగె నగ్గడలఁ బెల్లుగ రావము రేఁగె వేగ, దై
వాఱఁగ 'జై' నినాదములఁ దాండవమాడఁగఁ జొచ్చె సేనల
య్యారె! కళింగవర్మ దురహంకృతుఁ డొక్కనిమేషమాత్రలోఁ
బోరుతొలంగి పాఱెఁ దలఁపుల్తనకంటెను మున్నె పాఱఁగన్." 221

మ॥ అను కేకల్వినునంతలో నచటికిన్ హర్షంబు రేకెత్త బో
రని 'జై' నాదము నింగిఁ బ్రాఁక "మనసైన్యంబుల్ ప్రవేశించెఁ గో
టను" నంచున్ భటుఁడేగుదెంచి వెస నాట్యంబాడుచుం దెల్పి, యి
ట్లనియెన్ 'స్వామి! యరి ప్రతాపములు చల్లారె న్నిమేషంబునన్ 222

ఉ॥ నూనెలుకాచి పోసియు, ననూన బలంబుల నడ్డగించియుఙ్,
జాణతనంబుమీఱ బహుసంకట పాటులనొవ్వఁ జేసియుం,
బూనిక లేది. కాళులకు బుద్ధులు సెప్పెను శత్రుసేన లా
లోన గవాటముత్తెఱచి లోపలదూఱెను మీ జయధ్వనుల్." 223

గీ॥ అనుచు మరిమరి మురియుచు నాడుకొనుచుఁ
బలుకరించుచుఁ దనుదాన ఫక్కుమనుచు
నవ్వుకొనుచుండెఁ గేకలఁ గెవ్వుమనుచుఁ
బరిసరంబునఁ బ్రజనిల్వఁ బ్రతిమలట్లు. 224

చ॥ విజయమువార్త రాజునకు వేడుకఁగూర్చెనొ లేదొ కాని ది
గ్విజయముఁ గోరువాఁడగుట వేగమయేనుఁగు నెక్కిపోయె, నా
గజగజలాడు ఘోరనములు గన్గొనుచంతఁ గళింగమెల్లఁ ద
ద్విజయముఁగోరి మూఁగు పృథివీశుల, నెల్లరఁబట్టి కట్టఁగఙ్. 225

—♦ అశోకుఁడు కళింగమునఁ దన పరిపాలనము నెలకొల్పుట. ♦—

సీ॥ జయజయ పృథ్వీశ! జయసార్వభౌమయఙ్
విజయవార్తలు వేగ విస్తరింప,
గాళింగభూమి నల్గడల నశోకుని
ధ్వజపతాకములెల్లం దమ్ములీన,
వడివడిఁ గార్యతత్పరసూత్రనిర్మాణ
పరిణామములు పాఱికి పాదుకొనఁగఁ,
గార్యధురంధ్రుల నేర్పు కళకళలాడంగఁ
దీర్పులు దిద్దులు తేజరిల్ల,

గీ॥ పుణ్యపురుషుఁడు సమ్రాట్టు పూజ్యుఁడనుచు
రాజకీయులు కాళింగరాజ్యమందుఁ
గార్యగతులను జఱుకుగఁ గ్రమము పఱుపఁ
బాలనము సాగె నిర్బంధబంధ మెడలి. 226

ఉ॥ చక్కని పాలనం బచట సాగునటుల్వొనరించి, మీఁదటం
దక్కిన కార్యపద్ధతు లెదం దలపోయుట యుక్తమంచుఁ, బెం
పెక్కు నశోకభూపతి మునీంద్రుఁడుపోలె వినీతవేషుఁడై
చక్కఁగ నొంటి నిచ్చలును సందులు గొందులు సంచరించుచున్ 227

చ॥ తిరుగును రాత్రివేళలను దిక్కుతొలంగినవాఁడు పోలె, సం
గరమునఁ జచ్చులక్షల జగత్ప్రళయంబుఁ దలంచు, రాజశే
ఖరుఁడగు నింద్రవర్మ రణఘాతము మాటికి సంస్మరించు, వే
గరియటు పొంచిపొంచి కడకన్నులఁగాంచు విచారమగ్నుఁడై. 228

—♦ అశోకుఁడొంటరిగాఁ దిరుగుచుఁ బ్రజలభావము లరయుట. ♦—

చ॥ అతఁడు కళింగభూమి జయమందెనుగాని యదేమి చిత్రమో
సతతమునెద్దియో మదిని సంకటపాటు కలంచునట్టులం
గుతుకములేని వాఁడగుచుఁ గ్రుమ్మరుచుండఁగ నొక్కనాఁడు జీ
వితము నిరర్థకంబనఁగ వీనులసోఁకెను బల్కు లివ్విధిన్. 229

ఉ॥ "రాజులె వీరు భూమిజనరాశి వినాశకులైన వార లీ
యోజను మోజు దీర్చుకొన యుద్ధముపేర జగమ్ము నొంచి, ని
స్తేజమొనర్చి, కాల్చి, మసిచేసి, జయించిన లాభమేమి? స
ద్రాజినుతింప భూజనులు రాజిల రాజులుకాక పోదురే? 230

ఉ॥ కోటల దూఱి కోరి తమకుం బహుభంగుల సౌఖ్యసంపదల్
కూటికిలేని పేదప్రజ కూర్పు సుఖించుచుఁ గ్రొవ్వి మీఱి, యి
ప్పాటను యుద్ధరంగముల భార్యలు బిడ్డలు గోడుగోడన
న్నేటి ప్రజాళిరక్తముల మేదిని పాలొనరింపఁ బాడియే. 231

చ॥ తగవులు తీర్చి ధర్మపరతంత్రిత సౌఖ్యము శాంతిఁగూర్చి నె
వ్వగలు తలిర్పకుండఁ బగవారలు కాలిడకుండఁజూచి యె
ప్పుగిదిఁ బ్రజాహితంబెసఁగఁ బాయక యట్టి తెఱంగులెంచి, యీ
జగము నుతింప రాజగును జాణయనందగు పేరుఁ గాంచెడిన్. 232

ఉ॥ ఎందఱో రాజనామకుల నేలి రిలాతల, మందఱుం దగం
గొందఱుమాత్రమే మనము గూర్తుము కారణమేమొ కాన మా
కొందఱిలోన రామనృపకుంజరు ధర్మజుఁ బేరుకొన్న నా
నంద మదెందుకో జగమునం బరికింపఁగఁ జోద్యమయ్యెడిన్. 233

—♦ అశోకుని విచారము—పరివర్తనము. ♦—

చ॥ పలుకులు ముల్కులై యమితబాధలు పెంచఁగ, మున్నె చింతలం
గలఁగిన చిత్తమందు వడిగ న్నెయివోసిన యగ్ని చందమై
యలఁపఁగఁ గుంది యొంటిమెయి నంతిపురంబును జేరి నెమ్మదిం
దలఁపఁగఁజొచ్చె నిమ్మెయి నతండు విమోహితుఁడైన యట్టులన్. 234

ఉ॥ "నమ్మిన యింద్రవర్మయయినం గృతకృత్యుఁడు గాకపోయెఁ, గో
పమ్మున శత్రుమిత్రులు నభమ్ము శుభమ్మని లక్షలాది ప్రా
ణమ్ములఁ గొల్లఁబెట్టుచు రణమ్ములఁ బెక్కుర నేడిపించి, నే
నిమ్మెయి విఱ్ఱవీఁగి గడియించినదేమొ యెఱుంగనైతిఁగా. 235

ఉ॥ చేతులుకాళ్లు పోయి తమ జీవితము ల్కడనీఁద లేక, దు
శ్చేతనులౌ ధరాధిపుల చేష్టల దూఱుచు జీవితాంతమున్
వీతశుభోదయుల్జనులు వేఁగఁగ నిచ్చలు స్వార్థబుద్ధిచే
నీతికి బాహ్యులైన ధరణీశులు నింద్యులుగాక పూజ్యులే. 236

ఉ॥ ఎందఱో సాధువుల్బడమి నెందఱో విప్రులు సంగరమ్మునన్
మ్రందిరి నన్నుఁగూర్చి; యిది రాక్షసకృత్యమొ రాజధర్మమో
యిందఱు కుందుచుండఁ బృథివీశుఁడు పొందెడు లాభమున్నె, యే
మందము రాజనామమిది యందమె ఱాఁతియెడంద కీధరన్. 237

చ॥ చదువును శాస్త్రము ల్మత విచారమునల్పును విజ్ఞుఁ డయ్యెడుం
గొదవలు తీఱనన్యులకుఁ గొల్లగ బోధలు చేయుఁగాని తా
నదయత మానవావళుల నంజకకూల్చుట జ్ఞానిలక్ష్యమే
బుధుల విశేషవిజ్ఞతలు పూజ్యములే యిలనీతిమాలినన్. 238

చ॥ నరుఁడగుఁ బూజనీయుఁడిల జ్ఞానమె పూజ్యత కాకరంబు, వా
నరుఁడగు జ్ఞానహీనుఁడయి, జ్ఞానవిహీనుల జీవితమ్ములుం
బరువగు, శాశ్వతమ్మయిన భాగ్యము శాంతియ, దానికోసమై
గురువుల నాశ్రయింపనగుఁ గోర్కులు ద్రెంపక సౌఖ్యమున్నదే. 239

చ॥ వ్రతనియతాత్ములై ప్రకృతి వశ్యులుగాక విశుద్ధమూర్తులై
సతతతపః ప్రశాంతమతిసంగతులై యడవి న్వసించు నా
యతులకు లేనిదేమి? యరయం బృథివీశులకున్నదేమి? యీ
వితమున రాజసప్రకృతి విజ్ఞతఁబాసిన శాంతియున్నదే. 240

సీ॥ చిన్నారిపొన్నారి చిఱుత ప్రాయమునందుఁ
గన్నకలల్నేఁడు కన్నుఁగప్పఁ,
దండ్రితాతలనాఁటి ధర్మరహస్యమ్ము
మనమున గాఢమై మఱపుఁగొలుప,
బడిలోని చదువుల పరిపాటియంతయుఁ
బంతులయ్యాకెయంచు వింతఁదెలుప,
దుష్టేంద్రియ పరాప్తినష్ట విజ్ఞానమౌ
ప్రకృతి లోపలఁజొచ్చి బయలుగనక,

గీ॥ ఔర! యిందఱ ప్రాణాలు ధారవోసి
నేను గడియించునది యేమొ కాననైతి
భ్రాంతిమునిఁగిన ప్రకృతికి శాంతియున్నె
యుద్ధములు సేయనొల్ల దీబుద్ధియింక. 241

మ॥ అని నిర్విణ్ణ మనస్కుఁడై యతఁడు సన్యాసంబె క్షేమంకరం
బని లోలోపల నిశ్చయించి, యట నత్యంతాప్తుల న్నిల్పి, శా
సనబద్ధంబగు పాలనంబు జరుగన్ శాసించి, భ్రాంతిం దొలం
గ నుపాయంబుల రోయుచుంబరఁగె నాకాంతోపరీతాత్ముఁడై. 242

చ॥ నిలిచినఁ గూరుచున్నఁ దననెమ్మదినంటి కళింగయుద్ధ మా
కులమతిఁజేయు బాధలకుఁ గుందెడు మానవ రోదన ధ్వనుల్
నిలఁబడుఁ గంటిముందు, "నవనీశ్వర! ధర్మవె సాధు విప్లసం
చలనమట"ంచు మ్రోఁగు గ్రహచారము కారణమంచు దూఱుచున్

శా॥ చింతాబీజ మశోకరాజ హృదయక్షేత్రంబునన్నాటు కొం
చెం తేఁ బెద్దగ వృక్షమై పెరిగి తా నీలోక కాల్యాణి కా
త్యంతానందకరమ్ము ధర్మఫలముం దైవాజ్ఞఁ బండించె నీ
వింతంగాంచ విసమ్ములో నమృతముంబీజాకృతిం బొల్చెడిన్. 244

గీ॥ క్రీస్తునకుమున్న చరితప్రశస్తమైన
రెండువందల యరువదిరెండు వత్స
రంబులను సాగెఁ గాళింగరణము, మనసు
చెదరి యంత నశోకుఁడు చింతమునిఁగి. 245

గీ॥ జీవితావధి సమరంపుఁ జింతలుడిగి
ధర్మజయమే జయమ్మని ధరణినెల్లఁ
జాటియేలెను నేల భూజానిధర్మ
శాసనంబులు ఘనతను జాటిపొగడ. 246

చ॥ తనరె నశోకరాజు ప్రియదర్శియనంగఁ గళింగదేశముం
గొనుటయు నాదిగాఁ బ్రజలకుం బ్రియదర్శనమిచ్చు వాఁడునై
జనులొకలక్ష చావఁ, జెఱసాలల లక్షకుఁ బైననేడ్వ, సా
ధనమిదికాదు కావ, వరధర్మజయమ్మె జయమ్మటంచుఁదాన్. 247

చ॥ సచివులు ప్రోత్సహించినను జంపఁ డశోకుఁ డరణ్యవాసిదు
ష్టచయము శక్తుఁడయ్యు, మనసార్చఁగ దుష్టులువచ్చి వేఁడి రే
నుచిత విధిజ్ఞతం దనిపి, యుద్ధతివీడఁగ బోధచేసి, ప్రో
చుచుఁ గడుగారవంబడరఁ జూచెదనంచు వచించువాఁడహా. 248

చ॥ గడుసుతనంబుమార్చి, రణకాంక్షలు తీర్చి, కళింగయుద్ధ మ
ద్భుతముగ నడ్చి ధర్మబుద్ధిఁ గడునుజ్జ్వలమానటు పెంచి, నేఁటికిం
బుడమి నశోకరాజ్యమది ప్రాజ్యతమంబను పేరుఁబెంచె, ని
ప్పుడు మదిలోఁదలంపఁ దనువుల్పులకింపఁగ మానవాళికిన్. 249

ఉ॥ అంతట పాటలీపురమునందుఁ గళింగమునందు మంత్రులన్
సంతత ధర్మసంగత విచారపరాత్ములఁ నిర్ణయించి, ని
శ్చింతగ నాశ్రమస్థలి బుధేంద్రుల చెంతలఁ గొంతకాల మ
త్యంత సుఖమ్ముదారిఁ గనునాశలమున్గె నశోకుఁ డాత్మలోన్. 250

గద్య- ఇది శ్రీభారద్వాజ గోత్రపవిత్రాపస్తంబసూత్ర రాఘవా
చార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధ
కవితావిస్ఫురణ, సాహిత్య శిరోమణి, ఉభయభాషా
ప్రవీణ, కవిరాజ బిరుదాంచిత, కాండూరు నరసింహా
చార్య ప్రణీతంబైన యశోకరాజ్యంబను
చారిత్రిక ప్రబంధంబునందుఁ
ద్వి తీ యా శ్వా స ము
సం పూ ర్ణ ము



॥ శ్రీ రామచంద్రపరబ్రహ్మణేనమః ॥

# అశోక రాజ్యము.

## చారిత్రక ప్రబంధము.

### తృతీయాశ్వాసము.

శా॥ సత్యాహింసలు, శాంతిసౌఖ్యములు, సత్సాంగత్య సంపత్తియు
న్నిత్యారాధ్యములౌచు నల్గడల సందీపింప సత్కర్మముల్
ధృత్యుత్సాహతరంగముల్పొదల నోలింబోలికల్లేక, స
న్నుత్యంబౌచు వెలుంగు దేశములు ధన్యల్మాన్య లేపారఁగన్. 1

#### బౌద్ధమతము దాని వ్యాప్తి.

ఉ॥ క్రీస్తుకుఁ బూర్వమందుఁ బరికింపఁగఁ బంచశతాబ్దియందు, వి
శ్వస్తసమస్త ప్రాంతమయి ప్రాఁకెడు బౌద్ధమతంబు మాగధిం
బ్రస్తుతిఁగాంచు నార్యమతవైదిక మార్గము లడ్డగించుచున్
ధ్వస్తమొనర్పఁగాఁ దలఁచి తాండవమాడుచునుండె నెల్లెడన్. 2

గీ॥ ఆత్మపరమాత్మ విద్యల కాశ్రయంబు
వైదికోపనిషణ్మత వార్థికకట!
యడ్డుకట్టలు వేయంగ నడరి కడఁగి
పొంగె బుద్ధమునీందుని బోధలవని. 3

గీ॥ తండ్రితాతల యత్యంత ధర్మపరత
కాశ్రయంబయి వెలసిన యార్యమతము
పరఁగెఁ బుడమి నశోక భూవరున కపుడు
ధర్మపరతకు దూరమై త్యాజ్యమగుచు. 4

ఉ॥ సత్యసమాశ్రయం బుపనిషణ్మత మీశ్వరసాధకంబుగన్
సత్యమహింస కర్మపరిణామము సాధ్యముగా, నిరీశ్వర

ప్రత్యయ సాధకంబగుచుఁ బర్వెను బౌద్ధమతంబు, నేదియున్
స్తుత్యమ యానుగా, భువివిధుల్పరికించి సమాచరించినన్. 5

— అశోకుఁడు బౌద్ధగురువు నాశ్రయించుట. —

ఆ॥ గురువులేనివిద్య కొఱగాదు గావున
గురువుకొఱకుఁ దగిన వెఱవెఱింగి
యరిగెనపు డశోకధరణీశుఁ డడవికిఁ
దడయకాత్మనియత ధర్మమెఱుఁగ. 6

క॥ చేరి యుపగుప్తు సన్నిధిఁ
గోరిక శుశ్రూషసలుపఁ గొనకొని యచటం
ధీరత రెండున్నర యేం
డ్లారాధన సలుపుచుండె నరయుచు మతమున్. 7

క॥ ఉపగుప్తబౌద్ధ శ్రమణుఁ
డపవర్గపథమ్ము నరయ ననువగు వెరవుల్
కృపఁ దెలుపఁదొడఁగె నివ్విధి
నపవిత్రిత నతఁడు గొలువ సాధనపరుఁడై. 8

క॥ "పరుగెత్తువాని హృదయము
తిరమగు శాంతిం గనంగ దిట్టమె, వెరవుల్
పరిపరివిధముల నరయుచు
మురిపములకుఁ జోటునీక మొనసినఁ దక్కన్. 9

ఉ॥ కామపరీతచిత్తులయి గాఢతమస్సున మున్గువారలై
సీమములేక యొక్కమెయి, నింద్యమనింద్యమెఱుంగలేక, యే
మేమియొ యాచరించి పరికింపఁగఁజాలక పీతసత్త్వులై
"స్వామి! ప్రసాదము"న్న నది సాధ్యమె సత్యపథమ్ము పొందఁగన్ 10

ఉ॥ దేవుఁడు దేవుఁడంచు బహుదేశము లేఁగఁగవచ్చుఁ, బుణ్య తీ
ర్థావళి మున్గవచ్చు, సతతమ్మును గుళ్లకు మ్రొక్కవచ్చు, దు

ర్భావిత కామక్రోధములఁబాయక ముక్తియనంగ నెట్టిదో
నీవ విచారముల్ సలిపి నిశ్చయముం బరికించి చూడుమా! 11

చ॥ తపమొనరించి యింద్రియగతంబు జవంబడఁగింపఁ గల్గినం
గపటమడంచు నందనుకఁ గాయము మాడ్చిన లాభమేమి, ని
ష్కపటక్రియానిరూపకుఁడు, సత్త్వసమత్వ దయా పరిపూర్ణుఁడై
చపలత వీడువాఁడెగద సద్గతికర్హుఁడు భూమిలోపలన్!. 12

ఉ॥ కొంపలు ముంచుబుద్ధి, యొరుకూటికి నడ్డము సొచ్చుచింత వేఁ
గింపఁగ నన్యులం దఱిమి క్రించుఁ దనంబుల దుర్విచార, మా
సింపఁగ మోసపుచ్చుటఁ వచింపఁగరాని యనంత దుష్క్రియల్
చంపునెకాని దుర్జనుని సద్గతిఁ గన్గొన దారిఁజూపునే. 13

మ॥ సమరంబుల్పొనరింపఁ జూతు రతులైశ్వర్యంబుఁ గాంక్షించి, భూ
రమణుల్పొందెడు లాభమేమి, ధరణీ రాజ్యంబులం బెంచి మో
క్షము సాధింతురె, శాంతిగల్గునె దురాశాపూర్ణ చిత్తంబులన్
సమతల్బాసి దయావిహీనులయి దుశ్చారితుక్రిలాటే యగున్. 14

మ॥ విను నిర్వాణము జన్మలక్ష్యమగు నుర్వీనాథ! సంయోగ సం
జనితంబైన యనిత్యకాయమున నాసత్యంబు, నిత్యంబు, సా
ధన సాధ్యంబగు ధర్మకాయమును బౌద్ధమ్మైన జ్ఞానమ్మునం
గనఁగా నయ్యది లక్ష్యసిద్ధియగు, నికడంబైన యోగంబగున్. 15

గీ॥ నరులయందు 'నహా'మ్మను జ్ఞానదీప్తి
స్కంధపంచక సంయోగజనితమగును,
దాని సంబంధ మెడఁబాయు తరుణమదియ
మరణమయ్యెడునని నరు లరయ వలయు. 16

గీ॥ ఆత్మపరమాత్మలని యేల యడలుచుంట
పుణ్యపాపాత్మకమ్మైన పురుషకర్మ

చయమె మఱుజన్మ మందును జగతియందు
విత్తుచెడి పండులో జన్మమెత్తునట్లు. 17

గీ॥ మనుజులందును నిత్యమ్మె మానవత్వ
ముదియు సద్వృత్తిచేఁగాని పదిలపడదు
పాపకర్మంబు దుర్జన్మఁ బాయకుండుఁ
బుణ్యకర్మంబు పూజ్యతా పుట్టు వందు. 18

ఆ॥ సంఘజీవినరుఁడు సాంఘిక కర్మంబు
విజ్ఞతావిశేష విస్తృతంబు,
పశుతఁబాసి, పుణ్యపాప కర్మచయంబు
నరసి సంఘసౌఖ్యపరత మెలఁగు. 19

ఆ॥ సంఘదోషములకు సంఘమె హేతువు
చోరఘాతుకాది క్రూరులకును
దారిఁజూపు సంఘధర్మ లోపమ్ములె
సంఘ దుఃఖముక్తి సడలిపోవ. 20

సీ॥ వచనచతుష్టయ పరిపాటి గమనించి,
యష్టాంగ మార్గమ్ములరసి, నరులు
త్యాజ్యమ్ములను వీడి, తవిలి నివారించి
ప్రతిబంధదశకమ్ముఁ బ్రజ్ఞతోడ,
నాఱు నిబంధనా లరయుచు నామీఁద
నపరాధదశకమ్ము నంటుబాసి,
షడకృత్యముల మూలసార మాలోచించి,
సద్గుణాభ్యాసియై జగతియందు

గీ॥ సాంఘికుండయి వెదకుచు జ్ఞానగరిమఁ
గర్మనిత్యతఁ గనుఁగొంచుఁ గర్మపరత

నెమ్మి శాశ్వత ధర్మకాయమ్ము నొంది
వరలుచుందురు నిర్వాణ పదమునందు. 21

ఉ॥ మానవజాతియుద్ధరణ మానవ సంఘము తప్ప నీశ్వర
ధ్యానముకాని, జాతికృతధర్మ విభేదము కాని చేయ వ
జ్ఞానులు కార్యకారణ విచారవిదూర కుకల్పనమ్ముల
న్మానులు, మాయలున్, శ్రుతులు, మంత్రములన్న సహేతుకమ్ములే?

ఉ॥ యాగములందునేని పశుహానియు హింస యధర్మమై తగన్
భోగముకోసమై సమరభూములఁ జంపుట హింసకాదె, హా!
బాగుగ యోజచేసి పరిపక్వతనంది, స్వయంకృషి న్మదిం
జా గొనరింపరాదు సువిచారులు దుఃఖవిముక్తి నందఁగన్." 23

చ॥ అని యుపదేశమిచ్చి ముదమారఁగ బౌద్ధపుదీక్ష యిచ్చిన
న్వినయముతో నశోక పృథివీశుఁడు సాధనతత్పరుండు మే
ల్జనపతి నాఁగ నేలుచుఁ దలంచె మనంబునఁ దీర్ఘయాత్రలం
దన మునుకాంక్షలందొలఁగి ధర్మజయమ్మనె నిశ్చయించుచున్. 24

ఉ॥ భారతభూమినేని, పెఱవారల భూములయందునేని, నే
ధారుణినేని రాజప్రధానులు రాజులు జ్ఞానులౌట, ని
ర్ధారిత లక్ష్యముం దొఱఁగి ధర్మము మాత్రమె లక్ష్యమై తగం
ధీరత రాజ్యమేలుట మదిం బరికింప విచిత్రమయ్యెడిన్. 25

— అశోకుఁడు దేశదేశములకు బౌద్ధ ధర్మబోధకులఁ బంపుట. —

ఉ॥ ఇంటికివచ్చి దీక్షమెయి నేలుబడిన్ సవరించి, యంత ని
ష్కంటక సార్వభౌమత యెసంగఁగ యాత్రలు సల్పనెంచి, వె
న్వెంటనె బౌద్ధధర్మము భువిం బ్రతిదేశముఁ బ్రాఁకి పండఁగం
దంటల ధర్మబోధకులఁ దత్పరుఁడై నియమించెఁ బెక్కురన్. 26

ఉ॥ ఐదుగురైదుగురం గలిపి, యైదుర నొక్క ప్రధాన బోధకున్
సాదువు నిర్ణయించి, మనసారఁగ నొక్కొక దేశమేఁగి శా

ద్ధోదని ధర్మపాలక విభులెవ్వఁడఁ జల్లుచుఁ జాటఁ బంచె, న
య్యెడ దిశలందు బోధితరు వల్లుకొనంగఁ బ్రబోధ శాఖలన్. 27

సీ॥ ఆయతసంఘమ్ము లధిక కౌతూహలా
యత్తమై మొత్తమై చిత్తగించి,
సింహళమ్మ, స్వతంత్రసీమలు, దక్షిణ
ప్రాంతమ్ములకుఁ బ్రాఁకి పాదుకొనఁగఁ,
గాశ్మీర, హిమవంత, గాంధార, మహారాష్ట్ర,
పైగొ, బొంబాయియన్ ప్రాంతములకుఁ
ఈజిప్టు సిరియాల, కెపిరసు, క్రైరీను
మాసడోనియ దేశవాసములకు

గీ॥ ప్రాఁకి బుద్ధుని సందేశవాగ్లతాళు
లను దినంబును నల్లికల్లొనుచుఁ బెరుగ
మొగ్గ దొడుగుచుఁ బుష్పించి ముదముఁగూర్పఁ
బండ్లు పండుచునుండె నాప్రాంతములను. 28

## —♦ అ శో కు ని రా జ్య పా ల న ము. ♦—

ఉ॥ పట్టముఁ గట్టుకొన్న పిదపం బదునేడవయేటినుండి, యా
దిట్ట యశోకరాజు తనదేశము దీక్షితుఁడౌచు నేలె, సం
ఘట్టిత ధర్మశాసనముఖమ్మున ధర్మజయమ్ముఁ గోరుచున్
"వట్టి పురాణగాథల"ను వాక్కుల కందఁగరాని భద్రతన్. 29

ఉ॥ చెప్పెడి వాఁడెకాక తనచెప్పిన యట్టుల చేయువాఁడునై
తప్పక చంద్రగుప్త వసుధావరుపాలన పద్ధతు ల్మదిం
గొప్పగుణంబునూని తనకుం గఠినమ్ముగఁ దోఁచు వానినిం
జొప్పడ సంస్కరించుచు వసుంధర నేలెను మార్గదర్శియై. 30

సీ॥ రాజపుత్రులుగాని, రాజబంధులుగాని
ప్రతినిధుల ప్రాంత ప్రాంతములకు,

ధరణిఁ బ్రఖ్యాతమౌ తక్షశిలాపురిఁ
బ్రతినిధియొక్కండు పాలిచనేల,
ఉత్సాహి జనతాంచితోజ్జయినీపురి
నొక్కండు ప్రతినిధి చక్కఁబఱుప,
ధూర్త జనాకీర్ణ తోసలిపురమందుఁ
బ్రతినిధి దిట్టయై పదిలపఱుప,

గీ॥ స్వర్ణగిరియందు నొక్కండు వరలుచుండఁ
దాను తక్కిన రాజ్యంబు ధర్మపరత
రాజకీయుల నియమించి భ్రాజితముగ
నేలుచుండె నశోకుఁ డుర్వీశుఁడపుడు. 31

చ॥ ప్రతినిధి యాజ్ఞలో మెలఁగి రజ్జుకులుం, దమక్రింది సేవకుల్
సతతము ధర్మబద్ధులయి చాతురి రాజ్యము నేలుచుండి రా
యతమతులౌచు రాజనియమాను సృతిం బ్రజకెల్లవేళ, సం
స్తుతమతియైన బుద్ధముని సూక్త రహస్యము బోధసేయుచున్. 32

మ॥ పరఁగన్మండల కార్యనిర్వహణముం బ్రాదేశికుల్సల్పఁగం
బరువౌదండన కర్మకాండము మహామాత్రుల్సమర్థింప, సం
సరణ ప్రాయములైన కార్యగతులన్ సాంకేతికుల్తీర్ప, ని
బ్బరమైసాగె నశోకరాజకృత సత్ప్రారంభముల్మాగధిన్. 33

ఉ॥ తాత కుదిర్చినట్టి వసుధాపరిపాలన దక్షశిక్ష, దీ
ప్తాతతబుద్ధియై కడఁగి సంస్కరణంబు లొనర్చి కొన్ని, ధ
ర్మాతత కార్యనిర్వహణ మగ్నని యోగుల నిర్ణయించి, స
త్యాతిశయంబు, ధర్మవిజయంబును జాట విధించె నంతటన్. 34

ఉ॥ దోసము నిర్ణయించి కడుదూరపు యోజనచేసి, యర్థ వి
శ్వాసముతోడ శిక్షల నొసంగును, వృద్ధుల కష్టపాటులన్

వ్రాసి క్షమించు, నష్టులనె భారములైన కుటుంబబద్ధులం
దోసము లర్వ్వామానెడల, దుష్టులు హింసకుఁ బూనకుండిరన్. 35

ఉ॥ ప్రాంతపు బస్తులందుఁ దనపాటలియందు వసించునట్టి శు
ద్ధాంతపు స్త్రీల సేమము లతండ్రిఁగూర్ప నియుక్తులందె సి
ద్ధాంతముసేయ, వారు తమ ధర్మముతోడుత రాజురాణులే
కాంతపు బంధువర్గముల కార్యములం బచరింత్రు నెమ్మదిన్. 36

ఉ॥ స్త్రీలకునై యశోకవసుధేశుఁడు గూర్చెను స్త్రీనియోగులన్,
స్త్రీల యధర్మవర్తనల స్త్రీలె విచారణసల్పి, ధర్మ స
త్త్యాలను బోధచేసి, తమ ధార్మికవృత్తి నివేద కాధికా
ర్యాళికిఁ దెల్ప, వారు పయిరాజనియుక్తుల కెఱుకసేయుచున్. 37

గీ॥ అన్నియుద్యోగశాఖల నరయుకొఱకు
వేలువేలుగ నుద్యోగి వితతిఁగూర్చి
లోపమెచ్చటనున్నను రూపుమాపి
పుడమినేలె నశోకుఁడు పూజ్యుఁడగుచు. 38

చ॥ తలఁచెను ముఖ్యకార్యముగఁ “దానెప్పుడైనను నెంతనైన వి
చ్చలవిడి విన్నపంబుల విచారణసేయుట”, యెవ్వఁడేని నే
తలమునఁగాని రాజవరు దర్శనభాగ్యము నందవచ్చు, భూ
తలపతి యాలకించును సదా సులభుండయి మానవాళికిన్. 39

మ॥ తనయుద్యోగుల ధర్మపాలన విధాతంత్రింబు లందింపఁ, జ
క్కని యుద్యోగుల లేఖకప్రవరులం గల్పించి, రాజ్యంబునం
దునఁ బాశ్చాత్యుల భంగిఁ బత్రికలయం దువార్తలం గాంచి, నె
మ్మనమందుం బరికించువాఁడు దిశలం బాగోగులన్నిచ్చలున్. 40

గీ॥ నగరపరిపాలనంబు సైన్యంపు రక్ష
తాతకాలమునాఁటి పంథాన నడువ

మున్నవోలెను సైన్యంబు మొనసియుండె
నింత యెక్కుడు చతురంగ మేరికనఁగ. 41

గీ॥ తక్క పరిపాలనంబునఁ దాత దారి
ననుసరించె నశోకుఁడహో యనంగ
నింతకంటెను స్పష్టమా నిద్ధచరిత
కానుపించదు వివరింప దేనఁగాని. 42

గీ॥ చంద్రగుప్తుని శిక్ష ప్రచండమగుట
నుంత సవరింపఁదలఁచి యశోకుఁడంత
మరణదండన విధియందు మానవులకు
మూఁడుదినముల విశ్రాంతి పొనరఁజేసె. 43

గీ॥ దూరదేశమ్మునందుండి పాఱుకాల్వ
నీరు వరిపైరులకుఁ బెంపుఁ గోరుచుండె
ననుట యొక్కటి స్పష్టమై కనఁగనుండె
రుద్రదా మను శాసన భద్రగతిని. 44

గీ॥ శిల్పిజనమును మక్కువఁ జేరఁదీసి
రక్షసేసిరి మౌర్య సమ్రాట్టులపుడు
వారి కెవఁడేని నేదేని బాధఁగొలుప
వాని కురిశిక్ష విధియించు వారలగుచు. 45

గీ॥ చేయిగన్నుల కెవఁడేని చెడుపుసేయ
వాని యవయవచ్ఛేదంబె వారి శిక్ష
ఘోరమగు తప్పులెవ్వరేఁ గోరిచేయఁ
దలను బోడించి త్రిప్పుటే ధర్మదీక్ష. 46

ఉ॥ పట్టము జర్గనాఁడు ప్రతివత్సరమందు మహోత్సవంబు, జే
పెట్టఁగ సాగుచుండుఁ, గడువేడ్కమునుంగు నశోకుఁడుం జెఱం

బెట్టిన వారినెల్ల విడిపించుట వాడుక, వాఁడి కొఱ్ఱుపైఁ
బెట్టఁగనున్న వారలకు విశ్రమమయ్యెను మూఁడునాళులే. 47

ఉ॥ అప్పటి దేశకాలముల కర్హమునౌనటు తీర్పు చెప్పుచుం
దప్పక బౌద్ధసూత్రములఁ దాను స్వయమ్ముగ నాచరించువాఁ
డొప్పె నశోకభూపతి సముజ్జ్వలతేజుఁడు దీక్షితాత్ముఁడై
యెప్పటికేని శ్లాఘ్యుఁడతఁడే యని భూతలమెల్ల మెచ్చఁగన్. 48

గీ॥ తల్లిదండ్రులఁ బూజించు ధర్మబుద్ధి
పెద్దలను గారవించెడు ముద్దుపలుకు
పశువులనునేని హింసింప వదలుకొనుట
పరుల కుపకారబుద్ధినై వరలుచుంట. 49

గీ॥ సత్యవచనమ్ము పలుకుట, సర్వజనులఁ
బ్రీతిఁగాంచుట, సమబుద్ధిఁ బెంచుకొనుట,
కామక్రోధమ్ములడఁచి దుఃఖమ్ము విడుట
ప్రజకు బోధించు ధర్మమైవరలె నపుడు. 50

సీ॥ ఆయాసములఁబాపు ఛాయా ద్రుమమ్ముల
యందచందమ్ముల పొంది కలర,
ఆతిథ్యములకు రమ్మను కుల్కులను జిల్కు
ఫలవృక్షరాశి సౌభాగ్యమడర,
స్నానపానీయ విశ్రాంతి సాధకమంచు
తెరువులబావుల తీరు తెలుప,
రాచబాటలయందు రాజమానంబులు
విడిది గృహాల్చలివేంద్రలమర,

గీ॥ మూలమూలల నౌషధ మూలికలను
బెంచు తోఁటలు, బాటలు, పేటలడర

జంతుమానవ పశువైద్యశాలలెంతో
చాటుచుండె నశోకసమాత్రిటు ప్రతిభ. 51

చ॥ పశువులు మానవుల్ తనకు బంధువులంచుఁ గుటుంబమంచు, సా
తిశయముగాఁగ సౌఖ్యము ప్రతిష్ఠితమౌనటు ధర్మసూత్రముల్
దిశలను మ్రోఁగుచుండ నవలీల జనాళి కృపాళువై మది
న్విశయముఁ బాసియేలెఁ బృథివీశుఁ డశోకుఁడు నిశ్చలాత్ముఁడై. 52

చ॥ చతురత రాజకీయ పరిషత్తులయం దధికారివర్గము
ల్మతము సమస్తమానవ సమాజముకై కొన బోధచేసి, స
మ్మతములెఱుంగ సాధకసమాజముల న్నెలకొల్పి, యందుకై
చతురనియోగి బృందము విచారణసల్ప విధించె నెల్లెడన్. 53

ఉ॥ మాటను మీఱలేక యభిమానముతోడను నాగవల్లి న
ప్పాటను బెండ్లియాడి బహుభంగులఁ దోసలి నిల్పఁజూచె, నా
నాటికి రాణియై వరల న్యాయ్యమటంచు వచించెఁగాని, య
ప్పాటలగంధి పాటలిని భర్తకుఁ దోడుగదీక్షఁ గైకొనెన్. 54

చ॥ ఇరువురు ధర్మదీక్షఁ బ్రకటించిరి నాఁడుదొడంగి రాజ్యముం
బరమపదంబుచేసి బహుభాగ్యసముద్ధతి సౌఖ్యసంపదల్
వరలఁగ ధర్మశాసన శిలాఫలకమ్ములు స్తంభశాసనాల్
పరమకృపాపరుండు జగబంధు వశోకుఁడటంచుఁ జాటఁగన్. 55

## —♦ అశోకుని శిలాస్తంభశాసనాదులు. ♦—

### — మొదటి శిలాశాసనము. —

చ॥ ఇది ప్రియదర్శిరాజు ప్రకటించిన ధార్మికశాసనం, బిదే
మొదలుగ రాజధాని నిఁకముం దెవఁడైనను జీవహింస నే
యదనునఁగాని, జాతరలయందునుగాని యొనర్పరాదు, దు
ర్మదులగువారు సల్పెడు నమంగళకార్య ఫుటుత్సవంబులున్. 56

ఉ॥ ఇంతకు మున్నువోలె నిఁక నెన్నఁడు నేనియుఁ బాకశాలయం
దంతము లేని జంతువుల వ్యంజనహేతువుగా వధింపరా
దంతియగాక, నేఁడు మొదలాఁకటికై యొకజింక నేని భూ
కాంతుని వంటశాలఁ దమకంబునఁ జంపఁగరాదు వంటకై. 57

—♦ రెండవ శిలాశాసనము. ♦—

సీ॥ ప్రాజ్యమానాదు సామ్రాజ్యమందునె కాక
సిరియాను, కేరళ, సింహళముల,
సత్యపుత్రి ప్రదేశమ్ములైన, నటువోలె
పాండ్యచోళములన్న ప్రాంతములను,
నా యభిలాషమై నరులకుఁ, బసులకుఁ
గాయచికిత్సలు కడఁక జరుగు,
సకలప్రాంతముల నౌషధమూలికలు నాటి
పెంచుచుందురు ప్రీతి నంచితముగ,

గీ॥ రాచబాటల కిరువంక భ్రాజితముగ
సరవిపశువుల నరుల విశ్రాంతికొఱకు
బావులను త్రవ్వి చెట్లు సంభావితముగ
నాటఁజేసితి సుఖము నానాఁటి కడర. 58

—♦ మూడవ శిలాశాసనము. ♦—

చ॥ పొలుపుగ గద్దెనెక్కు పదుమూఁడవయేటను "నైదువత్సర
మ్ములకొకసారి నాగరకముఖ్యుల రజ్జుకులాది రాజకీ
యుల పరిషత్తుఁగూర్చి, విధియుం గనుఁడంచు, విధానసూత్రమం
దలిపని బుద్ధదేవుని ప్రధానరహస్యము బోధసేయుఁడీ! 59

క॥ జననీజనకుల మిత్రుల
ఘనమతిబంధువుల విప్రగణముల మునులకా

వినయము గౌరవమడరఁగఁ
గనుఁగొను చమిత వ్యయంబుఁ గఠినపుఁ బలుకుల్. 60

క॥ మానుట యొప్పగునంచును
నీనియమము లెఱుకపఱుపుఁ డెల్లర కిది నా
యానతి యని బోధించుచు
దానినిఁ బ్రియదర్శి శిలలఁ దద్ద లిఖించెన్, 61

—♦ నా ల్గ వ శి లా శా స న ము. ♦—

ఉ॥ చక్కని జీవజంతువులఁ జంపుట, భిక్షుకబంధు విప్రుల
న్మక్కువ నాదరింప కవమానము సేయుట, వాడుకయ్యెఁ, బెం
పెక్కు నశోకరాజ్యమున హింసలు చెల్లవు, ధర్మభేరి న
ల్దిక్కుల మ్రోఁగుచుండ, విహరింపఁగ బుద్ధుని సత్యవాగ్భటుల్. 62

క॥ అరుదుగ నుత్సవ రథములు
కరిఘటలును, దీపపంక్తి కన్నుల పర్వం
బరుసముఁ గూర్పఁగ జరుగును
తిరముగ నరు లుత్సవములఁ దృప్తి పడంగన్. 63

సీ॥ చాలకాలమునుండి జరుగు దురాచార
హింస లశోకున కించవింక,
చుట్టాల, విప్రుల, సారిది భిక్షుకకోటిఁ
దల్లిదండ్రులను బెద్దలనుఁగన్న
వినయ విధేయతల్ వృద్ధిఁ గాంచుచునుండె
ధర్మవికాసంబు తనరుచుండె
భక్తినీతులతోడఁ బరఁగి పుత్రపౌత్ర
వంశముఁ బెంచుత బౌద్ధసూక్తి

గీ॥ ధర్మమభివృద్ధిఁ జెందించు తలఁపుమేలు
నాశపఱుచుట నరులకు నయముగాదు

ప్రచురణాచరణంబులఁ బ్రేక్షఁగాంచు
ననుచుఁ బ్రకటించెఁ బ్రియదర్శి జనవిభుండు. 64

## ఐదవ శిలాశాసనము.

ఉ॥ సన్నుతమైన సత్క్రియ యసాధ్యము, సాధ్యము పాపకార్య, మ
భ్యున్నత సత్క్రియాపరుఁడు పూజ్యుఁడు, నేను ననేక సత్క్రియ
లున్నఁగ నాచరించితి శుభంకర మంచును, పుత్రపౌత్రులు
న్నన్నమదిం దలంత్రు కరుణాభరణాచరణాత్మతత్త్వులై. 65

చ॥ కడచిన కాలమందుఁ గడఁకం బుడమి న్వర ధర్మబోధకై
ఱొడయనిచేత నెచ్చట నియుక్తులు లేరు, ప్రజాప్రబోధకై
కడఁగితి రాజకీయుల ముఖంబున ధర్మపథమ్ముఁ జూపఁగం
బుడమి సమస్తజాతుల జనుల్ సుఖమందుట నాతలంపుగాన్. 66

గీ॥ యవన గాంధార కాంభోజ భువనములను
రాష్ట్రికుల భూమి, పైటీని ప్రాంతమందుఁ
బ్రజలు తెలివొంది సౌఖ్యసంపదలఁ గులుక
ధర్మబోధకు లెవ్వేళఁ దనరుచుంద్రు. 67

ఉ॥ పేదలు భాగ్యవంతులును విప్రులు వృద్ధులు సేవకు లనదా
మోదముఁ జెంది సౌఖ్యముల మున్గి తరింపఁగఁజేయు కోసమై
భేదములేక యొండొరులు ప్రేమఁదలిర్పఁగ, సేమమంద, శౌ
ద్ధోదని సత్యమార్గపు విధు ల్వివరించఁగ నిర్ణయించితిన్. 68

తే॥ అక్రమంబునఁ గారా గృహప్రవేశ
మక్రమంబగు, శిక్షల నడఁచు కొఱకు
బహుకుటుంబిని నాపదఁ బడినవాని
వృద్ధు క్షమియించి విడువ నావిధులు పొదలు. 69

తే॥ పాటలీపుత్రమందును బ్రాంత పట్ట
ణముల యందును బంధువర్గములఁ గూర్చి

సోదరీసోదర స్త్రీల సుద్దిఁగూర్చి
యరయ నుద్యోగులుంచు నాయాజ్ఞఁజేసి. 70
గీ॥ రాజ్యమందెల్ల బుద్ధ ధర్మప్రబోధ
దృఢమనస్కులు ధార్మికు స్థిరము కొలిపి
దాతలనుగూడి మెలఁగుట ధర్మమనుచు
శాసనంబునఁ బ్రియదర్శి వ్రాసియుంచె. 71

—♦ ఆఱవ శిలాశాసనము. ♦—

సీ॥ దీర్ఘకాలమునుండి తీర్పులు సరిగావు
వార్తలు చేరవు ప్రాంతములవి,
అంతిపురమ్మున నన్నము తినువేళఁ
బడకటింటను నున్న, బండిమీఁదఁ
బోవుచుండిన, ధర్మబోధలందుండిన
నేకాలమందైన నెందునైనఁ
బ్రజలనుగూర్చిన వ్యవహారములఁ దెల్ప
నుద్యోగులకు నాజ్ఞనొసఁగుచుంటి
గీ॥ కాలహరణంబు సరికాదు పాలకునకుఁ
బ్రజలకొఱకేను, బ్రజలేను, ప్రజకుఁగాను
సిద్ధపడియుందు వినుటకు; బుద్ధిఁదెలిసి
తీర్పుచెప్పుట నావిధి యోర్పుతోడ. 72
సీ॥ దానమిచ్చితినంచు, ఆనఁజేసితినంచు
నొప్పగించితిని నుద్యోగులకని
యొప్పురికించుట తప్పుసేయుటెగాని
పరికింపకుండినఁ బనులుగావు,
నాయాజ్ఞఁజెల్లింప మాయావివాదము
లమితగురువులయందు మలయునేని

కాలంబు దేశంబు గణియింపక వ్యాపృత
లప్పుడ తెలుప నాయాజ్ఞయగును,

గీ॥ నేను పడుచున్న శ్రమలోనఁ గానఁదృప్తిఁ
బ్రజలమేలున కై యెప్డు పాటుపడుదు
నదియ లక్ష్యము జీవితమందు నాకుఁ
గొందఱైనను సుఖియింపఁ గందురంచు. 73

గీ॥ ప్రజకు సేమంబుఁ గూర్చుట శ్రమయగాని
యంతకంటెను మేలగు నదియులేదు,
గాన నా పుత్రపౌత్రులు పూనికొలువఁ
దలచి లిఖయింతు శాసనశిలను నేను. 74

## ఏడవ శిలాశాసనము.

చ॥ తలఁచెద నెల్లెడం బలు మతమ్ములవారు వసింపనేను, వాం
ఛలు తలఁపుల్మనుష్యులకుఁ జక్కఁగ నిల్కడఁజెంది యుండ వి
య్యెల నమలంపుమానసము నింద్రియనిగ్రహముం గృతజ్ఞత
ల్గలిగి చరించుమానవులు గణ్యచరిత్రుల యీఁగిలేకయుᳵ. 75

గీ॥ పరఁగ నన్యమతంబులవారు కొంద
ఱాజ్ఞఁ జెల్లింపఁగంటి నాయాప్రదేశ
ములను, నింద్రియ నిగ్రహమును వరించి
మానసంబున నిర్మల జ్ఞానమెంచి. 76

## ఎనిమిదవ శిలాశాసనము.

చ॥ మునుపటిరాజు లెల్లపుడు మోహపరీత వినోదలోలురై
యనయము నుత్సవంబులను హర్షములందుచు నుండ్రిగాని, య
ప్పుని కొఱగామి బుద్ధమునిపావన ధర్మరహస్య మార్గముం
గని పరమార్థచింతకుఁడు జ్ఞానియునయ్యె నశోకుఁడెంతయుᳵ. 77

ఉ॥ అందున ధర్మయాత్రలను నాత్ఁడు సల్పఁగఁగల్గె, భిక్షులం
గ్రందుగ బ్రాహ్మణోత్తములఁగాంచె, మహాత్ములఁజూడఁగల్గె, సం
దందుల స్వర్ణదానము మహాత్ముఁడు చేసెను, జూచె రాజ్యమిం
పొందు ప్రజాళి, బుద్ధముని యూర్జిత ధర్మరహస్య కాంక్షులై. 78

—♦ తొమ్మిదవ శిలాశాసనము ♦—

ఉ॥ పిల్లలు పుట్టినప్పుడును, పెండిలివేళఁ, బ్రయాణమందు, సం
ధిల్లఁగ రోగము ల్వసుమతిం బ్రజపెక్కు సమాచరించు, నా
యెల్లపనుల్తలంచి పరికించిన సంకరము ల్విరుద్ధముల్
కొల్లఁగనిట్టి కార్యములకు న్మనుకొందురు పల్లవాధరల్. 79

సీ॥ ఫలమున్న లేకున్నఁ బనికిమాలినవన్న
నాచారములవీడ నాసఁగొనరు,
కాని, ధర్మాచారమూని సల్పిన నందు
మానితమా సత్యమార్గమడరు;
జీవనమునుగాంచి సేవకులను బెంచి
బానిసలనుగాచి, బ్రాహ్మణులను,
భిక్షుకగురువులఁ బ్రేమించి పూజించు
ధర్మమాచారమై తనరుచుండు,

గీ॥ తండ్రికొడుకులు, యజమాని, తనరుమిత్రుఁ
డరయ సోదరుఁ డవ్విధిఁ బొరుగువార
లెల్లరును యోగ్యమనియెంచి, వెల్లడించి
చేయవలె ధర్మసంకల్పసిద్ధి వఱకు. 80

గీ॥ బహువిధంబగు నాచారపద్ధతులును
సంశయాస్పదమై ప్రపంచంబునందుఁ
జేయవచ్చును సంకల్పసిద్ధినేని,
మానవచ్చును నభిలాషమాత్రమేని. 81

కాని ధార్మికమాచార మూనిచేయఁ
జేయలేకున్న సంకల్పసిద్ధి యిచటఁ,
బూని లోకాంతరమ్మైననేని విడక
శాశ్వతమ్మగు పదము నొసంగఁగలదు. 82

ధార్మికాచారపరునకుఁ దనరు రెండు
ఫలము లయ్యవి సంకల్ప ఫలసుసిద్ధి
పుడమి, లోకాంతరమ్మైనఁ బూజ్యపదము,
శాశ్వతమ్మయి వెలయు విశ్వాసికెపుడు. 83

—♦ పదియవ శిలాశాసనము. ♦—

ఉ॥ నమ్మతి నామనమ్మైన ఘనమ్మగ బుద్ధుని సత్యసూక్తుల
న్నమ్మెడుదాఁకఁ గీర్తియు, ననంతపరితాపము, కార్యలాభము
ల్వమ్మగు వర్తమానమున, భావినిఁ; గావున బౌద్ధధర్మ త
త్త్వమ్మును బోధచేయుచుఁ బరితాపముఁగీర్తినిఁ బెంపుసేయఁగన్. 84

గీ॥ అల్పునకునైన నధికునకైన జగతి
నధిక వైరాగ్యమున ధర్మవిధినిఁ దప్పఁ
బాపరహితము జన్మమ్మె పడయు టరిది
పెద్దదశయున్నఁ గలుగునె పెద్దజన్మ. 85

—♦ పదునొకండవ శిలాశాసనము. ♦—

ఉ॥ దానములేదు శాక్యముని ధర్మపరిదానముఁ బోలునట్టిదేఁ
గానను, ధర్మసఖ్యమునకై సరిపోయెడి చెల్మి, ధర్మముం
బూనికఁ బంచిపెట్టు విధిఁబోల దొకండిల, ధర్మబంధు తా
జ్ఞాన సమానమై పరఁగుజ్ఞానముఁ గానను నెందుఁ గాంచినన్. 86

క॥ ఎవఁడీలోకమునందున
నవనీసురులాది గౌరవాస్పదులను సం

స్తవనీయ విధినిఁ గాంచును
దివమున నతఁడొందు నమిత దివ్యపదంబుల్. 87

—♦ ప ం డ్రెం డ వ శి లా శా స న ము. ♦—

చ॥ మతముల నేవగించు టవమానము సేయుట గొప్పతప్పు, స
న్మతిమెయి నన్యదీయ మతమారసి, సారముఁగ్రోలి, ధర్మ సం
గతులయి యాచరింపఁ గొఱగాక విడంబనవృత్తు లైనచోఁ
గుతుకముతోడి దానములు కూర్చునె సద్గతిఁ బెంపుఁబెంచునే. 88

మ॥ మతధర్మమ్ములు పెక్కులై వరలుచు న్మాన్యంబులైయొప్పు, స
మ్మతిలేకుండిన మానముద్రిఁ గొనుచు న్మన్నించుటే యుక్త, మ
ల్పతకుం దోసిలియొగ్గి హీనపఱుపం బ్రావీణ్యమే, ధాత్రి దు
ర్గతిఁ బొందించుటెగాక స్వీయమతముం గాపాడుటే యారయన్. 89

ఉ॥ ఏమతమైనఁగాని పరికించి రహస్యమెఱింగి శ్రద్ధతో
నోముచు వృద్ధిచేసికొనుచుండుటె నాయభిలాష, యారకే
సీమములేక డంబములనిక్కుట, పైపయితళ్కు గౌరవం
బీ మహిఁజెల్ల నేరదనియెంచి, గడించి, తరించ నెంచితిన్. 90

ఉ॥ దానములెన్నియేని ప్రియదర్శి యొసంగును, గౌరవించు స
న్మానముతోడ భిక్షుకుల, జ్ఞానముతోడ గృహస్థులన్, సదా
మానము ధర్మమూల, మవమానముచేటుకు దారి, యందుచే
మానవసంఘ మున్నతియు మానినులం దెలుపన్విధించితిన్. 91

—♦ ప ద ము మూఁ డ వ శి లా శా స న ము. ♦—

సీ॥ ప్రియదర్శి ప్రభువు తాఁ బృథివిఁ బాలించెడు
తొమ్మిదేండ్లను గళింగమ్ము గెలిచె,
ధర్మజయమ్మయి తనదు రాజ్యంబున
నాలుగునూర్యోజనాల్పుద్దార మందుఁ,

బౌరగు రాజ్యములందు సారిది వ్యాపించెను
రాజచతుష్టయ రాజ్యములను,
దక్షిణమ్మునఁ జోళధరణి, సింహళమందుఁ
యవన, భోజకళింగు, లాంధ్రజనులు,
గీ॥ పిటినిక పుళింద జనులును బ్రీతిఁ గొలిచి
బౌద్ధధర్మావలంబులై ప్రబలుచుండ
నవలిదేశమ్ములకుఁ బ్రాఁకి యాశఁగొలిపి
ప్రబలుచుండెను బౌద్ధ ధర్మప్రబోధ. 92
సీ॥ ఎల్లెడ వ్యాపించి యిద్ధ ధర్మజయమ్ము
సతతసంతోష సంతతి యొసంగెఁ,
బరలోకసాధన పరమగు నందాఁక
నానందమిది నాకు నందగింప;
దిందునిమిత్తమై యీధర్మశాసన
మిందు లిఖించితిఁ బొందు పడఁగఁ,
బుత్రపౌత్రులు వంశభూపతు లిఁకమీఁద
నధిక రాజ్యాకాంక్ష నందకుంద్రు,
గీ॥ యుద్ధములజోలిఁ బోకుందు; రుద్ధతులయి
పోయిరేనియు శాంతి యోర్పులను గలిగి
యుభయతారకమౌ మార్గ ముత్సహించి
పొందెదరుగాక ధర్మ ముప్పొంగుచుండ. 93

## —♦ పదునాల్గవ శిలాశాసనము. ♦—

మ॥ ప్రియదర్శి ప్రభుఁ డందునందు లిఖియింపించెఁ శిలాశాసనాల్
దయతోఁ బౌరులు ప్రీతిఁగైకొనుచుఁ దత్తద్దేశవా సుల్మహా
జయముం గొందురటంచు, వ్రాసినదె యుత్సాహంబు నన్మాటికిం
జయమౌ బుద్ధమునీంద్రసూక్తి కనుచుఁ సాంద్రాదరోద్దీప్తుఁడై. 94

గీ॥ జగతిఁ దనరాజ్య మధిక విస్తారమంది
యొకట నుపయోగపడునది యొకటఁగాక
యుండు కతమున వెవ్వేఱు మండలముల
బహువిధంబుల శాసన ప్రతతి పెరిగె. 95

—♦ రెండవ కాళింగ శాసనము. ♦—

ఉ॥ ప్రాంతపు రాష్ట్రపౌరులకు రాజనియుక్తులు బోధసేయ, న
త్యంత ప్రియాళువౌ ప్రభువునాజ్ఞ వినుం డిది "నామనంబునం
దెంతయుఁ బ్రీతిఁగొందుఁ బరికించుచు నాయభిలాష తీర్పఁగం,
బంతముఁబట్టిచేయఁగ 'సమాప' నియోగులకెల్లఁ దెల్పుఁడీ! 96

ఉ॥ బిడ్డలు నాకు నాప్రజలు, బిడ్డలుపోలె సుఖంబులంద నా
దొడ్డ ప్రతిజ్ఞగా నెఱుఁగుదు న్మఱి 'ప్రాంతర' దేశవాసులుం
గ్రుడ్డితలంపుల న్విడిచి కూర్మిసుఖింతురు, నమ్మి చేకొనం
బడ్డ ప్రతిజ్ఞనాది, తెలుపందగు నాయభిలాష మెల్లెడన్. 97

ఉ॥ మాఱువునాదు పల్కులును, మాఱవ యాజ్ఞలు, బౌద్ధధర్మముం
గూరి భజించు మానవు లనుగ్రహపాత్రు లటంచుఁ దెల్పుఁ డ
వ్వారలు విశ్వసింపఁదగుఁ బార్థివుఁ డీతఁడు తండ్రిపోలెఁ ద
మ్మారయునెల్ల వేళలను, నాత్మసమాన సుఖాప్తిఁ గోరుచున్. 98

ఉ॥ మీకు విధించు కార్యముల మీఱక యెల్లరు విశ్వసింప నా
వాకులఁ దెల్పఁ గావలయు వారి కిహంబు పరంబునం దఁగం
దేఁకువబోధ సేయుటకుఁ దీగిక యున్నది చాలినంత, యి
ప్పోకడ మీకు స్వర్గతియుఁ బొందును, రాజఋణంబు తీఱెడిన్. 99

గీ॥ నాల్గునెలలకు నొకసారి నడుచునట్టి
పుష్యనక్షత్ర పర్వసంపూజ్యవేళ
నుచితసమయాన వినిపింప నుచితమగును
ప్రజలు సన్మార్గగాములై ప్రబలునట్లు. 100

## మొదటి కాళింగ శాసనము.

## (Provincial Edict)

సీ॥ భౌసిల్లు తోసలి పట్టణపాలక
వర్గంబునకు నాజ్ఞ ప్రకటితంబు,
"వేవేల జనులపై విశ్వసించుచు మిమ్ము
నధికారులను జేసి యరుసపడితి
సజ్జనసాంగత్య సంపాదనముచేత
నభిమతంబుల మీర లరయవలయు,
ఘాతుకులై జనుల్కారాగృహమ్ముల
కరుగకుండెడు మార్గ మరయవలయు,
గీ॥ ప్రజకు సన్నిహితుల్గాఁగఁ బరఁగి, ధర్మ
బోధములచేతఁ బ్రతిబంధములను దోలఁచ
వలయు; నోర్వమి, యొడలిని వంచకుంట
యోర్పులేకుంటఁ బనిపూనకుంట, కఱకు,
దనము, నివి ప్రతిబంధము ల్మనకు నెపుడు. 101
ఉ॥ చెప్పుటకన్నఁ దాను పనిచేయుచు మార్గముఁజూప మేలు, నా
యొప్పినయాజ్ఞ చెల్లుబడి నొంద లభించును మేను, లేనిచో
నొప్పమిపుట్టు, సోమరులకొప్పుగఁ బ్రేరణమిచ్చు వారికిం
దప్పదు స్వర్గసిద్ధి, కరుణాకరరాజు ననుగ్రహంబునన్. 102
ఉ॥ నావచనమ్ము నమ్మెడు జనమ్ముల కిజ్జగమందు శాంతి, సం
భావితమైన స్వర్గమున భవ్యపదంబును గల్గుఁ, బంచ వ
ర్షావధి నొక్కసారి పరిషత్తునఁ, బుష్య మహోత్సవంబులన్
సేవకవర్గము ల్తవిలి సేవలొనర్చుచు బోధచేసినన్. 103
ఉ॥ పట్టణమందు నక్రమముఁ జూపుటకై యధికారి వర్గముల్
పట్టుద లన్వహించి బలవంతపు హింసలు బందిగమ్ములు

న్నట్టుపడంగఁ జేయఁగ, నొనర్పఁగ ధార్మిక సత్యబోధమును,
గట్టి ప్రయత్నములన్నలుపఁగా లిఖియించితి శాసనమ్మిటుల్. 104

— లఘు శిలా శాసనము. —

— ధర్మాచరణ ఫలమును గుఱించి. —

మ॥ ఇది నాశాసన మిప్పుడేను మదిలో నెంతేని నుప్పొంగితిం
బదిలమ్మైన యుపాసనాపరుఁడనై భావించి యిందాఁక స
త్య దయాపాలక మంచుఁ జాటుమత మత్యంత మ్మసత్యమ్ముగాఁ
బదిలమ్మయ్యెను వారి దైవతము లాభావమ్మె చాటింపఁగన్. 105

చ॥ అధికుఁడె ధర్మకర్మముల కర్హుఁడటన్నది వెఱ్ఱి, ముక్తికై
యధికుఁడు నల్పుఁడన్న మరియాద లవెక్కడ! కర్మనిష్ఠతా
విధిపరులైనవారు పృథివింగను సత్యపథమ్మదేడ! స
ద్విధుల నుపాసనాపరతఁ బెంపుఁ గనందగునుర్వి సర్వులున్. 106

ఆ॥ ధర్మమాచరించఁదగుఁ బ్రాంతవాసులు
చిరతరంబు దానిఁ జేరికొలువ
వృద్ధియగును బుద్ధి వివరించి శ్రమియించి
వినఁగ వలతు నెల్లజనులు బోధ. 107

— రూపనాథ లఘు శిలా శాసనము —

గీ॥ ధర్మశ్రవణమ్ముఁ జేయుచుఁ గర్మపరత
రెండువర్షము లార్నెల లిన్నంటుపవఱకు,
నందుమీఁదట నాఱేండ్లు డెందమలరఁ
బట్టుదలతో నుపాసనాపరుఁడనైతి. 108

గీ॥ స్తంభములమీఁద శిలలపైఁ జాలచోట్ల
ధర్మమభివృద్ధిసేయు బోధమ్ములెసఁగ

వ్రాసియుంచితిఁ బొరుగు రాష్ట్రములవారు
నేర్చుకొందురుగాక నానీతిబోధ. 109

గీ॥ ఎవఁడు తన యనన్నరసమును నెన్నిసారు
లీ రసంబునఁ దడుపు జితేంద్రియుఁడయి
అతఁడు మననంబుచేనందు నధికతృప్తిఁ
బరఁగ నానందమందు నిర్వాణమందు. 110

— బాబ్రాశాసనము. —

గీ॥ శాక్యసింహుని వచనంబు శాశ్వతంబు
సత్యబద్ధము చిరకాల నుత్యమగును
జ్ఞప్తిఁగొలుపఁగ మీకు విజ్ఞప్తిసేతు
పూజ్యవరులార! వినుఁడు సమ్మోదముతోడ. 111

చ॥ వినుఁడు మదీయవాక్కులను విజ్ఞశిరోమణులార! శాక్యసిం
హుని పటుదివ్యసూక్తుల సముజ్జ్వల గ్రంథము లాదరించి స
ల్పిన శ్రవణంబు సత్ఫలముఁ బెంచునన్, స్త్రీపురుషులనేమంబు గ
న్మననము చేయఁగావలయు నాయభిలాషము తెలుసట్లుగన్. 112

— మొదటిస్తంభశాసనము. —

చ॥ వినయము పాపభీతియు నభీప్సిత బౌద్ధ పరాయణత్వమున్
ఘనమగు జాగరూకతయుఁ, గార్యసమర్థత లేనివారి కే
యనువున నైహికంబు పరమబ్బును, నైనను నా ప్రబోధము
న్మననమున నాటుకొన్న నవి నాఁటికి నాఁటికి వృద్ధిఁగాంచెడున్. 113

ఉ॥ పైయధికారులు న్నడిమి వారలు క్రింది నియోగు లందఱు
న్నాయభిలాష మాజ్ఞలు మనంబులనిల్పి, తలం ధరించి, ని
ర్ణాయక చిత్తవృత్తి యలరం బెఱవారలఁ బ్రోత్సహింప, సం
ధాయక ధైర్యముల్పెరుగ ధర్మము సాధుపథమ్మునఁ బట్టెడిన్. 114

గీ॥ మార్గరక్షకులుండి రీమార్గమందె
బౌద్ధమార్గాన రక్షణ పాలనంబు
సుఖము నిరుపద్రవంబు నశోకు పాల
నంపుఁ జట్టములయ్యెను బెంపుతనర. 115

— రెండవ స్తంభ శాసనము. —

చ॥ ఎఱుఁగఁగ సత్యసంధత, యహింసయు, సత్క్రియ, పారిశుద్ధ్యముం,
గరుణయు, బౌద్ధధర్మమని గాఢముగా మదినమ్మి నేను ప
త్రైఱఁగుల జ్ఞానదాన మొనరించితి, జంతుసమూహ మంతకుం
బరఁగ సుఖంబునిచ్చి బహుభంగుల ధర్మము లాచరించితిన్. 116

చ॥ ప్రజలు పశుప్రతానములు పక్షులునుం జలజంతు సంతతుల్
నిజమగు సౌఖ్యమందఁ, గడునిష్ఠమెయిం దొలఁగించి హింస, దు
స్త్యజమగు ధర్మసత్యముల ధారుణి నెల్లెడఁ జాటఁబంచితిన్
సుజనతసేమముం గన వసుంధర ధర్మము లాచరింపుఁడీ. 117

— మూడవ స్తంభ శాసనము. —

చ॥ మనుజుల వాడుకై తనరు మంచి పనుల్ప్రచురించుకొంట, నె
మ్మనముల దాఁచుకొంట కొఱమాలిన పాపపుఁగార్య, మాత్మ శో
ధన బహుకష్టసాధ్యమగు కార్యము, ధారుణిఁ గ్రౌర్యము కోపగర్వ
ముల్
వినయములేమి యీర్ష్య పరపీడకనుయ్యెడి పాపకార్యముల్. 118

ఉ॥ పాపపుఁగార్యమందు బలవంతముగాఁ బడఁద్రోయ "నేనధః
కూపమునందు గ్రుడ్డినయి కూలకయుండెద నంచు" నీమన
స్తాపముఁబెంచు నామొదటిదారినివీడి, ద్వితీయమార్గమం
దోపికఁజూపి నీవరయు మూర్ధ్వజగత్సుఖ సాధనమ్ములన్. 119

—◆ నాల్గవ స్తంభ శాసనము. ◆—

సీ॥ లక్షలాది జనమ్ముల రక్ష సేయ
రజ్జుకులఁ బెక్కు నిలిపితి రాజ్యమందు
నిగ్రహానుగ్రహమ్ముల నిర్ణయింపఁ
దనరుచుందురు తంత్రి స్వతంత్రులగుచు. 120

సీ॥ వారలెప్పుడు ప్రజకు నిర్భయముగాఁగ
క్షేమసౌఖ్యము లొడఁగూర్ప సిద్ధపడుచు
నుపకరించుచు నరయుచునుండు వారు
బౌద్ధసూక్తులు నల్గడఁ బ్రాఁకునట్లు. 121

సీ॥ కార్యనిర్వాహకులు రజ్జకాధికృతులు
సిద్ధులైయుంద్రు నాయాజ్ఞచేత నడరి
పనులు సేయుచు నుందురు పట్టుదలను
కార్యగతులను సూచించు గరిమగలిగి. 122

ఉ॥ తల్లులు పిల్లలం బెనుప దాదుల చేతులఁబెట్టి చూచున
ట్లెల్ల ప్రజాళిఁ బాలకుల కీప్సితసిద్ధికి నప్పగించి వ
ర్ధిల్లఁగఁ జూచుచుంటి సరిదిద్దుచుఁ దీర్చుచుఁ గూర్మిఁ గూర్చుచు
న్నెల్లగ రజ్జకాదు లవనీశుని యాజ్ఞలు నిర్వహింపఁగన్. 123

ఉ॥ పాలనమందు నేకమగు పద్ధతిఁగోరుదుఁగాన దేశదే
శాలను నొక్కటై మరణశాసన మొప్పఁగ, మూఁడునాళ్లు చు
ట్టాలు ప్రతప్తచిత్తుఁడగుటం బరికించుచు వధ్యుఁజేరి యా
కాలమునందు వానికొఱకై ముడుపుల్ప్రకటింత్రు మ్రొక్కులన్. 124

సీ॥ చెఱలయందున్నఁ గృషిచేసి చేరవచ్చుఁ
బరమపద మంచు నాయభిప్రాయమగును
తద్ద నింద్రియ జయము నుదారగుణము
గలిగి ధార్మికులగుట నాకాంక్షితంబు. 125

## ఐదవ స్తంభశాసనము.

చ॥ ఇరువదియేడు వర్షముల యేలుబడిన్ లిఖియింతు నిద్ది, యె
ల్లరు గ్రహియింపఁగా వలయు "రాజ్యమునందు నిబంధనమ్ము తా
మెఱుఁగక హింసకై యడరు టెంతయు నింద్యము, పాపకృత్యమా
అరసి మెలంగు టొప్పనని యాజ్ఞయొసంగెను నిర్విఘంబునన్. 126

సీ॥ చిలుకలు కొంగలు చిన్నతాఁబేళ్లును
బాతులు గబ్బిలాల్పక్షిగములు,
చీమలు రొయ్యలు చేపలు పందులు
దుప్పు లాఁబోతులు దొడ్డమీలు,
బల్లులు నుడుతలు బలుఖడ్గమృగములు
గ్రామకపోతము ల్కౌఁజు పిట్ట
లాఁడుమేఁకలు వాని యాఱ్నెల్ల పిల్లలు
పాలిచ్చు చూలాల్గాను పందిగుంపు

గీ॥ చంపనర్హము కానట్టి జంతువు లివి
తినఁగఁ గొఱగాని దేనికిఁ బనికిరాని
జంతువుల నెప్పుడైనను జంపఁజనదు
జంతువునకంచు జంతువుఁ జంపరాదు. 127

సీ॥ పురుగులతోనున్న పొట్టు కాల్పఁగరాదు
కూడదు తీయంగఁ గోడివిత్తు
లడవుల కెపుడైన నగ్గిపెట్టఁగ రాద
యుపవాస దినములఁ గపటియగుచుఁ
జనదు మీనంబులఁ జంపఁగా, నమ్మఁగాఁ
జనదు చేయఁగ నష్టు జంతుహింస,
పర్వదినంబుల వాతలు వేయుట
విత్తులు దీయుట పృథివిఁ జనదు,

గీ॥ పక్షపూర్ణిమములును బుత్యంతమాస
పుష్యనక్షత్రియుత చంద్రపూర్ణిమలును
సకల జనులకు నుత్సవ సమయములును
పర్వదినములు నాకు నాయుర్వ్విఁ బ్రజకు. 128

—♦ ఆఱవ స్తంభ శాసనము. ♦—

చ॥ చెడుగులవీడి ధర్మపరిశీలకులై చరియించు వారి కె
య్యెడరు ప్రాసంగకుండఁ బరికించుచు వారికి క్షేమసౌఖ్యముల్
కడఁగి యొనర్చి ధన్యతను గైకొన దూరసమీపవర్తుల
న్విడువక శ్రద్ధతోఁగనుచు నిచ్చలు మచ్చరితంబుఁ జూచెదన్. 129

గీ॥ క్షాన్మతలంబున నానాసమాజములను
వేఱువేఱగు శాఖల విశ్వసించి
గౌరవించితి నన్యోన్య గౌరవముల
వారలుండుట నాయభిప్రాయ మనుచు. 130

—♦ ఏడవ స్తంభ శాసనము. ♦—

ఉ॥ ముందటికాలమందు నృపపుంగవు లెవ్వరు శ్రద్ధఁ గైకొనం
గందుమె ధర్మవృద్ధికయి? కాలగతిం దగవృద్ధిఁ బొందునం
చుందురు, కాన బౌద్ధమది యొప్పుగ నెట్లు వికాసమందు నా
చందమెఱుంగ నే నిపుడు శ్రద్ధ వహించితి, దీక్షఁ బూనితిన్. 131

ఉ॥ దాన నుపన్యసించి వరధర్మము బోధయొనర్చి, మంచివి
జ్ఞానముఁగూర్చి, యాచరణసంగతులౌ నటు చేయనెంచి; నా
మానసమొప్పునట్టి యభిమానుల నుంచితిఁ గార్యకర్తలం
బూనిక పౌరసంఘముల బోధయొనర్చి సముద్ధరింపఁగన్. 132

చ॥ శిలలను స్తంభరాశి విలసిల్లఁగ శాసనలేఖలుంచి, పౌ
రులకు మృగాళి కయ్యెడలఁ బ్రోదిగ నీడకుఁ జెట్లు పెంచి, పాం

ధులకు సమస్తసౌఖ్యపు విధు లొనరించి, నివాసమందిర
మ్ముల నడబావులం బఱపి, బుద్ధమునీంద్రుని బోధసల్పితిన్. 133

సీ॥ ధర్మాధికారులు తవిలి నానావిధ
ధర్మసంఘమ్ముల ధార్మికులను,
భిక్షుకవర్గమ్ముఁ బ్రీతి గృహస్థుల
మతముల వారి సమ్మతినిగూర్చి,
బౌద్ధమతాచార్య ప్రబలసూక్తులు బోధ
యొనరించు పనులపైఁ దనరియుండు
బ్రాహ్మణాజీవక ప్రతతి జైనగణమ్ముఁ
గూర్చి విచారింతు కూర్మిఁగూర్చి,

గీ॥ దండనంబున కధికార్లు తనకు నొసఁగు
పదములన్నిట జాగ్రత్త పడుచునుందు
రిదియప్రియదర్శి మతమాచు నెసఁగుచుండెఁ
బ్రాజ్యమైనట్టి మౌర్యసామ్రాజ్యమందు 134

ఉ॥ రాజులుగాని పూజ్యముగ రాణులుగాని యొనర్చునట్టి యు
త్తేజకమైన దానముల దివ్యతరంబగు పాత్రమెర్గి స
దా జినులింప దీనజనరాజికి నిత్తురు, దానకాలముల్
రాజగృహమ్ముల న్విధిగ రాజులు రాణులెఱుంగఁ జేయుచున్. 135

గీ॥ ప్రోధినియమించి యుంటి ధర్మాధికృతుల
రాజపత్నుల సుతులును, రాణిసుతులు
త్యాగములు సల్ప సద్వినియోగపఱుప
బహుళధర్మంబు నాచారపరత హెచ్చు. 136

గీ॥ సత్యమౌదార్య పరిశుద్ధి శాంతతలును
సజ్జనత్వము కరుణయు జనులయందు

వృద్ధిపొందిన ధర్మవివృద్ధి జరుగఁ
గార్యములతోడి యాచారగరిమ పెరుగ. 137

గీ॥ నారయొనర్చిన ఘనకార్య నయము లరసి
ప్రజలొనర్చుచు నుండిరి బౌద్ధులగుచు
దల్లిదండ్రుల గురువుల ధరణిసురుల
భిక్షు వృద్ధులఁ బేదలఁ బ్రీతిఁగనుచు. 138

ఉ॥ ధర్మము లాచరించుమని తద్ద వచించుటకంటె మేలు తా
నిర్మలచిత్తుఁడై కడఁగి నిచ్చలుతప్ప కొనర్చుటెంతయుం,
గర్మచెడంగ నీక యనఘాత్ముల రా రవిచంద్ర చారముల్
ధర్మము నాచరింతురని వ్రాసితి శాసనమిందు నెమ్మదిన్. 139

## అశోకుని తీర్థయాత్రలు.

చ॥ ఇరువదియొక్కటై యడరు నేల్బడి కాలమునం దశోక భూ
వరుఁడు సమస్తధర్మపరిపాలన పద్ధతులెల్లఁ దీర్చి, తా
నరుగఁదలంచెఁ దీర్థవరయాత్రలు సల్పఁగఁ బూజ్యమూర్తియై
పరమకృపాపరుండగుచుఁ బ్రాకటదాన విధానచిత్తుఁడై. 140

ఉ॥ వేఁటవినోద వృత్తియని వేడ్కల మున్గి యశోకరాజు, దు
ర్గాటవు లన్వధించు తమకంబును వీడుటెగాక సంతతా
ఖేటముజోలిమాని పరికించుచు బుద్ధమునీంద్రసూక్తిఁ దీ
ర్థాటన తత్పరాత్ముఁడయి రాజిలెఁ గాలగతు ల్విచిత్రముల్. 141

ఉ॥ పాపపుఁ గర్మబద్ధుఁడగు వాఁడొకనాఁటికి బుద్ధిమార్పుచేఁ
దాపము నొందుచోఁ బరమ ధార్మికుఁడౌట నిజంబ, యైననుం
భూపతి చిత్తమందుఁ దలఁపు ల్పరిశుద్ధములౌట చిత్ర, మ
క్కాపటికంపు వృత్తులు జగంబున శాంతిని నిల్వనిత్తురే. 142

ఉ॥ యాత్రల కేఁగుచుం గృపకు నాకరుఁడౌచును బెక్కు దానము
ల్పాత్రములెర్గి చేసె బహుభంగుల భిక్షుక, బ్రాహ్మణాళి కు

ద్దాతుఁడు బౌద్ధసూక్తి పరతంత్రుఁడు నిర్మలబోధశాలి సు
క్షేత్రములందు స్తూపపరిశీలన శాసనలేఖ నార్థియై. 143

గీ॥ శాక్యసింహుఁడు మునుయాత్ర సలిపినట్టి
మార్గమునె తాను యాత్రకు మంచిదనుచు,
బయలుదేఱెను పాటలీ పట్టణంబు
నుండి స్వర్ణాది దానముల్ దండి సలిపి. 144

గీ॥ రంగదుత్తుంగ వీచికాసంగ గంగ
మంగళాభంగఁ దరియించి సంగతముగఁ
జేరె వైశాలి దేశం బుదారుఁ డచట
నుండు ముజఫరు చంపారు మండలములు. 145

గీ॥ "కేసరియ" స్తూపమచట వీక్షించి, యవల
సింగముల కంబములు రెండు చేరికాంచె
ఒకటిలారియ యరరాజి, యొకటినంద
నగరు నాఁగను పేరులం దనరుచుండు. 146

ఉ॥ అచ్చటినుండి యాతఁడు ప్రయాణము సల్పుచు రామపర్వకుం
జొచ్చుచుఁ దూర్పుమార్గమున సూటిగఁ గొండలుదాటి వేగ ము
న్నచ్చట బుద్ధయోగి పరినిష్ఠితుఁడై త్యజియించె దేహ మా
యచ్చపుఁజోటుచేరెఁ, గుశియంచు వచింతురు దాని నామముల్ 147

గీ॥ అంతఁ బశ్చిమమార్గాన నతఁడు నడిచి
గండకీనది తరియించి కడచి, పూత
లంబినీవన కాంత ప్రాంతంబుఁ జేరె
నెందు శుద్ధోదనాత్మజుం డందె జన్మ. 148

గీ॥ అచట నొకశాంతి కంబంబు నగ్రమందు
నశ్వ ప్రతిమంబు వెలయించి విశ్వసించి

శాసనంబిట్లు లిఖియించె సత్త్వఘనుఁడు
బుద్ధమునిసూక్తి గౌరవం బుద్ధరింప. 149

ఉ॥ గౌతమబుద్ధుఁడీ యడవిఁ గాన్పుయి పూత మొనర్చెఁ గాన, నా
పూతచరిత్రు నామమునఁ బొల్చెడు శాసనమంచు ఱాతిపైఁ
బ్రీతిగ నశ్వముస్మెఱయఁ బేర్మి లిఖించెను "క్షేత్రమంతయుఖ్
ఖ్యాతిగ బౌద్ధధార్మికుల కర్పితమయ్యె" నటంచు సమ్మతిన్. 150

చ॥ పదపడి కొంతదూరమటు పశ్చిమ దిఙ్ముఖుఁడౌచు నేఁగి, నే
ర్పొదవఁగ బుద్ధదేవునకుఁ బూర్వపు మూలమతంబుఁ జాటుచుం
బదిలమునైన 'యకన్నక'మాని విచిత్రితమైన స్తూపముం
గదిసి యశోకభూమిపతి గౌరవముం బ్రకటించె నచ్చటన్. 151

గీ॥ పరఁగ నందొక్క ఱాతి కంబంబు నిలిపి
దానిపై "నేను రెండవ తడవుదీని
వృద్ధిచేసితి బౌద్ధసద్బుద్ధిచేత"
ననుచు లిఖియించె ధారుణిజనులు మెచ్చ. 152

సీ॥ అటనుండి నేపాళమందున్న కాట్మండు,
"లలితా"పురంబుల ప్రాంతములకు,
నటుపైని శ్రావస్తికరిగి యారాజన్యుఁ
డందందుఁ జరియించి యాత్మనలరి
బుద్ధబోధామృతోద్బుద్ధ చైతన్యంబు
గాంచి యాప్రాంతంబు గౌరవించె
వాడుకగలదు శ్రావస్తి ప్రాంతములందుఁ
"బరఁగంగఁ బెక్కు కంబముల నిలిపె"

గీ॥ ననుటయేగాని యవి యిప్డు కనఁగరావు
ఋజువుచేయంగఁ జాలినరీతి లేదు

యాత్రిలను దెల్పఁగా నశోకావధాన
గ్రంథమొక్కటి నైతిహ్యగరిమఁ దనరు. 153

చ॥ వరుసగ యాత్రలోఁ గపిలవస్తువు, బుద్ధగయాన బోధిస
త్తరువును, వారణాశి సవిధాన ఋషీందు్రిల పట్టణంబునుం
బరువడి వక్కలాఖ్యమయి పావనమయ్యెడి స్తూపమట్టు లా
దరమున జేతకానన తతంబు మరంబును గాంచెఁ బ్రీతుఁడై. 154

ఉ॥ చూచిన చోటులెల్ల మనసుం గరఁగింపఁగ స్వర్ణదానము
ల్సోఁచిన యట్లు పెక్కువలు తోరపుభక్తి నొనర్చెఁగాని, స
త్యాచితబౌద్ధ ధర్మముల దానముచే నుపకారి కాఁడటం
చేచిన వక్కలాఖ్యమునియిక్కను నీవులొసంగఁ డయ్యెఁగా. 155

ఉ॥ పోయిన చోటనెల్లఁ దలఁపు ల్తను ముందుకు లాగుచుంటచేఁ
బాయకబౌద్ధ ధర్మ మది పావన మంచుఁ బ్రబోధచేసి, ని
శ్చాయకుఁడై జగంబునకు సద్గతిజూపఁగ నెంచెఁగాని, దు
ర్మాయలు పన్నఁడయ్యె బహుమాన్యములౌట మతమ్ము లన్యముల్

—♦ అశోకుని కాలమున వైదికాచార్యుల ప్రివర్తనము. ♦—

శా॥ అక్కాలంబున వేదశాస్త్రి పఠనాద్యాసక్తులా చార్యులుం
దిక్కుల్దిక్కులు తిర్గితిర్గి మతమున్వేదాంత శాస్త్రిదులం
జక్కం బోధయొనర్చ నిశ్చితమతిం జాటం బరివ్రాజకు
ల్నిక్కంబై యనురాగపూర్ణ మమత ల్నిల్పుండె సంఘమ్ములన్.157

మ॥ మతసిద్ధాంతము సేయువారగుచు సంభావించి గ్రామమ్ములన్
సతమైయొప్పు సభాగృహమ్ములను సంస్థాపించి, చర్చించి, స
న్మతముందెల్పఁగ నార్యసంఘ మతులమ్మై పొంగె నానాఁడు ని
శ్చిత సిద్ధాంతము భావిభాగ్యగరిమం జిత్తంబుల న్నిల్పఁగన్. 158

క॥ ఇందుకుఁ దార్కాణంబయి
పొందుగ శ్రావస్తియందుఁ బోలిచెడిని సభా

మందిర మొక్కటి, యట్టివ
కంబము వైశాలిచంపకాటవు లందుఁ. 159

చ॥ మతసహనం బశోకుఁ డభిమానముతోఁ బ్రకటింప, నద్దియే
యితరులు రాజపుంగవుల కెంతయు మాన్యముగాఁ దనర్చె, స
మ్మతమున నోఢ్రరాజు బహుమాన్యుఁడు 'ఖారవిలుండు' పిమ్మటం
గుతుకముతోడఁ బెక్కుమత కూటములన్ సమబుద్ధిఁ బెంచఁడే. 160

చ॥ తలఁపఁగ బ్రాహ్మణోత్తములు ధారుణి దేవతలన్న భావముం
దెలిసి యశోకభూవరుఁడు తేలికపర్చుచు వారి యున్నతిం,
దెలిపె, "నడంతు బ్రాహ్మణులు దేవతల న్విపరీతభావమం"
చలఁతి వినమ్రభావుఁడగు నాతఁడు కొంచెము గర్వియౌనటుల్. 161

చ॥ కనుక నశోకరా జతఁడు గర్వియటంచును విప్రపుంగవుల్
ఘనుని చరిత్రముం దమదు గ్రంథముల న్వివరింపరై రటం
చనియెఁ జరిత్రకారుఁ డిది యాతని నామము శాసనంబునం
దున నొకచోట సూచనముతోఁ గనుపించుట నిశ్చయంబగున్. 162

గీ॥ సంగమిత్ర మహేంద్రుల జారసుతుల
బౌద్ధబోధకు సింహళ ప్రాంతమునకుఁ
బంపెననువార్త యొక్కటి బ్రబలియుండుఁ
గాని చరితంబు నమ్మ దద్దాని నిపుడు. 163

ఉ॥ చోళము పాండ్యరాజ్యముల స్తూపములం బ్రియదర్శి భూపుఁ డా
కాలమునందుఁ గట్టెనని గట్టిగ వ్రాసెను హ్యూయన్ త్స్వయాంగు, రా
జ్యాలు స్వతంత్రమై పరఁగు నప్పటికిం దగుమైత్రిఁగూర్చి భూ
పాలుఁడు సమ్మతింబడసి ప్రాజ్ఞుఁడు వానిని గట్టియుండెడిన్. 164

గీ॥ సింహళము వానిచెంతను చెలఁగుచుంట
వానితోడను నిత్యసంబంధముంట

బౌద్ధమతమది క్రమమునఁ బ్రాఁకె, యందుఁ
గాంచియుండును గ్రంథ పౌష్కల్యవృద్ధి. 165

గీ॥ సింహళమునందు మతవృద్ధిఁ జేయఁబూని
నట్టివాఁడు మహేంద్రుఁడె, యతఁ డశోక
భూపతికి బంధువయ్యెడుఁ, బుత్రుఁడగునె,
యతఁడె మఠములఁ గట్టించి మతముఁ బెంచె. 166

—♦ అశోకుఁడు కట్టించిన కట్టడములు. ♦—

మ॥ భరతోర్వినన్నను రెండువేల క్రితమే ప్రాజ్ఞుల్మహా శిల్పులుం
డిర యంచు న్నుతిఁగాంచు మించెనని చాటించంగ, నాగ్రీకు ల
చ్చరితంబందున "గ్రీకు శిల్పులను మించంజాలరన్" వ్రాఁతలం
బరికల్పించిరి, సర్వశాస్త్ర నిపుణ ప్రఖ్యాతిఁ దామెర్గరో. 167

చ॥ ధర మును శిల్పిశేఖరులు దారువులందును ఱాలయందుఁ జి
త్తరువులు చిత్రచిత్రపు విధంబునఁ దీరుచుచుండువారు, తా
మరయుచు శిల్పకారులకు నాశ్రయమిచ్చుచుఁ బ్రోత్సహించుచుం
దిరమగు కట్టడంబులను దీర్పఁగఁ జేతురు రాజపుంగవుల్. 168

ఉ॥ శిల్ప మనల్పమౌచు వికసింప నశోకుఁడు దారునిర్మితా
నల్పగృహాళి నిల్పఁదగునా! యని ఱాతిమయంపు శిల్ప సం
కల్పముచేత గట్టి తమకంబునుబూని శిలామయంబు లా
కల్పము నిల్చి పొల్చుగతిఁ గట్టడముల్ఘటియించె దిట్టముల్. 169

ఉ॥ ఈమహనీయమూర్తి ప్రకటించిన శాసనరాశియందు నే
వో మనకిప్డు లభ్యమయియుండెను, నైనఁ జరిత్రకారు లా
శామలకీర్తి శోభితుని శాసనవ్రాత ప్రహృష్ట చిత్తులై
తాము చరిత్రవ్రాసి విశదం బొనరించి రశోకు పాలనన్. 170

ఉ॥ మానవశక్తి మించు ప్రతిమల్లల చిత్రవిచిత్ర శిల్పము
ల్గానఁగ వచ్చు నప్పురపుఁ గట్టడముల్గని విస్మితాత్ములై

“ఏనగరంపు శిల్పమిది యేరికి సాధ్యము? దైవ నిర్మితం
బొ”నని యబ్బురంపడఁగ నందము నల్గడఁ జిందులాడఁగన్. 171

ఉ॥ కట్టె నశోకభూమిపతి కట్టడముల్బహుసంఖ్యలప్పు, డం
దిట్టిక లాలు వాడె నవి యెన్నఁగఁ జిత్రవిచిత్ర శిల్ప సం
ఘట్టితమై తనర్చెఁ, గడుఁగ్రమతరద్యుతిఁ గ్రాలెనంచు, న
ష్పట్టణరాజ మెక్కుడుగ భాసిలెనంచు వినంగ నయ్యెడిన్. 172

సీ॥ చైనికయాత్రిక సాధుహూయాన్‌త్సాంగు
వచ్చి చూచిన నాఁటి వార్తఁబట్టి
ప్రియదర్శి వెనుకను రెండువందల యేండ్ల
నాఁటికిఁ బాటలినగరమెల్లఁ
బాడయియుండఁగఁ బ్రజలెల్ల విడిపోవ
గంగసువర్ణలఁ గలిసిపోవఁ
బూడియున్న ప్రదేశమునఁ బాట్నపురమును
బాంకిపురంబును బరఁగునిపుడు

గీ॥ సొగసులలరంగ గట్టిన సొంపుమేడ
లందములు చిందఁ గట్టు దేవాలయములు
రాణనొప్పారఁ గట్టిన రాజగృహము
లొక్కటేనియుఁ గాన్పించకుండు నచట. 173

గీ॥ సాంచిలోనున్న స్తూపసంచయము తప్ప
మౌర్యరాజ్యమునందలి మఠములన్ని
మాయమయ్యె నశోకసమ్రాట్టునరిగె
శాసనంబులె యతనికి సాక్ష్యమయ్యె. 174

ఉ॥ దేశము నాల్గుమూలలను దివ్యమఠమ్ము లనేకము లశ్మతా
వేశముతోడ స్తూపములు పెక్కులు కట్టఁగఁజేసి, రాజ్యముం

క్లేశములేని మార్గమునఁ గ్రిడయపోలె నశోకుఁడేలె, స
న్న్యాసులు,బ్రాహ్మణోత్తములు హాయియటంచు శుభంబుఁపల్కఁగన్

శా॥ నేపాళంబును గాశ్మిరంబు తనవై నిత్యంబు పెంపొంద నా
భూపాలుండటఁ బెక్కుస్తూపములు సొంపుల్మింపఁ గట్టించె, న
ట్లేపారం దనపేర శ్రీపురము నుర్వీశుండు గట్టించి, స
చ్ఛ్రీపాతుండయి ప్రీతినేలె నతుల శ్రీమించ సామ్రాజ్యముల్. 176

గీ॥ చారుమతి దేవపాలుని క్షత్రియాణి
గృహిణి ప్రియదర్శిసుత తండ్రి క్రేవనుండి
యాత్ర, ఖాట్మండు చెంత వనాంతభూస
నాథముగఁ గట్టెఁ బశుపతినాథ మఠము. 177

ఉ॥ స్తూపములెన్ని యోగల వశోక వినిర్మితముల్ స్వరాజ్యమం
దాపగిది న్మఠంబులును, నయ్యవి యన్నియుఁ గానరావు, ని
క్షేపములౌచుఁ గొన్ని శుభశీలు చరిత్రముఁ జాటుచుండు నా
యా పలుప్రాంతమందుల నవన్నియు నేఁటికి గోచరించెడిన్. 178

చ॥ పొలుపుగఁ జంద్రగుప్త నృపపుంగవు దారుమయంపుఁ గోటలం
దొలఁచి, శిలామయంబులగు తోరపుఁగోటలఁగట్టెఁ బాటలి
న్మలిచిన జాఁతి శిల్పముల మార్గముఁ గన్గొని యా యశోక భూ
తలపతియంచు వ్రాసెఁ దొలుతం గనుఁగొన్న హుయాన్త్సాంగు తాన్. 179

ఉ॥ జాఁతిమయంపు శిల్పము పురాతన దారుమయంపు శిల్పసం
ఘాతము నాక్రమించి వడిగం బెనుపొందె నశోకు కాలమం
దాతని స్తూపనిర్వహణమంతయు జాఁతిమయంబె, యంతకుం
బ్రాఁతయుగంబున న్మనకు జాఁతిపను ల్గనవ్రసూనముల్. 180

చ॥ తొలుతటి జాఁతి శిల్పము యథోచితమైనను, దారుశిల్ప సం
కలనముతోఁ బ్రకాశమును గాంచెఁ గ్రమంబునఁ గమ్రరీతుల

న్మలిచిరి మానుషాది ప్రతిమల్ శిలలందు విచిత్ర చిత్రణం
బుల మన శిల్పు లత్తఱి నమోఘధురీణ ప్రవీణపాణులై. 181

ఉ॥ కొన్నిట సింగముల్మెఱయఁ గొన్నిట నేనుఁగులొప్పఁ గొన్నిటన్
సున్నితమైన పుష్పములు సుందరరూపముఁదాల్చ, మత్స్యముల్
కన్నియలొను గొన్నిటను, గ్రమ్మఫలాకృతి నొందఁ గొన్నిటం
బన్నఁగ శిల్ప విద్య బహుభంగుల రంగులనీని పొంగఁగన్. 182

చ॥ స్వయముగ శిల్పచాతురి నెసంగెడు శిల్పుల కన్యదేశ్య మా
శయమును దోడుసూపఁగ వెస న్వికసించె, హసించె, సత్కళా
శయము నశోకవర్ధనుఁడు చాలఁగఁ బెంచ సముత్సుకుండునై
జయజయసార్వభౌమ! యని చాటఁగఁ బౌరులు సంతసించుచున్.183

## అశోకుని పరిపాలనాచాతుర్యము.

ఉ॥ ఒక్కట రాజ్యపాలనము నొక్కట బౌద్ధమత ప్రచార మిం
కొక్కట మానవాభ్యుదయ మొక్కట నిశ్చిత పాశుపాల్యముం
జక్కఁగఁ దీర్చిచేసి, మనసారఁగ నేలు నశోకభూవరుం
డెక్కడి మానవుండు పరికింపఁగ దైవతమూర్తియే యగున్. 184

ఉ॥ కాన నశోకునందుఁ బరఁగం బుడమిం బృధివీశులెన్న దు
ర్జ్ఞానవిలాస విక్రియలు రాజసవృత్తి యఖర్వ గర్వముం,
దానము సత్యసంధత విధానము తన్నువరించి యుండ, నా
జ్ఞాని ముఖస్తుతుల్వినఁగఁ జాలఁడు, యోగ్యుఁడు దంభమోర్చునే?

చ॥ మతములవారిపై దురభిమానముఁ జూపక నెమ్మనమ్మనం
గుతుకముఁబూని ధర్మగతికుం డయి యన్యమతంపు వారిపై
సతతమసహ్య భావమును జూటక బోధయొనర్పఁడంచు, ని
శ్చితమతియై తలిర్చె, సమచిత్తులకించునె హెచ్చుతక్కువల్. 186

చ॥ తన యొనరించు కార్యములె తప్పక శాసనమందు వ్రాసి, భూ
జనులు తరించ నెల్లెడల జాటెనెకాని, యహంకరించుచుం
ఘనుఁడని యెంచి తన్‌బొగడఁగా మది నెంచెనె, శుద్ధసత్త్వుఁ డే
యనువున నేని నిప్పుడమి నాత్మనుతిం దనమాత్మ నెంచునే. 187

చ॥ మతములపేరఁ గొంద ఱిల మాన్యులమందు రశోకరాజు సం
గతమగు ధర్మమార్గమునఁ గ్రాలుచు నిర్మల నిశ్చలాత్ముఁడై
పతితుఁడు పావనుం డనెడు భావముపీడి, విశుద్ధసత్య స
ద్గతి తనలక్ష్యమై తనర ధారుణినేలె సమత్వపూర్ణుఁడై. 188

ఉ॥ పాలనమందు నేర్పు, బహుభంగుల రాజ్యముతీర్పు, ధర్మ స
త్యాలకు లొంగుబాటు, వసుధాస్థలి నిర్మల సత్ప్రవృత్తి, యా
కాలమునందె పెంపుఁగని క్రాలుచునుండె ననంగఁ జిత్ర, మా
వాలము భారతోర్వి పరిపాలన నాగరికత్వ భూతికిన్. 189

మ॥ పరహింసాపరకీయ విత్తహరణ ప్రజ్ఞావిశేషంబు, సా
దరముల్ సత్యవిఘాతక క్రియల, నుత్సాహంబు దుర్వ్యాప్త దు
ర్భర దుష్క్రియలం, బ్రపంచ గతులం బాధింపఁగాఁ, జీఁకటుల్
భరతోర్విం బ్రభవించి శాంతి వెలుఁగుల్ భాసించు టీనాఁటిదే. 190

చ॥ పుడమిఁగలారె యిప్పుగిది భూషితశాంతి సమత్వ సత్యులై
కడఁగి ప్రజాసుఖంబె పరఁగం దమసౌఖ్యమనంగ నెంచువా
రిడుమల కిక్కయై పుడమినేలిన రామవిభుండొకండు, నీ
యొడయఁ డశోకుఁడొక్కఁడనియుం దలపోయఁగ నిక్కమేయగున్.

ఉ॥ ఏలిరి రాజ్యముల్ కడఁగి యెందఱొ రాజు లనామధేయులై
మూలమెఱుంగలేక తమబుద్ధిని జక్కఁగ నిల్పలేక, యా
భీలకరాళఖడ్గపరభీకర వృత్తులఁబూని, నిల్వఁగం
జాలిరె శాశ్వతమ్మగు యశమ్మునశోకుఁడు పోలె నిద్ధరన్. 192

ఉ॥ చిన్నతనమ్మునం జదువుచెప్పు ముహూర్తము సన్నిధానముం
దున్న యశోకు భావమున కుర్వి సమస్తము కందిపోవునం
చన్నను, మిన్నయై పుడమినాతఁడు భిన్నప్రసన్నమూర్తియై
యెన్నఁగ సన్నుతింగొనుచు నేలెను రాజ్యము మిన్నుపాడఁగన్ 193

ఉ॥ ఏలెను సత్యసంధుఁడయి యీప్సిత ధర్మప్రబోధశాలియై
పాలకవర్గము ల్తన కుపాధిగ నిల్వఁగఁ జారచక్షులై
కాలగతిం దలంచి, ప్రజకై యిహమందుఁ బరమ్మునందు సౌ
ఖ్యాలయ సద్గతి ప్రకటనాయత జీవిత భావితాత్ముఁడై. 194

ఉ॥ పుట్టెను జంద్రగుప్త నృపపుంగవు వంగడమందు మౌర్యుఁడై
గట్టిబలమ్ముచే జయముఁ గాంచెఁ గళింగమునందు నంతతోఁ
బట్టుగ ధర్మబద్ధుఁడయి బౌద్ధుఁ డశోకుఁడు ధర్మభిక్షు స
మ్రాట్టయి రాజ్యమేలె బుధరాజి నుతింపఁగ నల్వదేం డ్లిలన్. 195

చ॥ అదియగుఁ బాలనంబనఁగ నయ్యది రాజ్యమనంగ నొప్పు, నె
య్యది యిహముం బరమ్ము మదినారసి యేలెడు వాని కాశ్రయ
మ్మది సకలార్థసాధనపరీత కళానిలయమ్ము, సంపదల్
పొదలఁగ మానవాభ్యుదయముల్ దయివాఱఁగఁ జెంగలించఁగన్.

ఉ॥ వారె ప్రజ ల్ధరిత్రి బలవంతులు సౌఖ్య సమృద్ధివంతు లె
వ్వారలు నీతిసద్గతి శుభాగతి చింతకులై తనర్తు రె
వ్వారలు సత్యబద్ధులయి వంచనఁగోరరు, రాజశాసనాల్
దూఱరు, న్యాయబద్ధపు విధు ల్పరికించి సమాచరించుచున్. 197

ఉ॥ భూతదయాది సద్గుణ విభూషితుఁడైన యశోకరాజు ని
ర్ధూత సమస్తగోషుఁడయి తోరపుదూర విచారమగ్నుఁడై
పూత మతమ్మటంచుఁ దనబుద్ధికి నచ్చఁగ బౌద్ధభిక్షులై
చేతనవర్గముం దనుపు చేఁతలఁ బెంపువహించె సొంపుగన్. 198

ఉ॥ ఆతతనిత్యసత్యనిరతాత్ముఁ డశోకుఁడు పృథ్వియందు నా
సేతుహిమాచలంబు పృథుసీమలనేలిన దొడ్డరాజు గా
నీ, తన ధర్మమార్గమున నిల్చిన వాఁడతఁడొక్కఁడే యనం
భూతలమందు సత్త్వగుణపూర్ణుఁడు పూజ్యచరిత్రుఁ డంతటన్. 199

ఉ॥ చేతులఁజేసి చూపి పరిశీలనసేయఁగ రాజకీయ స
ద్వ్రీతమునిల్పి, పౌరులకు ధర్మము నిచ్చలు బోధసేయుచుం
దాతృగుణంపు పెంపడర దానసుతర్పిత విప్రభిక్షుకుం
డై తమిమించ సచ్చరితుఁడై భువినేలిన ధర్మమూర్తియా. 200

ఉ॥ దిట్టఁడు కార్యతత్పరుఁడు తీర్పరి ధర్మవిజేత గావునన్
మెట్టఁగ హైందవోర్వి మితిమీఱఁగఁ జాలిరె యన్యరాజు లి
ట్టిటు కదల్పరాని పరకీయులు చేరఁగరాని పాలనం
బట్టె వెలుంగ లోనికలహంబు లవెవ్వియు రేఁగకుండఁగన్. 201

ఉ॥ భారతభూమికింత పరిపాటిగ మేలొనరించు రాజులే
వారును లేరు నాఁడు, తరువాతను లేరనఁ దప్పుగాదు, దు
ర్వార పటుప్రతాప పరివారసమేతులు నైనమాత్రి భూ
భారముమోయఁ జాలుదురె పావన ధర్మజయమ్ము లేనిచోన్. 202

సీ॥ వాల్గానదీమూల ప్రాంతమ్ము దొరకొని
పూనియాసియలో జపానువఱకు,
సయ్యాము మొదలుగ సైబీరియాయందు
"బెయికలు" నం జలాశయము వఱకు,
ప్రియదర్శినామంబు పేర్మి గొండాడంగ
స్మరణీయ మహనీయచరితుఁ డతఁడు,
సార్థకనాముఁడై సహృదయ జ్యేష్ఠుఁడై
యానందపూర్ణుఁడై యలరుచుండి

గీ॥ పరిజలకానంద ముహొప్పంగఁ బోషింపి మెఱయఁ
బాలనముసేసె నలువది వత్సరములు
నేఁటిదాఁకను నామేటి సాటిలేని
శాసనమ్ములు స్తూపముల్చాటుచుండ. 203

సీ॥ తనమాన లసమాన ధైర్యప్రతాపమ్ము
లాశావకాశమ్ము లల్లుకొనఁగఁ,
దన దివ్యభవ్య సత్పరిపాలనప్రౌఢి
భువనంబు నల్గడఁ బొగడుచుండఁ,
దననీతి తనభూతి, తనరీతి, తన ఖ్యాతి,
వినువీధి కెగఁబ్రాకి విస్తరింపఁ,
దనగణ్యపుణ్య వర్తనబోధ శాసనా
లాచంద్ర తారక మ్మగుచు మెఱయ,

గీ॥ తన యశోలతవెలుఁగు నీడను జెలంగి
చతురగతులను ధర్మంబు సంతరింప
రామరాజ్యంబు మఱపించి రంజిలంగ
శుభములీనంగఁ బుడమి నశోకుఁడేలె. 204

చ॥ ఘనుఁడితఁడౌనె 'శీజరు'న కంటెను 'చార్లెసుఁ'కంటె గొప్పవాఁ
డని పరదేశవాసులును నచ్చెరు వందఁగ నేలు నయ్యశో
కునిఁ గొనియాడఁగాఁ దఱమె, కూర్మియుఁ బేర్మియు నోర్మిగల్గు న
య్యనఘుఁడు ధర్మమూర్తి యహహా! స్మరణీయచరిత్రుఁడయ్యెడుఙ్.

సీ॥ నృపతులు వెఱఁగందఁ దపము సేయుచునుండు
నిసుమంత మనసులో విసుఁగు లేక,
నిశ్చిత సత్కర్మనిరతుఁడై ప్రభవించు
వింతవింతగమాఱు చింతలేక,

సకల చరాచరజాతి సౌఖ్యముఁగూర్ప
సన్నద్ధుఁడగుచు విశ్రాంతిలేక
ప్రజముప్పుఁ దప్పించు తనయొప్పు నొప్పించు
శాంతిదాంతుల వీఁకభ్రాంతిలేక

గీ॥ మౌర్యకులదీపకుఁడు శౌర్యధుర్యుఁ డతఁడు
శుద్ధసత్త్వుఁ డశోకుఁడు శోభమాన
నిరుపమాన యశోరమ నిఖిలదిశల
నలరి వెలుఁగులఁ జిలుకంగ నడరు నేఁడు. 206

ఉ॥ కంటి మశోకరాజ! యనఘాత్ముఁడ! నీదగు ధర్మచక్రము
న్నింటఁ బతాకలన్మెఱయ, మేదిని రాజుల రాజముద్రలం
దంట ప్రజాప్రభుత్వ నిరతార్య వినిర్మల హైందవావని
న్మంటిమి స్వేచ్ఛమై నిపుడు, మాన్యుఁడ! యెంతటి పుణ్యమూర్తివో.

చ॥ మతముల సేవగింప నభిమానముతోడ గ్రహింతు వన్య స
న్మతముల నీతులం, దురభిమానము సైపవు, శుద్ధమూర్తివై
యితర మతమ్ములంగలుగు నించు విశిష్టవిశుద్ధ ధర్మ సం
గతిఁ గనుఁగొన్నఁగాని కొఱగారని యెంతువు ధన్యజీవనా! 208

ఉ॥ ధర్మమెఱింగి శాశ్వత పదమ్మునకై ప్రయతింతురేగాక, స
త్కర్మధురీణులై సరసతా ప్రతిపాదకమౌ విధానముల్
నిర్మల సత్యబద్ధులయి నిచ్చలు నెమ్మిఁ దలంతురేగాక, మే
ల్కూర్మితలిర్ప సజ్జనతఁ గూర్తురుగాక ప్రజల్ధరిత్రిలోన్. 209

శా॥ సారాచారవిచార సారమతులై సంకల్ప సాధ్యక్రియా
దూరాలోచన తత్పరాత్ములయి యుద్భూత ప్రజాప్రాభవ
ప్రారంభంబుఁ బ్రజాప్రభుత్వ సచివుల్ సాధించి శాంతాత్ములై
శ్రీరంజిల్లఁగఁ బాలనంబు సలుపన్ సీతాపతిం గొల్చెదన్. 210

గద్య- ఇది శ్రీభారద్వాజ గోత్రపవిత్రాపస్తంబసూత్ర రాఘవా
చార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధ
కవితావిస్ఫురణ, సాహిత్య శిరోమణి, ఉభయభాషా
ప్రవీణ, కవిరాజ బిరుదాంచిత, కాండూరు నరసింహా
చార్య ప్రణీతంబైన యశోకరాజ్యంబను
చారిత్రిక ప్రబంధంబునందుఁ
దృ తీ యా శ్వా స ము
సం పూ ర్ణ ము
అశోక రాజ్యము సంపూర్ణము.
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః



# అశోక రాజ్యము - కొన్ని చారిత్రిక నిదర్శనములు.



## ప్రథమాశ్వాసము.

16-వ పద్యము— "Looked at merely from the soldier's point of view, the achievements wrought in that brief space of time are marvellous and incomparable................. ........................ incalculable value as a stimulous and encouragement to troops, often ready to despair of success".

From page 116 of 'The Early History of India "by Vincent A. Smith.

27-వ పద్యము— "The family name Maurya, assumed by the members of dynasty founded by Chandragupta, is said to be a derivative from Mura, his mother's or grand mother's name. There are however grounds for holding that Chandragupta, so far from being of low caste, was related to the respectable Early Nandas. Whatever be the truth, young Chandragupta in some way, incurred the displeasure of his Kinsman, Mahapadma Nanda, the reigning King of Magadha and was obliged to go into exile."

Page 123

From "The Early History of India" by Vincent A. Smith.

35-వ పద్యము— ఇచ్చట నీకథ నెఱుంగవలయు "చంద్రగుప్తుఁడు నందులచే చెఱసాలనుండి తప్పింపఁబడిన తర్వాత పంజర పరీక్షయందు (లక్క-సింగమును తలుపులు తెరువకుండ కరిగించి) కృతార్థుఁడై

నందులచే భోజనశాల కధికారిగా నియమింపఁబడెను. చంద్రగుప్తున కా యధికారము స్వల్పముగాఁ దోఁచెను. ఒకనాఁ డాసత్రమున కొక బ్రాహ్మణుఁ డాతిథ్యమునకై వచ్చెను. అతఁడే చాణక్యుఁడు, విష్ణుగుప్తుఁడు, కౌటిల్యుఁడు. అతఁడు బిరబిర సత్రము లోపలికిఁ బోయి రాజు కూర్చుండుటకై యమర్చిన బంగారు పీటపైఁ గూర్చుండెను. అప్పుడు నందులు సత్రము చూడవచ్చి యాబ్రాహ్మణునిఁ జూచి యాగ్రహించి, యాతనిని పీట మీఁదినుండి లాగించిరి. లాగుటలో నాతని జుట్టు ముడి వీడిపోయెను. అంత చాణక్యుఁ డుగ్రుఁడై "ఓరీ! నందాధములారా! నన్నవమానించితిరి. మిమ్ము సంహరించి కాని యీజుట్టు ముడివేయనని ప్రతిజ్ఞచేసి వెడలిపోయెను."

53-వ పద్యము— The adviser of youthful and inexperienced Chandragupta, in this revolution, was a Brahmin named Vishnugupta better known by his patronymic Chanakya or his surname Kautilya, by whose aid he succeeded in seizing the vacant throne." Page 124

From "The Early History of India"
by Vincent A. Smith.

61-వ పద్యము— "Selenkos also gave a daughter in marriage to Chandragupta and maintained a Greek embassy at the Indian Court (303 B. C.) He received in return a present of 500 elephants which helped him to victory in subsequent conquests in Western Asia with the other successors of Alexander. Megasthenes the envoy of selenkos and the first Greek ambassador at Pataliputra was a careful observer of men and manners." Page 67

From "A History of India" Part I
Pre musalman Period
by K. V. Rangaswamy Aiyangar, M. A.

89 వ పద్యము— "The Arthasastra is a treatise on the art of government of which the authorship is attributed to Chandragupta's minister Chanakya, also known as Kautilya and Vishnugupta. The state craft as taught in Arthasastra.................... unscruepulousness Neverth-less as a scheme of administrative organisation the Arthasastra is unsurpassed in Hindu literature. It is through................ contingencies. The book is avowedly based on earlier treatises no longer extant and should be looked upon as a digest of traditional laws revised to meet the condition of the times." Page 70 From "History of India"
Hindu Period by Prof. L. Mukherjee, M. A.

90-వ పద్యము- ''నందరాజుల తర్వాత మగధ కళింగ రాజ్యములును, మైసూరు వరకు దక్షిణాపథమును మౌర్యచక్రవర్తియగు చంద్రగుప్తుని పాలఁబడెను. ఈచంద్రగుప్తుఁడు బ్రాహ్మణమత మవలంబించిన హిందూచక్రవర్తిగా కనబడుచున్నాడు. ఈతనికి రాజ్యప్రాప్తి గావించిన రాజనీతి శాస్త్రజ్ఞుఁడును, ఈతనికిని, ఈతని కుమారుఁడగు బిందుసారునకును మంత్రియునైన చాణక్యుడు బ్రాహ్మణుడు. అయినను మైసూరునందలి శ్రావణ బెల్ గొలా యను గ్రామమున దొరికిన జైన చిహ్నములను బట్టియు, శాసనములను బట్టియు, జైన పురాణమునందలి గాథలను బట్టియు, చంద్రగుప్తుడు తనరాజ్య కాలాంతమున భద్రబాహుడను జైన మతగురువు వెంబడి మగధనుండి మైసూరునకు వచ్చి చేరి, అందు కొంత కాలము జైన భిక్కువలె కాలము గడిపి తుదకు అందే మృతి నొందెనని తెలియవచ్చుచున్నది. శ్రావణ బెళ్ గొలాయందు దొరికిన శాసనములు భద్రబాహుని పేరును, చంద్రగుప్తుని పేరును తెలుపుచున్నవనియు చంద్రగుప్తునిపేరిట దేవాలయములు గుట్టలు గలవనియు తెలియవచ్చుచున్నది. కళింగదేశచరిత్ర పుట 445
శ్రీయుత రాళ్లబండి సుబ్బరావు, ఎం. ఏ. ఎల్. టి.,

126-వ పద్యము — "Many farewell audiences were given at the palace and at last Asoka rode away from Taxila' heavy-hearted, to take up the Viceroyalty of Ujjain.".

Page 147

"A merchant banker was appointed Director of his studies. Page 147

"He stalked Asoka and the beautiful Devi down alleys fragrant with madhavi creeper until the night birds burst into song". Page 149

"Devi's beauty and charm were known throughout the land and though her's was not royal blood Bindusara accepted his son's choice" Page 150

"During the next few years, in Ujjain, a boy and a girl were born to Devi and Asoka, whom they named Mahendra and Sanghamitra" Page 151

From "When Peacock's called"
by Mrs. Hilda Seligman.

185-వ పద్యము — From his earliest years Prince Asoka had been fired by his tutors with the stories of the great deeds of his mighty father and of his still mightier grand-father's, "Well, it is n't!" Asoka would shout with a great laugh "Its about battles and fights and swords and spears and horses and elephants and my father and grand father and how they drove the Greeks out of India like a flock of crying sheep. And then old Amrasar would smile a little sadly and say "Ah, Asoka, its always battles and battles and battles" From "Man's great Adventure"
by Stephen Southwold.

## —♦ రెండవ యాశ్వాసము. ♦—

2-వ పద్యము- భారతము॥ "తత్రేమే కురుపాంచాలాః శాల్వా
మాద్రేయ జాంగలాః,

శూరసేనాః కళింగాశ్చ కిరాతానాంచ జాతయః॥ భీష్మప॥

అయం కపాటేన జఘానపాండ్యం

తథాకళింగాన్ దంతకూరే మమదర్యన్॥ ఉద్యోగ ప॥

రామాయణము- వ్యపాయాద్రాఘువస్తూర్ణం తీర్త్వాశోణాం
మహానదీం,

కళింగనగరేచాపి ప్రాప్య సాలవనం తదా॥ అయోధ్యకా॥ 71 స॥

రఘువంశము॥ సతీర్త్వాకపిశాం సైన్యైః బద్ధద్విరదసేతుభిః,

ఉత్కలైర్దర్శిత పథః కళింగాభిముఖోయయౌ॥ 4-వ స॥ 38 శ్లో॥

కళింగదేశచరిత్ర, పుట 168—73

శ్రీ గాదె నరసింగరావు, బి. ఏ., ఎల్. టి.,

15-వ పద్యము- "ఇప్పటి శ్రీకాకొళం రైలుస్టేషనుకు దగ్గరగా నున్న పాడుపడిన మట్టిదిబ్బకోట దందవక్త్రని కోటగా చెప్పబడుచున్నది. ఇదియే దంతపురము కావచ్చును. ......... అనంతవర్మ చోడగంగుని కాలమునుండి రాజధాని కటకమునకు మార్చుటచేత దంతపురము పాడు పడి యుండును" (అదియే కళింగమల్లుని రాజధానిగా గ్రహింపబడు చున్నది. ఇచ్చట కళింగమల్ల మహేంద్రవర్మలు నాయకులుగా కల్పింప బడుచున్నారు) కళింగదేశచరిత్ర పుట 437

32-వ పద్యము - "కళింగదేశము చంద్రగుప్తుని కాలముననే మగధ సామ్రాజ్యమునకు లోబడియుండెనని వాదము గలదు. అశోకుని

కాలము నాఁటికి కళింగమును అనేక రాజులు పాలించుచుండిరని తెలియు చున్నది. వారికే దక్షిణరాజ కూటమని పేరు, కాళింగులు అశోకునకు లోబడకుండ స్వతంత్రులు కావలయుననియు, అందు కళింగమల్లుడు ప్రధాన నాయకుడనియు అందు మూలమున వారిలో ఐకమత్యము చెడి అశోకునితో యుద్ధము చేయవలసివచ్చెననియు తోచుచున్నది.

**199**-వ పద్యము- ''మహాభారతమునం దారితేరిన కళింగవీరుల సంతతివారు తమ స్వతంత్రమునకై బహుధైర్య సాహసములతో పోరాడి వేలవేలు చచ్చియుండిరి" కళింగదేశచరిత్ర పుట **446**

శ్రీయుత, రాళ్లబండి సుబ్బరావు, ఎం. ఏ., ఎల్. టి.,

**213**-వ పద్యము- "ఏలయన నశోకుని కాలమందును, తత్పూర్వ మును కళింగరాజధాని ప్రస్తుత భువనేశ్వర క్షేత్రమునకు సమీపమం దున్న తోసలినగరమనుట నిర్వివాదాంశము. ఆవెనుక 'చేట' వంశీయులు కళింగమును స్వతంత్రముచేసి చిల్కసముద్రమునకు రేవుపట్టణమగు కళింగనగరి రాజధానిగా జేసిరి''. కళింగదేశచరిత్ర పుట **269**

శ్రీయుత, నీలకంఠదాస పండితులు, ఎం. ఏ. ఎం. ఎల్. ఏ.,

"ఇట్టి పశ్చాత్తాపమును తెలుపునవియే యాతని ధౌలి, జౌగడ, శిలా శాసనములు, ధౌలి, జౌగడ గ్రామములు రెండును కళింగదేశము లోనివే. పూరీజిల్లాలోని భువనేశ్వరమున కేడుమైళ్ల దూరమున ధౌలియను గ్రామము గలదు. దీనికే పూర్వము తోసలియని పేరు. ఈగ్రామ సమీ పమునందలి యొకగుట్టమీాద ఈ శిలాశాసనములు క్రీ॥ పూ॥ **255** వ సం॥న చెక్కబడినవి. అశోకునిచేత గిర్నారులోను, కాల్సీలోను చెక్కింపబడిన **14** శిలాశాసనములలో **11-12-13** తప్ప మిగిలినవన్నియు ఇందు గలవు.

మరియు రెండు ప్రత్యేక శిలాశాసనములు గలవు. ఇవి కళింగరాజ్యము నకు సంబంధించినవి.”

కళింగదేశచరిత్ర పుట 446. శ్రీ॥ రా॥ సు॥ రావు.

“ఈశాసనములు నూతనముగా తనచే జయింపబడిన కళింగము లోని తోసలి, సమాప, (సోంపేట) నగర వ్యవహారికులకు, (మహా మాత్రులకు) ప్రజలకు ననుకూలముగా రాజ్యము చేయుమని సలహా నిచ్చుచు వ్రాయబడినవి. జయింపబడిన కళింగము వైతరణీ, లాంగుల్య నదుల మధ్యనున్న దేశము”.

కళింగదేశచరిత్ర పుట 148 శ్రీ॥ రా॥ సు॥ రావు.

239.వ పద్యము— All his life he had waited and waited, dreaming of this hour and now it was come, the power and the glory were his and all his dreams should come true".

From "Man's Great Adventure"
by Stephen Southwold.

240.వ పద్యము – "During the war according to his own statement 1,50,000 persons had been led into captivity 1,00,000 had been slain, and of the ordinary people many times that numbers had perished, through want, violence and misery. The loss of even the hundredth or the thousandth part of the persons who then were slain carried away captive. or done to death in Kalinga would now 'says Asoka in an edict published about B. C. 256' be a matter of deep regret to his Majesty."

Page 70 From "A History of India"
Part I The Pre musalman period
by K. V. Rangaswamy Aiyangar, M. A.,

---

## —◆ మూఁడవ యాశ్వాసము. ◆—

2-వ పద్యము- "గౌతమబుద్ధుఁడు తనకుఁ బూర్వము బుద్ధులు కొందఱుండిరని తన ప్రసంగంబులయందు సూచించుచు వచ్చెను. ఈయన క్రీ॥ పూ॥ 6-వ శతాబ్ద మధ్యమున జన్మించియుండునని కొందఱును, క్రీ॥ పూ॥ 557 సం॥న జననం బొందెనని మఱి కొందఱును నభిప్రాయులై యుండిరి. కావున గౌతమబుద్ధుఁడె బౌద్ధమత నిర్మాత కాఁడు. అయినను గౌతమబుద్ధునికిఁ బూర్వము బౌద్ధమతము మిగుల సంకోచావస్థలో నుండుటంజేసియు, నాయన స్వయంకృషివలన నది మిగుల నభివృద్ధియై వికాసావస్థ నొంది యుండుటంజేసియుఁ దన్మత నిర్మాత గౌతమ బుద్ధుఁడేయని జనులు గౌరవముతో భావించిరి."

అశోకమహారాజ చరిత్ర పుట 212
శ్రీయుత బేతపూడి లక్ష్మీకాంతరావుగారు.

15-వ పద్యము- "పదార్థ సంయోగ జనితములైన యీశరీరములకు వియోగము తప్పదు. ధర్మకాయ మొకటియె శాశ్వతమైనది, జ్ఞానమును వెదకి స్వయంకృషివలన నిర్వాణంబు నొందుఁడు"

అశోక మహారాజు చరిత్ర 224

16-వ పద్యము- పంచస్కంధములు (1) రూపము (2) వేదన (3) విజ్ఞానము (4) సంయోజనము (5) సంస్కారము.

21-వ పద్యము- అష్టాంగములు-

1. శుద్ధవిశ్వాసము (సమ్యగ్దృష్టి)
2. శుద్ధాపేక్ష (సమ్యక్ సంకల్పము)
3. శుద్ధవాక్కు (సమ్యగ్వాక్కు)

4. శుద్ధకర్మ (సమ్యక్కర్మ)
5. శుద్ధజీవనము (సమ్యగ్జీవనము)
6. శుద్ధప్రయత్నము (సమ్యగ్వ్యాయామము)
7. శుద్ధచింతన (సమ్యగ్ స్మృతి)
8. పూర్ణశాంతి (సమ్యగ్సమాధి)

త్యాజ్యములు- 1. సుఖాపేక్ష 2. శరీరమును తపస్సుచే శోషింపఁజేయుట.

ప్రతిబంధ దశకము-
1. సత్కాయదృష్టి
2. సర్వసంశయ మతము
3. శీలవ్రత పరామర్శ
4. కామము
5. ద్వేషము
6. రూపవిషయాభిలాష
7. అరూపవిషయాభిలాష
8. మానము
9 బౌద్ధత్వము
10. అవిద్య

ఆఱు నిబంధనలు-
1. దానము
2. క్షాంతి
3. ప్రజ్ఞ
4. శీలము
5. వీర్యము
6. ధ్యానము

అపరాధ దశకము-
1. జీవజంతువును వధించుట,
2. దొంగతనము
3. వ్యభిచారము
4. అబద్ధమాడుట
5. కొండెము చెప్పుట
6. దుర్భాషలాడుట
7. వృథాప్రసంగము
8. పరద్రవ్యాపేక్ష
9. ద్రోహపు తలపు
10. అసత్యాభిప్రాయము

షడకృత్యములు-
1. సురాపానము
2. అకాలములయందు వీధులవెంట దిరుగుట
4. జూదము
5. దుష్టసహవాసము

3. నాట్యాదులయం
దత్యంతాపేక్ష    6. సోమరితనము

సద్గుణములు-    1. మైత్రి    4.
2. కరుణ
3. ముదిత (ముదము)

29.వ పద్యము — "In the seventeenth and eighteenth years of his reign, he decided definitely upon his line of action and proclaimed the principles of his government to his people in a series of edicts engraved upon the rocks, including the Minor Rock Edict 1 and the fourteen Rock Edicts, and laying down the general rules which must guide the conduct of the lieges.

Page 166 V. A. Smith.

32-వ పద్యము- రజ్జుకులు- ప్రతినిధులకు క్రింది యధికారులు (Commissioners)

ప్రాదేశికులు- మండలకార్య నిర్వాహకులు- (Collectors)

మహామాత్రులు- దండనాధికారులు (శిక్షలవిధించువారు)

ధర్మాధికారులు- (ధర్మ మహామాత్రులు). ధర్మమును బోధించువారిని ధర్మమహామాత్రులని, ధర్మాధికారులని పిలిచిరి. ఈ శాఖను అశోకుఁడు క్రొత్తగా సృష్టిచేసెను. 5_వ శిలాశాసనము చూడుడు.

నివేదకాధికారులు (Reporters)

34-వ పద్యము— "The administration of Asoka, like that of his Predecessors, was carried on by a large body

of graded officials. But here and there he made certain changes for better government. The most important innovations were the institution of periodical tours of officers to prevent miscarriage of justice and the establishment of a new department for the spread of Dharma or the law of piety. This department was provided with a new class of officers called Dharma-mahamatras or censors whose duty it was to enforce Dharma among people of all religions and ranks, including members of the royal family."

Page 80 V. A. Smith

43-వ పద్యము- ."ఈజిప్టుదేశమునం దాకాలమున నున్నట్టువలె నీరు పాఱుదలచేయు పరిపాలనశాఖ యొకటి యుండెను. ఈ డిపార్టుమెంటులోఁ జేరిన యుద్యోగులు నదులలోనుండి కాల్వలను ద్రవ్వించి తూములేర్పఱిచి మాగాణి వ్యవసాయకులకు వలసినంత నీటి నిచ్చుచుండిరి. అశోకునిచే సౌరాష్ట్రదేశమున కధికారిగా నియమింపఁబడిన పారసీక ప్రభువు చంద్రగుప్తుని కాలములోఁ ద్రవ్వింపఁబడిన గిరినగరము మడుగునుండి కాలువలను ద్రవ్వించి వంతెనలను గట్టించి నీరు పాఱుదల చేయించియుండెనని క్రీ॥ శ। 150 సం॥లోఁ బ్రచురింపఁబడిన రుద్రదామను Rudradaman) అను శాసనమువల్లఁ గన్పట్టుచున్నది. సౌరాష్ట్రదేశము పాటలీపుత్రమునకు 1000 మైళ్ళ కంటె నెక్కువ దూరమున నున్నది.

అశోకమహారాజు చరిత్ర పుట 108
శ్రీ॥ బే॥ లక్ష్మీకాంతరావు.

56-వ పద్యము- "పదు నాలుగు శిలాశాసనములు అశోకుఁడు ప్రభుత్వమునకు వచ్చిన 13-14-వ వత్సరంబులలోఁ బ్రచురింపఁబడియె. (క్రీ॥ పూ॥ 257-256) ఈశాసనము లించుమించుగా సంపూర్తిగా నీదిగువ సప్తస్థలములయందున్నవని తోఁచుచున్నవి.

(1) షాబాజుగర్ (Shahbazagrh)
(2) మాన్సిరా (Mansera)
(3) కాల్సి (Kalsi)
(4) సోపారా (Sopara)
(5) గిరినగరము (Girinagarah)
(6) ధౌలి (Dhauli)
(7) జౌగద (Jaugada)

58-వ పద్యము- a. చోళరాజ్యమునకు రాజధాని ఉరయూరు (Uraiyur) ఇది తిరుచునాపల్లి దగ్గర నుండెను.

b. పాండ్యరాజ్యమునకు రాజధాని మధుర
c. కేరళరాజ్యము, ఇది మలబారు తీరమున నుండెను
d. సత్రపురాజ్య మెక్కడనుండెనో తెలియదు
e. సిరియాదేశపురాజు అంటయోకసు (ఆతనికి లోబడినరాజు లెవరో)

63-వ పద్యము- ప్రతిసంవత్సరమందును నెనిమిదవ మాసమున విగ్రహముల కుత్సవము చేయుదురు. వారు నాలుగు చక్రముల రథమును కట్టి దానిమీఁద బొంగులతో నయిదంతస్థు లేర్పఱిచెదరు. ఈయంతస్థుల కొక స్తంభ మాధారముగా నుండును. దానిని రాజస్తంభ మందురు. దానికి నేటవాలుగఁ గొన్ని గడలును, ఈటెలును, గట్టఁబడును. ఈరథ మిరువదిమూర లెత్తుగా నొక తోపుం బోలియుండును. దీనిచుట్టును తెల్లని పట్టు వస్త్రమును గట్టి దానిపైఁ జిత్రవిచిత్రములయిన రంగులు వేయుదురు" ఈప్రకారముగా కడమ రాజ్యములయందును జరుగుచుండెను."

అశోకమహారాజుచరిత్ర పుట 168-169
శ్రీ॥ బే॥ లక్ష్మీకాంతరావుగారు.

67_వ పద్యము- యవనులు భరతఖండమునకు వాయవ్యమూల నుండు విదేశజాతులవారు వీరు సగము స్వాతంత్ర్యముగల వారయి యుండిరి.

గాంధారులు- ఆఫ్ఘనిస్థానమందుండు కాండహారు (Kandahar) ప్రదేశవాసులు.

కాంబోజులు- వీరును వాయవ్యమూలనుండు నొక తెగవారు.

రాష్ట్రికులు, పైటీనికులు- వీరలెవరో నిశ్చయముగాఁ దెలియలేదు.

92-వ పద్యము- "మహానదినుండి దిగువగా కృష్ణానదికి నవతలి వఱకునుండు బంగాళాఖాతపు తీరప్రదేశము కళింగరాజ్యమయియుండెను. మఱియు దీనికి కళింగరాజ్యత్రయమను పేరుగలదు. (1) అమరావతి (2) ఆంధ్రదేశము లేక వరంగల్లు (3) మధ్యమ కళింగము లేక రాజమహేంద్రవరము. ఈమూడు కళింగరాజ్యములు కలిసి మహాకళింగ రాజ్యమయ్యెను.

రాజచతుష్టయము- (1) ఆంటియోకసు (సిరియాదేశపురాజు)
(2) టోలమి (ఈజిప్టుదేశపురాజు)
(3) ఆంటిగోనసు (మాసిడోనియా దేశపురాజు)
(4) అలెగ్జాండరు (ఎపిరసురాజు)

ఆంధ్రులు- కృష్ణాతీరవాసులయి యున్నారు. వీరి దేశము కళింగ దేశమునకు దక్షిణముగా నుండెను.

పుళిందులు- భరతఖండ మధ్యపరగణాలయందుండిరి.

పిటినికలు- గోదావరితీర మందునుండు "పయిదాన" (Paithana) ప్రదేశవాసులయి యుండవచ్చును. ఈచెప్పఁబడ్డ యడవి జనులందఱు నశోకుని పాలనమందుండిరి." అ॥ మ॥ రా॥ చ॥ పుట 180

(శాసనములు విశేషముగా పునరుక్తములయి యున్నవి. కనుక ప్రతిశాసనమునందును ముఖ్యమయిన యంశములు పద్యములలో వివరింపఁబడియున్నవి)

113-వ పద్యము- "అశోకుఁడు పట్టాభిషిక్తుఁడైన తర్వాత 21-వ సం॥ నుండి స్తంభ శాసనములను ప్రకటించెను. (క్రీ॥ పూ॥ 249) ముఖ్యముగా 7 స్తంభ శాసనములను ప్రకటించెను.

(1) ఢిల్లీలో ప్రా. ఇది కొతిలా శిఖరముమీఁద నున్నది.
(2) ఢిల్లీమీరటు
(3) అలహాబాదు
(4) లారియాఅరరాజ్
(5) లారియానందగఢ్
(6) రాంపర్వా
(7) సాంచి
8) నిగ్లివియా
(9 రుమ్మిందె

విస్తరభీతిచే విడిచితిని. వివరములను చరిత్రలనుండి తెలిసికొననగును.

అ॥ మ॥ రా॥ చ॥ పుట 137-139

153-వ పద్యము- ఈలలితాపురమును అశోకుఁడే కట్టించెనని చెప్పుదురు.

160-వ పద్యము- ఖారవిలుడు (ఖారవేలుడు) అశోకుని యనంతరము కళింగరాజ్యము పునురుద్ధారణము జెంది చేటియు లను చైత్రులచే పాలింపఁబడినది. వారిలో మూడవ వాడగు ఖారవేలుడు ఉదయగిరి యందు శాసనమును క్రీ॥ పూ॥ 158-వ వత్సరమున జెక్కించెను. అందు కళింగరాజ్యముయొక్క మతమును, తరతమును, శక్తియు, రాజ్యముల జయించి స్థానిక స్వపరిపాలనము నుద్ధరించుటయేకాక బ్రాహ్మణులను, విద్వాంసులను పెక్కుమందిని ఆదరించుటయు వర్ణింపఁబడినది. శాసనా

రంభమున అర్హతసిద్ధుల సంబోధించుటచే నీతడు జైనుడని అనుమానించ దగినను, యీవెనుక రాజసూయ యాగము చెప్పబడుటవలన అనుమానము తగ్గుచున్నది. జైనపండితుల కీతడిచ్చిన దానములవలననూ, జైనాలయముల నతడు స్థాపించిన రత్నఖచిత ద్వారబింబముల వలనను, శ్రామణకుల సంఘములకొరకు చెక్కించిన గుహాలవలనను ఈతనికి జైన మతమందుండు నభిమానము వ్యక్తమాచున్నది. బ్రాహ్మణుల సంఘముల కీతడిచ్చిన దానములచే నతని నిష్పక్షపాతబుద్ధి తెలియ వచ్చుచున్నది."

కళింగదేశచరిత్ర పుట 102

శ్రీయుత కె. ఆర్. సుబ్రహ్మణ్యంగారు, ఎమ్. పి.,

178-వ పద్యము- "అశోకుడు 130 స్తూపములను గట్టించెనని హుయాన్‌సియాంగు వ్రాసెను. ఇవిగాక యాయన యనేక మఠాదులను గట్టించినట్లు పురాణములవలనఁ దెలియవచ్చుచున్నది."

చూ॥ అ॥ మ॥ రా॥ చ॥ పుట 97-98

శ్రీ బే॥ లక్ష్మీకాంతరావుగారు.

204-వ పద్యము- శీజరు-(రోమక చక్రవర్తి)

చార్లెసు- ఇంగ్లాండుదేశపురాజు.



దేశబంధూముద్రాక్షరాలయమున ముద్రింపబడియె.

# తప్పొప్పుల పట్టిక.



| పుటము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 5 | పొలపుగ | పొలుపుగ |
| 7 | 15 | భ్రూకుట | భ్రూకుటి |
| 7 | 16 | నిప్పులరాల | నిప్పులురాల |
| 7 | 23 | గాఁదలె | గాఁడలె |
| 9 | 21 | లానెంతే | తత్ప్రేక్ష |
| 10 | 17 | హాంకారద | హాంకార హుంకారద |
| 11 | 9 | పాటలిపుత్రమందు | పాటలిపుత్రమందు |
| 11 | 18 | మాఱిపోయెవా, | మాఱిపోయెనా, |
| 11 | 20 | నొందంగ, | నొందఁగ |
| 13 | 18 | మెల్లడ | మెల్లెఢ |
| 13 | 23 | సర్వధర్మాల | సత్యధర్మాల |
| 15 | 3 | లెఱుంగువ | లెఱుంగున |
| 15 | 9 | రొక్కొటి | రొక్కొకటి |
| 19 | 10 | గిరగిరాలాడించు | గిరగిరలాడించు |
| 21 | 7 | నమ్రాట్టు | సమ్రాట్టు |
| 21 | 13 | నమయంబు | సమయంబు |
| 24 | 23 | లెసంగ | లెసంగె |
| 28 | 15 | పెట్టి | పిట్ట |
| 30 | 18 | తెళ్లు | లేళ్లు |
| 31 | 17 | తెమ్మెర | తెమ్మెర |
| 35 | 19 | భారము | భావము |

| పుటము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 36 | 4 | చేరఁడు | చేరఁడ |
| 36 | 24 | డనియెడి | ననియెడి |
| 37 | 17 | పరవారము | పరివారము |
| 41 | 8 | మహేంద్రి | మాహేంద్రి |
| 41 | 24 | లాంగని | లాంగలి |
| 45 | 14 | పాఠశాలను | పాఠశాలల |
| 46 | 6 | కుమాపలు | కుమారులు |
| 47 | 11 | దక్షిణా | దక్షిణ |
| 55 | 10 | లై చెదరు | నై చెదరు |
| 69 | 16 | నృపపుంగవు | నృపుతోడిది |
| 69 | 19 | మంగడు | మగండు |
| 74 | 6 | గొల్చుచు | గొల్వుచు |
| 79 | 15 | బడ్గ | బడ్డ |
| 109 | 15 | మేను | మేలు |
| 115 | 1 | ఋత్యంత | ఋత్వంత |
| 118 | 18 | గుణి | గుళి |
| 120 | 4 | వారణాశి | వారణాసి |
| 120 | 6 | మరంబు | మఠంబు |
| 127 | 3 | భిన్న | ఖిన్న |
| 127 | 6 | చక్షులై | చక్షువై |
| 127 | 23 | భిక్షులై | భిక్షువై |
| 128 | 10 | లిట్టిట్టు | లట్టిట్టు |
| 129 | 17 | ఘనుఁడితఁడౌనె, | ఘనుఁడితఁడౌను |